చరిత్రాత్మక

# ఆంధ్ర రైతు రక్షణ యాత్ర

జులై 1937 - మార్చి 1938






కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి

# ఆంధ్ర రైతు రక్షణ యాత్రలో పాల్గొన్న అమర వీరులు


శ్రీ ఎన్.జి. రంగా


శ్రీ సంకు అప్పారావు


శ్రీ ఎస్. ఆనందరావు


శ్రీ మహీధర రామమోహనరావు


శ్రీ కాట్రగడ్డ మధుసూధనరావు


శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావు


సుంకర వీరభద్రరావు


శ్రీ చలసాని వాసుదేవరావు


శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య


శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడు


శ్రీ కాట్రగడ్డ నారాయణరావు


శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు


శ్రీ ఉద్దరాజు రామం


శ్రీ ముక్కామల నాగభూషణం

చరిత్రాత్మక

# ఆంధ్ర రైతు రక్షణ యాత్ర

జులై 1937 - మార్చి 1938


కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి


చలసాని వాసుదేవరావు

ఆచార్య వకుళాభరణం రామకృష్ణ

కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావు,
ఏటుకూరి బలరామమూర్తి మెమోరియల్ ట్రస్ట్
**విజయవాడ**

**చరిత్రాత్మక ఆంధ్ర రైతు రక్షణ యాత్ర**

ఆచార్య వకుళాభరణం రామకృష్ణ

వెల :

ప్రచురణ :

**కొమ్మారెడ్డి, చలసాని, ఏటుకూరి**
**మెమోరియల్ ట్రస్ట్**
విజయవాడ.

ప్రతులు :

**విశాలాంధ్ర బుక్‌హౌస్**

ముద్రణ :

**శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్**
సీతారాంపురం, విజయవాడ-2.
ఫోన్స్ : 431422, 439463.

B



రైతు ఉద్యమ నాయకులు,
స్వాతంత్ర్య సమరయోధులు,
సీనియర్ కమ్యూనిస్టు నేత
**కామ్రేడ్ వై.వి. కృష్ణారావుగారికి**
**అంకితం**

# ఇందులో....



D

# ముందుమాట

"నేను కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభదినాల్లో దేశ పరిస్థితిని చూసినప్పుడు స్వాతంత్ర్య సముపార్జన, ఫ్యూడల్ వ్యవస్థ నిర్మూలన ఇంత త్వరలో జరుగుతాయని అనుకోలేదు. కాని యిప్పుడు చూస్తే భారతదేశంలో ఇవి ఎంత త్వరగా జరిగిపోయాయి అనిపిస్తుంది. ఇది భారతదేశ చరిత్రలో ఒక పెద్ద మూలమలుపు. దీనిలో పాల్గొన్న మా తరం వారివలె తర్వాత తరాలవారు దీని ప్రాముఖ్యతను గమనించలేకపోవచ్చును. ఈ మార్పులో కమ్యూనిస్టు పార్టీ గణనీయమైన పాత్రను నిర్వహించిందని సగర్వంగా చెప్పవచ్చు."

1977 జూన్ 22వ తేదీన విశాలాంధ్ర దినపత్రిక రజతోత్సవం జరుపుకుంటున్న సందర్భంలో ప్రచురించిన ప్రత్యేక సంచికకు నాటి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు వ్రాసిన మాటలు ఇవి : ఆనాటికి 50 యేళ్ళు పైబడిన ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం, అది నిర్మించిన రైతాంగ తదితర ప్రజాతంత్ర ఉద్యమాలు ఏమి సాధించాయి ? అన్న ప్రశ్న వేసుకుని చండ్ర రాజేశ్వరరావుగారు దానికి సమాధానం చెబుతూ ఆంధ్రదేశంలో ఫ్యూడల్ వ్యవస్థ నిర్మూలన ఎలా జరిగింది ? అందుకు కమ్యూనిస్టు ఉద్యమం, రైతాంగ ఉద్యమం ఎన్ని మహత్తర పోరాటాలు జరిపిందీ అత్యంత ప్రముఖంగా వివరించారు.

ఈనాడు మూడు నాల్గు దశాబ్దాలు గడిచిన తరువాత చండ్ర రాజేశ్వరరావుగారు పేర్కొన్నట్లు ఈ చారిత్రక పరిణామాల ప్రాముఖ్యత మరింత ఎక్కువగా సంతరించుకున్నదేగాని తగ్గిపోయే ప్రసక్తిలేదు.

ఆంధ్రప్రదేశ్ జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థలు (కొన్ని అవశేషాలున్నప్పటికీ) అంతరించాయి అని అంటే ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం, అది నిర్వహించిన రైతాంగ ఉద్యమాలు లేనిదే ఈ వ్యవస్థాగతమైన పరిణామాలు జరిగి వుండేవి కావు. ఆంధ్రప్రదేశ్‌లో ఆర్థిక, సామాజిక పరిణామాలు ఒక్కడుగు ముందుకు వేసేవికావు.

1930 దశకం రెండవ అర్ధభాగం నుండి ఆంధ్రప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీ, రైతాంగ ఉద్యమాలు, వ్యవసాయ కార్మికోద్యమాలు - బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ పరిపాలనను, తమ ఆర్థిక దోపిడీని సాగించుకోడానికి వారు నిర్మించిన దళారీవర్గాన్ని, జమీందారీ వర్గాన్ని, దాని మాతృక అయిన ఫ్యూడల్ వ్యవస్థను ఎదుర్కొని బ్రహ్మాండమైన పోరాటాలు జరిపాయి. జాతీయ కాంగ్రెస్ నాయకత్వాన సాగిన సామ్రాజ్య వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటాన్ని - ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంగా విస్తరింపచేయాలన్న నిర్దిష్ట సైద్ధాంతిక దృక్పథంతో ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం, రైతాంగ ఉద్యమాలు ఫ్యూడల్ జమీందారీ వ్యవస్థపై సమరభేరీ మ్రోగించాయి. చల్లపల్లి, వెంకటగిరి, మునగాల, ఎలమర్రు, మందాసా, కాళీపట్నం, గోపాలపురం ఒకటేమిటి ? యావదాంధ్రదేశంలో ఉన్న జమీందారీలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటాలు సాగించాయి. ఆనాటికి ఆంధ్ర ప్రాంతంలో నూటికి 40 వంతుల భూభాగం జమీందార్ల మొఖాసారు, ఈనాందారీల క్రింద ఉండేది. అంటే ఆంధ్రప్రాంతం వ్యవసాయార్థిక వ్యవస్థకు ఈ జమీందారీ

విధానం ఎంత గుదిబండగా ఉండేదో, ఆనాటి ఆంధ్రలో దాదాపు సగభాగం రైతాంగం ఎంత కృంగి కృశించిపోయి ఉందో అర్థం చేసుకోవచ్చు.

ఆంధ్ర ప్రాంతంలో 1930-40 దశకంలో ఈ జమీందారీ వ్యతిరేక రైతాంగ పోరాట వెల్లువను మించి, 1940 దశకం రెండవ అర్ధభాగంలో తెలంగాణాలో జాగీర్దారీ, దేశ్‌ముఖ్, పటేల్, పట్వారీ ఫ్యూడల్ వ్యవస్థల వ్యతిరేక పోరాటం జరిగింది. చివరకు ఇది నైజాం నవాబు ఫ్యూడల్ రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా సాయుధ పోరాటంగా విజృంభించి కరడుగట్టిన జాగీర్దారీ ఫ్యూడల్ వ్యవస్థ కూలద్రోయడానికి దారితీసింది. ఆంధ్రప్రదేశ్‌లో ఫ్యూడల్ వ్యవస్థ ఈ విధంగా ఈ చరిత్రాత్మక పోరాటాల ఫలితంగా అంతం చేయబడింది.

ఈ చరిత్రాత్మక పోరాటంలో సువర్ణాక్షరాలలో లిఖించదగింది, ఆంధ్రప్రాంతంలో జమీందారీ వ్యవస్థ రద్దుకు నాంది పలికిందీ - అపూర్వమైన ఆంధ్ర రైతు రక్షణ యాత్ర. 1937 డిసెంబరులో నేటి శ్రీకాకుళం జిల్లాలోని ఇచ్ఛాపురం నుండి బయలుదేరి 1500 మైళ్ళు కాలినడకన మద్రాసు చేరి నాటి మద్రాసు శాసనసభకు, జమీందారీ విధానం రద్దుచేయవలసిందిగా గొప్ప విజ్ఞాపన పత్రం సమర్పించింది. 130 రోజులు సాగిన ఈ రైతు రక్షణ యాత్ర ఆంధ్రదేశంలో లక్షలాది జమీందారీ రైతాంగాన్ని కనివిని ఎరుగని రీతిగా మేల్కొల్పింది. ఈ రైతు రక్షణ యాత్రకు ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ నాయకులు శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావుగార్లు నాయకత్వం వహించారు. యన్.జి. రంగా, గౌతు లచ్చన్న తదితర ప్రముఖ రైతాంగ నాయకులు పాల్గొన్నారు. ఈ రైతు రక్షణ యాత్ర, గాంధీజీ నాయకత్వాన జరిగిన ఉప్పు సత్యాగ్రహ యాత్రతో పోల్చదగిందని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి వంటి స్వాతంత్ర్య సమరయోధులు వేనోళ్ళ ప్రశంసించారు. జమీందారీ వ్యతిరేక పోరాటాలకు ఈ రైతు రక్షణ యాత్ర నాంది పలికిందని సర్వేసర్వత్రా జాతీయోద్యమ ప్రముఖులందరూ జేజేలు పలికారు. చిట్టచివరకు ఆంధ్రప్రాంతంలోనే గాక మద్రాసు రాష్ట్రమంతటా ఫ్యూడల్ జమీందారీ విధానానికి చరమవాక్యం పలికిన జమీందారీ రద్దు చట్టానికి మద్రాసు రాష్ట్ర శాసనసభ ఆమోదముద్ర పడిందంటే అందుకు ప్రధాన కారణం యావద్భారతదేశ దృష్టిని ఆకర్షించిన ఆంధ్ర రైతు రక్షణ యాత్రయేనని చెప్పవచ్చు.

ఆంధ్ర రైతు రక్షణ యాత్ర జరిగి సుమారు అర్ధ శతాబ్దం గడుస్తున్నప్పటికీ, ఈ యాత్ర చారిత్రక ప్రాధాన్యత ఎంత మాత్రం మాసిపోలేదని చెప్పడానికి ఇప్పుడు హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం ప్రొఫెసర్, సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, మార్క్సిస్టు మేధావి అయిన డాక్టర్ వకుళాభరణం రామకృష్ణగారు రచించిన ఈ అమూల్యమైన గ్రంథం ప్రబల నిదర్శనమని చెప్పవచ్చు.

ఆంధ్ర ప్రాంతాన్ని మొత్తం ఆంధ్రప్రదేశ్‌ను ఆర్థిక, సామాజిక రంగాలలో తదుపరి పరివర్తన దశలకు ఈ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం, అందులో ప్రధాన చోదకశక్తిగా పనిచేసిన ఆంధ్ర రైతు రక్షణ యాత్ర ఎంత కీలకపాత్ర నిర్వహించిందో డాక్టర్ రామకృష్ణ అత్యంత ప్రతిభావంతంగా చిత్రించారు. ఈ పరిశోధక గ్రంథానికి వారు వ్రాసిన ఉపోద్ఘాతంలోనే ఈ

రైతు రక్షణ యాత్రకు గల చారిత్రక ప్రాధాన్యతను పేర్కొన్నారు. గత సహస్రాబ్దిలో చరిత్ర గమనాన్ని నిర్దేశించిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రధాన అంతర్భాగంగా ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం సాగిన విషయం ప్రస్ఫుటంగా చెప్పారు. నేడు ఆంధ్రప్రదేశ్ రైతాంగం ఎదుర్కొంటున్న వ్యవసాయార్థిక సంక్షోభం మరో రూపంలో అర్ధశతాబ్దం క్రిందట ఎదుర్కొన్న సంక్షోభాన్ని పోలి ఉన్న సంగతి జ్ఞప్తికి తెచ్చారు. ఆనాటి గ్రామీణ రైతాంగాన్ని రైతు సంఘాలు సంఘటిత ఉద్యమం ద్వారా ఎలా సమీకరించి పోరాడిందీ వివరించారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం, వలస దోపిడీ నుండి విముక్తి పొందిన సుమారు 100 దేశాలు ఈనాటికీ అభివృద్ధి క్రమంలో ఎలా వెనుకబడి ఉన్నదీ, ఇందుకు ప్రపంచ పెట్టుబడిదారీ వర్గాల ఆధిపత్యం క్రింద ఉన్న అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు, ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక విధానాలలో ఎలా నయావలస దోపిడీ సాగించుతున్నదీ వివరించారు. ముఖ్యంగా మనదేశం వంటి దేశాలలో రైతాంగం ఆత్మహత్యలు చేసుకొనే దారుణమైన స్థితి ఎలా, ఎందుకు ఏర్పడిందీ గ్రంథకర్త తెలియజేస్తూ, యింత తీవ్ర సంక్షోభం నుండి బైటపడడానికి నేడు రైతాంగం, వామపక్ష ఉద్యమాలు చేయవలసిన పోరాటాలకు స్ఫూర్తినిచ్చే గత శతాబ్దపు ఆంధ్ర రైతాంగ పోరాటాలు ఆనాటి రైతు రక్షణ యాత్రను జ్ఞప్తికి తెచ్చుకోవాలని పేర్కొన్నారు.

1937 రైతు రక్షణ యాత్రకు నేపథ్యం తెలియజేస్తూ బ్రిటిష్ ప్రభుత్వం తన వలస దోపిడీని సుస్థిరం చేసుకోడానికి, భారతదేశ భూ సంబంధాలలో తీసుకువచ్చిన మార్పులు, శాశ్వత శిస్తు పద్ధతి, రైత్వారీ విధానం, మహల్వారీ విధానాల ఫలితంగా ప్రవేశపెట్టిన జమీందారీ ఫ్యూడల్ వ్యవస్థ స్వరూప స్వభావాలను సవివరంగా పేర్కొన్నారు. ఈ విషయాలు నేటి చదువరులకు, పరిశోధకులకు ఎంతో విజ్ఞానదాయకంగా ఉండగలవు.

జాతీయోద్యమం ప్రజా ఉద్యమ స్వభావాన్ని సంతరించుకున్న 1920 దశకంలో గాంధీజీ పట్టణ మధ్యతరగతి వర్గం నుండి గ్రామీణ రైతాంగానికి ఉద్యమాన్ని విస్తరింపజేయడానికి కొంత పరిమితులలోనైనా రైతాంగ సమస్యలను తీసుకున్నారు. చాంపరాన్, బార్డోలీ ఆంధ్రలో పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, పల్నాడు పుల్లరి సత్యాగ్రహం, చీరాల-పేరాల సత్యాగ్రహం అటువంటి కోవకు చెందినవి. అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు విలక్షణమైనది. దానికి రాజకీయ లక్ష్యం కూడా ఉన్నది. ఈ నాల్గు పోరాటాల ప్రత్యేకతలను రచయిత చర్చించారు.

ఆ తరువాత వామపక్ష ఉద్యమం. సోషలిస్టు పార్టీ, ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలు వర్గదృష్టితో రైతాంగ ఉద్యమాన్ని నిర్మించడం మొదలు పెట్టారు. సంఘటిత రైతు ఉద్యమ దశ ప్రారంభమైంది. రష్యాలో అక్టోబరు విప్లవం, సోవియట్ కార్మిక, కర్షక రాజ్య స్థాపన, వర్గ ప్రాతిపదికపై ఉద్యమ నిర్మాణానికి ఉత్తేజం యిచ్చాయి. 1936లో అఖిల భారత కిసాన్ సభ ఏర్పడింది. ఆంధ్రలో అంతకుముందే నీటి తీరువా పన్ను హెచ్చింపు, శిస్తు రెమిషన్, రిసెటిల్‌మెంట్ తదితర సమస్యలపై జిల్లాలవారీగా అనేక సభలు, సమావేశాలు జరిగాయి. తరువాత జమీందారీ

రైతు సమస్యలపై కదలిక ప్రారంభమైంది. అంతవరకు డెల్టా ప్రాంతంలో ధనిక రైతుల నాయకత్వం క్రిందనే ఈ ఉద్యమాలు జరిగాయి.

1936లోఆచార్య రంగా అధ్యక్షుడుగా, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి కార్యదర్శిగా ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం రిజిష్టరైంది. 1937లో నడుబ్రోలులో జరిగిన రైతు మహాసభలో శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి అధ్యక్షులుగా, శ్రీ చలసాని వాసుదేవరావు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. అప్పటినుండి విస్పష్టమైన పోరాట కార్యక్రమంలో రుణ నివారణ, శిస్తు రేట్ల తగ్గింపు సమస్యలతోపాటు జమీందారీ విధానం రద్దు చేయాలనే తీర్మానాలు చేయబడ్డాయి.

అటు పిమ్మట కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ప్రోత్సాహంతో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం ఆధ్వర్యాన జమీందారీ వ్యతిరేక పోరాటాలు ఉధృతంగా ప్రారంభమైనాయి. రచయిత ఈ ఉద్యమ వివిధ దశలను వివరంగా పేర్కొన్నారు. 1937 ఎన్నికలలో కాంగ్రెస్ విజయం, మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడటం, రైతాంగ ఉద్యమ విజృంభణకు మరింత సానుకూల వాతావరణం ఏర్పడింది. గ్రామ గ్రామాన రైతు సంఘాలు ఏర్పడ్డాయి. ఫ్యూడల్ వ్యతిరేక పోరాటానికి రంగం సంసిద్ధమైంది.

1937 డిసెంబరులో చరిత్రాత్మకమైన ఆంధ్ర రైతు రక్షణ యాత్ర పూర్వరంగాన్ని రయిత డాక్టర్ రామకృష్ణగారు ఎంతో పరిశీలన, విశ్లేషణ దృష్టితో వివరంగా పేర్కొన్నారు. రైతు రక్షణ యాత్ర ఇచ్ఛాపురం నుండి ప్రారంభమై మద్రాసు చేరేవరకు వివిధ ప్రాంతాలలో వచ్చిన రైతాంగ వెల్లువను చిత్రించారు.

1990 మే నెలలో ప్రచురించబడిన కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి 50వ వర్ధంతి సంస్మరణ సంచికలో ఆంధ్ర రైతు రక్షణ యాత్ర గురించి సేకరించబడిన సమాచారం ఈ పరిశీలనాత్మక గ్రంథానికి సద్వినియోగమైంది.

"ఆంధ్రప్రదేశ్ రైతు ఉద్యమాలు - పోరాటాలు" పేరుతో ఆంధ్ర రైతు ఉద్యమ ప్రముఖులు, అఖిల భారత కిసాన్ సభ గౌరవాధ్యక్షుడు అయిన వై.వి. కృష్ణారావు గారు వివిధ రైతు ఉద్యమ ప్రముఖుల వ్యాసాలను సంపాదించి, ఆంధ్ర రైతు ఉద్యమ చరిత్రను రెండు భాగాలుగా సంకలనం చేశారు. రెండవ భాగంలో ప్రధానంగా తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట చరిత్రను సేకరించారు. ఆంధ్రప్రదేశ్ రైతు ఉద్యమ చరిత్ర అధ్యయనానికి ఈ రెండు భాగాలు ఆధారంగా ఉన్నాయి.

ఇప్పుడు డాక్టర్ వి. రామకృష్ణగారు రచించిన ఈ "చరిత్రాత్మక ఆంధ్ర రైతు రక్షణ యాత్ర" గ్రంథం చిన్నదైనప్పటికీ రాష్ట్ర రైతు ఉద్యమ చరిత్రలో ఒక మహోజ్వల ఘట్టాన్ని, దాని పూర్వరంగాన్ని, దాని సిద్ధాంతభూమికను తెలుపుతూ రైతు ఉద్యమ కార్యకర్తలకు, చరిత్ర పరిశోధకులకు ఎంతగానో ఉపకరిస్తుంది.

**పరకాల పట్టాభి రామారావు**
స్వాతంత్ర్య సమరయోధుడు,
కమ్యూనిజం మాసపత్రిక సంపాదకుడు

విజయవాడ
16-6-2001

# కృతజ్ఞతలు

శ్రీయుతులు కొమ్మారెడ్డి, చలసాని, ఏటుకూరి ట్రస్ట్ ప్రారంభ సమావేశంలో మాట్లాడడానికి వెళ్ళినప్పుడు, డాక్టర్ రాజా రామమోహనరావు గారికి రైతు రక్షణ యాత్రపై ఒక మోనోగ్రాఫ్ ప్రచురిస్తే బాగుంటుందని సూచించాను. స్వాతంత్ర్యానికి పూర్వం వలసపాలనలో 1930 దశకంలో ఒక బృహత్తర రైతు ఉద్యమం చేపట్టడం సామాన్య విషయం కాదు. దీన్ని గూర్చిన సమగ్ర రచన కూడా వెలువడలేదు. ఇటీవల కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న నూతన ఆర్థిక విధానాల పర్యవసానంగా రైతాంగం ఎన్నడూ ఎరుగని దుస్థితిలో ఉన్న తరుణం ఇది. ఇలాంటి పరిస్థితులు కాకున్నా, దాదాపు ఇంతటి విపత్కర పరిస్థితుల్లో అప్పుడున్న రైతు సమస్యలపై క్రియాశీలక ఉద్యమాన్ని చేపట్టి రైతు సమస్యల్ని పరిష్కరింపబూనుకున్న అప్పటి రైతు యాత్రను నేటి పరిస్థితులకు అన్వయించుకోవాల్సిన అవసరం ఉందని నేను భావించాను. ఈ సూచనకు డాక్టరు గారు అంగీకరించారు. ఆ పని నన్ను చేయమన్నారు. నేను కాదని శ్రీ వై.వి. కృష్ణారావు గారి పేరు సూచించాను. దాదాపు అరవై ఏళ్ళుగా రైతు ఉద్యమంలో పనిచేస్తూ రాష్ట్ర, జాతీయ స్థాయిల్లో నాయకత్వం వహిస్తున్న శ్రీ కృష్ణారావుగారు రాయడం సమంజసంగా ఉంటుందని భావించాను. శ్రీ కృష్ణారావుగారితో ఈ విషయం మాట్లాడాను. తీరికలేని పనుల్లో తన మునకల్లో వున్నాననీ, వ్యవధి లేదనీ చెప్పి నన్నే రాయమన్నారు. ఇదీ ఈ రచనకు పూర్వరంగం.

ముందుగా డాక్టర్ రాజారామమోహనరావుగారికి నా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. రాతప్రతి చూసి మార్పులు-చేర్పులు సూచించిన శ్రీ పరకాల పట్టాభిరామారావు గారికి మా కృతజ్ఞతలు. ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభ దశ నుండి పాల్గొంటూ ప్రముఖ పాత్రికేయులుగా, గ్రంథరచయితగా పేరుగాంచిన శ్రీ పరకాల ఈ పుస్తకానికి పీఠిక రాయడం సబబుగా అనిపించింది. అంతేకాక శ్రీ కొమ్మారెడ్డి 50వ వర్ధంతి సంస్మరణ సంచికను ప్రజ్ఞావంతంగా నిర్వహించి ఆయన ప్రచురించారు. దీనికి సంబంధించి నాతో చర్చించి ఒక అవగాహన కల్పించిన శ్రీ వై.వి. కృష్ణారావు గారికి నా కృతజ్ఞతలు. రాతప్రతిని సిద్ధం చేయడంలో నాకు అన్ని విధాల తోడ్పడిన మిత్రుడు శ్రీ పూలపల్లి వెంకటరమణ (లెక్చరర్, గవర్నమెంట్ కాలేజి) గారికి వ్యక్తిగత అంశం అనుకోకపోతే, రచన చేయడంలో జరుగుతున్న జాప్యాన్ని ఎప్పటికప్పుడు గుర్తుచేస్తూ, డాక్టర్ గారికిచ్చిన మాటను నెరవేర్చమని నన్ను హెచ్చరించి, ప్రోత్సహించిన నా శ్రీమతి డాక్టర్ లలితకు కృతజ్ఞతలు. చక్కగా అచ్చువేసి ముద్రించిన శ్రీ అరుణోదయ ప్రెస్ వారికి కృతజ్ఞతాభివందనాలు.

ఇదే క్రమంలో పత్రికల నుండి, ఆంధ్రప్రదేశ్ ఆర్కైవ్స్ నుండి సమాచారం సేకరించిన నాగార్జున యూనివర్సిటీ శాస్త్రీయ సామ్యవాద అధ్యయన కేంద్రంలో రీసెర్చ్ స్కాలర్ శ్రీ కోటేశ్వరరావు గారికి కృతజ్ఞతలు.

పరిధిలో, ప్రాముఖ్యంలో అతి గొప్పదైన ఈ యాత్ర గురించిన సమాచారం చాలా కొద్దిగా లభించింది. అప్పటి రికార్డులు దాదాపు మృగ్యం. ఏవో ఒకటి రెండు వార్తాంశాలు మినహా పత్రికలు మనకిస్తున్న సమాచారం చాలా తక్కువ. అందువల్ల మోనోగ్రాఫ్ పరిమాణంలో చిన్నదే. వీలున్నంతలో లభించిన సమాచార శకలాలను కూర్చి ఈ రచన చేయడం జరిగింది.

# రైతు రక్షణ యాత్ర

## ఉపోద్ఘాతం

నూతన శతాబ్దం ప్రారంభమై అప్పుడే సంవత్సరం దాటుతోంది. గత శతాబ్దిలో మానవాళి బహుముఖ పురోగతి సాధించింది. మానవ సమాజం అనేక మార్పులకు గురై చరిత్ర గమనాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళింది. రెండు ప్రపంచ యుద్ధాలు, రెండు ప్రధాన సామ్యవాద విప్లవాలు, అణు విస్ఫోటనం, రోదసీలోకి, అక్కడినుండి చంద్రమండలంపై మానవుడు పాదం మోపడం, ప్రపంచ జనాభా పెరుగుదల - ఈ విధంగా అనేకానేక రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, శాస్త్రీయ, సాంకేతిక ఆవిష్కరణలతో ప్రపంచ స్వరూపమే మారిపోయింది.

భారతీయ సమాజం గత శతాబ్దంలో వలస పాలన నుండి విముక్తి చెంది, యాభై ఏళ్ళ కాలంలో స్వావలంబన దిశగా నడుస్తూంది. స్వాతంత్ర్యానంతరం ఆర్థిక పురోగతి గణనీయంగా సాధించినా, అది ప్రజలందరి కనీసావసరాలకు కూడా సరిపోయేటంతగా లేదు. జరిగిన అభివృద్ధికి తగిన విధంగా ఉత్పత్తిని పంచడంలో న్యాయం జరగడం లేదు. తత్కారణంగా ఆర్థిక వ్యవస్థ అనేక సవాళ్ళను ఎదుర్కొంటున్నది.

ఆర్థిక వ్యవస్థలోని సమస్యలను విశ్లేషించే ఉద్దేశ్యం మాకు ప్రస్తుతం ఈ రచనలో లేదు. భారతీయ ఆర్థిక వ్యవస్థకు ప్రధానాంగమైన వ్యవసాయానికి సంబంధించిన కొన్ని అంశాలను మాత్రమే ఈ అధ్యాయంలో స్థాలీపులాక్ న్యాయంగా ప్రస్తావించ దల్చుకున్నాం. ఆ ప్రస్తావన కూడా పరిచయ రూపంలోనే ఉంటుంది. ఎందుకంటే, ఈ మోనోగ్రాఫ్‌లో మేము చెప్పదల్చుకున్నది నేడు వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న తీవ్ర సంక్షోభం గురించి కాదు. కాకుంటే ఇవాళ మనం చూస్తున్న సంక్షోభం లాంటిదే, వేరో రూపంలో అరవై సంవత్సరాల క్రితం ఆంధ్రదేశంలోని రైతాంగం ఎదుర్కొంది. దానికి వ్యతిరేకంగా ఉద్యమాలను చేపట్టింది. గ్రామీణ రైతాంగాన్ని రైతు సంఘాల నిర్మాణం ద్వారా సమీకరించింది. రైతు యాత్రలను నడిపింది. ఈ బృహత్తర ఉద్యమం వలసపాలనలో 1930 దశకం నుండి సంస్థాపరంగా నిర్మించబడిందని మనం గుర్తుంచుకోవాలి.

1980 దశకం నుండి ఆర్థిక రంగంలో ఆరంభమైన మార్కెట్ సంస్కరణలు, 1990 దశకంలో వేగం పుంజుకున్నాయి. ఈ ధోరణి నిశితంగా పరిశీలిస్తే, విశ్వవ్యాప్తంగా అమలు జరుగుతుండడం మనం గమనిస్తాం. ఇది కాకతాళీయంగా వచ్చిన మార్పు కాదు. సోషలిస్ట్ వ్యవస్థ పతనం చెందడంతో, ఏక ధృవ ప్రపంచం ఏర్పాటుకావడం, రాజకీయ ఆర్థిక రంగాల్లో ఒకే ఒక అగ్రరాజ్యం పెత్తనం చెలాయింపబడడం ప్రారంభమైంది. అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ ఆర్థిక వెనుకబాటుతనాన్ని నిర్మూలించుకునే క్రమంలో అంతర్జాతీయ ద్రవ్య సంస్థలను ఆశ్రయించాల్సి వచ్చింది. ఇందులో భాగంగానే ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి,

ప్రపంచ వాణిజ్య సంస్థ తదితర సంస్థలు రంగంలోకి దిగాయి. ఈ దేశాలకు రుణాలివ్వడానికి పూనుకున్నాయి. ఈ రుణాలకు కొన్ని షరతులున్నాయి. అధిక వడ్డీలున్నాయి. తిరిగి చెల్లించే పద్ధతులున్నాయి. ఎన్నున్నా వీరు విధించే షరతులు అభివృద్ధి చెందుతున్న దేశాల్లోని పీడిత ప్రజలకు ఉపయోగపడేవిగా లేవు. ఈ దేశాల్లో దారిద్ర్యం తాండవిస్తూనే ఉంది. విద్య, వైద్య సౌకర్యాలు ప్రజలకు కావల్సినంతగా లేవు. అలాగే ఇతర ప్రాథమిక సౌకర్యాలు - పరిశుభ్రమైన త్రాగునీరు, రవాణా, గృహ వసతులు దాదాపు నూటికి యాభైశాతం ప్రజలకు లేవు. సంక్షేమ ఆశయాలతో, సబ్సిడీలతో, ప్రజోపయోగకర విధానాలతో, ఈ అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు రంగంలోకి రానంతవరకూ, ఈ దేశాలు కొద్దో గొప్పో సంక్షేమ పథంలో నడుస్తూ వచ్చాయి. భారతీయ రాజ్యం (Indian State) ప్రజల బాగోగులను దృష్టిలో పెట్టుకుని తన ఆర్థిక, సామాజిక విధానాలను ఉన్నంతలో రూపొందించుకుంటూ వచ్చింది. ఇవాళ ఈ నూతన ఆర్థిక విధానల వల్ల ఆ వెసులుబాటు లేకుండా పోయింది. సమాజంలోని సమస్తాంశాలను - ఆర్థికం నుండి సామాజిక, సాంస్కృతిక విధానాల వరకూ - మార్కెట్ శక్తులే నిర్ధారిస్తాయన్న పెట్టుబడిదారీ విధాన మూల సూత్రాల కనుగుణంగా ఆర్థిక విధానాలు మలచబడుతున్నాయి.

భారతదేశం ఇవాళ ఈ నూతన ఆర్థిక సంస్కరణల ఊబిలో పీకలదాకా కూరుకు పోయింది. విదేశీరుణం వేలకోట్ల నుండి లక్షల కోట్లకు పెరిగిపోయింది. అసలు రుణం మాట అటుంచి దానిపై ప్రతి ఏటా చెల్లించాల్సిన వడ్డీకే దేశ రాష్ట్ర బడ్జెట్‌లో దాదాపు సగభాగం డబ్బు ఖర్చవుతుంది. భారతీయ సమాజం మౌలికంగా వ్యవసాయక సమాజం. ఇరవై ఒకటవ శతాబ్దిలో, ఇవాల్టికే మన జనాభాలో డెబ్బైశాతం పల్లెపట్టుల్లో జీవిస్తున్నారు. ఇప్పటికీ నాలుగు లక్షల గ్రామాలున్నాయి. వ్యవసాయోత్పత్తులు మన ఆర్థిక వ్యవస్థకు మూడొంతులదాకా ఆర్థిక పరిపుష్టతను చేకూరుస్తున్నాయి. అంటే, మన ఆర్థిక వ్యవస్థకు గట్టి పునాది వ్యవసాయమే ! 'దేశానికి వెన్నెముక రైతు' అనే నానుడి నేటికీ, ముమ్మాటికీ నిజం. ఎంత విస్తృతంగా పట్టణీకరణ జరిగినా, భారతీయ జీవనం, సంస్కృతి, గ్రామ ప్రాంతాల్లోనే కొనసాగుతుంది. వ్యవసాయరంగంలో ఆధునిక పద్ధతులు ప్రవేశించాయి. ఎక్కడో హరిత విప్లవం (Green Revolution) సంభవించిన ప్రాంతాలను మినహాయిస్తే, నేటికీ రైతులు సంప్రదాయ పద్ధతులను, పనిముట్లను ఎక్కువగా వాడుతున్నారు. వ్యవసాయ రంగంలో ఆధునికీకరణ క్రమం పూర్తి కాలేదు. ఎప్పుడో వలసపాలనలో, 19వ శతాబ్దంలో ప్రారంభమైన వ్యాపారీకరణ (Commercialisation) ఇటీవలి కాలంలో కొంత వేగవంతమైనా, అదీ పూర్తి కాలేదు. అభివృద్ధి చెందుతున్న దేశాలు ఆధునిక పద్ధతులనూ, వ్యాపారీకరణనూ, చేపట్టాల్సిందే. కాదనం. అయితే, ఎప్పుడు, ఏ మోతాదులో, ఏ విధంగా జరగాలన్నది చర్చనీయాంశం. ప్రస్తుతం ఈ రెండు ముఖ్యాంశాల చర్చకు ఇక్కడ మా రచనలో చోటు లేదు. దీన్ని ప్రస్తుతానికి పక్కన పెడదాం.

సరళీకృత ఆర్థిక విధానాలు భారతదేశంలో దారితప్పాయనీ, అవి సాధిస్తాయనుకున్న సత్ఫలితాలను సాధించలేకపోయాయనీ, వాటికి 'మానవ ముఖాన్ని' (Human Face) కల్గించాలనీ గత కొద్ది సంవత్సరాలుగా దేశ ప్రధాని నుండి దిగువ స్థాయి రాజకీయ నాయకుల దాకా

వాపోతూనే వున్నారు. దేశంలో సగటు జాతీయ వస్తూత్పత్తి పెరిగింది. సగటు జాతీయాదాయం కూడా పెరిగిన మాట నిజమే. అయితే ఆర్థిక వ్యవస్థలో ఈ రెండు ముఖ్యాంశాలు దేశంలోని దారిద్ర్యాన్ని తగ్గించలేదు. ఉద్యోగవకాశాలను పెంచలేదు. ఇతర సామాజిక అభివృద్ధి అవకాశాలనూ వృద్ధి చేయలేదు. నిరుద్యోగం పెరిగింది. ప్రైవేటీకరణ పుణ్యమాని పరిశ్రమలు మూతబడ్డాయి. జరిగిన అభివృద్ధి ఏ కొద్దిమందికో, దేశంలోని కొన్ని ప్రాంతాలకో పరిమితమైంది.

నూతన ఆర్థిక విధానాల దుష్ఫలితాలు వ్యవసాయ రంగంలో మరింత కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయి. వ్యవసాయ రంగంలోని సంక్షోభం గత పదేళ్ళుగా చాపకింద నీరులా పాకుతూ వచ్చి గత రెండేళ్ళలో తీవ్రరూపం దాల్చింది. ఇవాళ దేశంలో నలభై లక్షల టన్నుల ఆహార ధాన్యాలు గిడ్డంగుల్లో నిల్వ ఉన్నాయి (దేశంలో నలభై శాతం ప్రజలు ఇంకా దారిద్ర్యరేఖ దిగువన ఉన్నారన్న విషయం ఇక్కడ గుర్తుంచుకోవాలి). ఆహారోత్పత్తి ఒక కోణంలో చూస్తే సత్ఫలితామమే. కానీ దీనివల్ల కలిగిన దుష్పరిణామాలేమిటి ? రైతు తాను పండించిన పంటను అమ్ముకోలేని స్థితిలో ఉన్నాడు. సరైన మద్దతు ధర లేదు. పెట్టిన పెట్టుబడి వ్యయానికి సరిపడే ఆదాయం లేదు. ధర వచ్చేవరకు నిల్వ చేసుకోడానికి జాగా లేదు. ఒకవేళ కొందరికి ఉన్నా, అమ్ముకుని అప్పులు తీర్చుకుంటే తిరిగి పెట్టుబడికి ఆస్కారం లేదు. వ్యవసాయానికి అయ్యే ఖర్చులు ఇబ్బడి ముబ్బడయ్యాయి. రసాయనిక ఎరువులు (సబ్సిడీలు రద్దయ్యాక) విపరీతంగా పెరిగాయి. విత్తనాలు, క్రిమిసంహారక మందులు, నీటి తీరువా, విద్యుచ్ఛక్తి, డీజిల్, రవాణా ఖర్చులు గత పదేళ్ళలో విపరీతంగా పెరిగాయి. దీంతో రుణ భారం ఎక్కువయింది. త్వరగా, సులభంగా సొమ్ము చేసుకోవాలన్న ఆత్రంతో పండించాలనుకున్న వ్యాపార పంటలు సరైన రాబడిని ఇవ్వలేకపోతున్నాయి. 'కొనబోతే కొరివి - అమ్మబోతే అడవి' అన్న చందంగా రైతుల పరిస్థితి తయారైంది. ఈ క్రమంలోనే రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం పరిపాటైంది. చనిపోయిన రైతు కుటుంబాలకు పరిహారం చెల్లిస్తే, ఆ పరిహారం కోసమే ఆత్మహత్యలు చేసుకుంటారన్న అమానవీయ ధోరణిని ప్రభుత్వం అవలంభిస్తూంది. నిన్న, మొన్న, ఇవాళ, దేశంలోని రాజకీయ పక్షాలు రైతు సమస్యలే తమ ముఖ్య ధ్యేయమంటూ, వాటిని పరిష్కారిస్తామన్న 'పవిత్ర ఆశయం' తో ముందుకొస్తున్నాయి. ప్రభుత్వమే రైతుల నుండి ధాన్యం కొనుగోలు చేస్తుందనీ, రుణభారాన్ని తగ్గిస్తుందనీ, పంటల భీమా ఏర్పాటు చేస్తుందనీ అనేక శుష్క వాగ్దానాలతో, కల్లబొల్లి కబుర్లతో మరోసారి రైతాంగాన్ని మోసగించడానికి ముందుకొస్తుంది.

ఈ విపత్కర పరిస్థితుల్లో రైతుల ముందున్న కర్తవ్యం ఏమిటి ? ఈ ప్రశ్నకు మనం సమాధానం చెప్పుకునే ముందు ఒకసారి గత శతాబ్దంలో 1930వ దశకంలో ఆంధ్రదేశంలో రైతాంగం ఇలాంటి సంక్షోభంలో చిక్కుకున్నప్పుడు చేపట్టిన కార్యక్రమం ఏమిటి ? ప్రధానంగా రైతు సమస్యలపై 1938లో నిర్వహించిన రైతు రక్షణ యాత్ర గురించిన కథ, కమామిషు తెలుసుకుందాం. దానికి నేపథ్యంగా రైతు ఉద్యమాల పుట్టుక, పెంపుదలల గూర్చి క్లుప్తంగా తర్వాత అధ్యాయంలో చెప్పుకుందాం.

# నేపథ్యం

భారతదేశంలో ఆంగ్లేయుల వలస పాలన 18వ శతాబ్దపు మధ్యభాగానికి, బెంగాల్ ఆక్రమణ (1757)తో స్థిరపడింది. క్రమేపీ ఇతర ప్రాంతాల్లో ముఖ్యంగా, దక్షిణ భారతదేశంలో కాళ్ళూనుకుంది. వలసపాలన ఆరంభమే భారతదేశంపై ఆర్థిక దోపిడికి నాంది పలికింది. ఆంగ్లేయులు తమ పాలన ప్రారంభదశలో దాదాపు ఒక శతాబ్దం పాటు, సుమారు 1857 వరకు, అనేకానేక ఆర్థిక, పరిపాలన, విద్య, వైజ్ఞానిక, సాంఘిక సంస్కరణల ద్వారా భారతీయ సమాజ పునాదుల్ని మార్చడానికి కృషి చేశారు. ఆర్థిక సంస్కరణల్లో ప్రధానమైనవి వ్యవసాయ సంస్కరణలు. ఇవి భూ సంబంధాల్లో పెనుమార్పులు తీసుకొచ్చాయి. శాశ్వత శిస్తు పద్ధతి, రైత్వారీ విధానం, మహల్వారీ భూ విధానాలు ఆంగ్లేయులు ప్రవేశపెట్టిన ముఖ్య చట్టాలు. ఇవి అంతకుముందు చెదురుమదురుగా లేదా నామ మాత్రంగా ఉన్న భూమిపై వ్యక్తిగత ఆస్తిహక్కును స్థిరీకరించాయి. దీంతో, పైన చెప్పినట్లు, భూ సంబంధాల్లో మార్పులు రావడమే కాక, సామాన్య రైతాంగం అనేక కష్టనష్టాలకు గురైంది. శాశ్వత శిస్తు విధానంలో జమీందార్ల ప్రత్యక్ష దోపిడికి రైతులు గురికాగా, దక్షిణాదిన ప్రవేశపెట్టిన రైత్వారీ పద్ధతిలో ప్రభుత్వమే రైతులను ప్రత్యక్షంగా దోపిడికి గురిచేసింది. మొదటి విధానంలో జమీందార్లను దళారులుగా ఉపయోగించుకుని, వారి ద్వారా రైతుల నుండి వసూలు చేసిన శిస్తును పేష్ కష్ (Pashkus) ద్వారా లబ్ది పొందింది. ప్రభుత్వానికి జమీందార్లు చెల్లించాల్సిన పేష్కుస్ మిక్కుటం కావడంతో జమీందార్లు ఆ భారాన్ని రైతులపై మోపారు. కొన్ని సందర్భాల్లో జమీందార్లు చెల్లించాల్సిన ధనాన్ని ప్రభుత్వానికి ఇచ్చుకోలేక దివాలా తీసిన దాఖలాలూ ఉన్నాయి. అయినా ఇక్కడ ప్రధానంగా నలిగిపోయింది రైతే. రైత్వారీ విధానంలో రైతుకు భూమిపై సొంత హక్కు కల్పించి మోయలేని శిస్తుభారాన్ని విధించడం ద్వారా రైతులు దివాలా తీసి వలసలు పోవడం, లేదా బర్మా, దక్షిణాఫ్రికా లాంటి దేశాలకు కూలీనాలీ చేసుకోడానికి (Indentured Labour) తరలిపోయారు. ఆ దశలో ఇంగ్లాండ్‌లో పారిశ్రామికోత్పత్తికి కావల్సిన ముడి సరుకును ఉత్పత్తి చేయడానికి వ్యవసాయంలో వ్యాపారీ కరణను (Commercialisation) ప్రవేశ పెట్టారు. దీంతో ఆహార ధాన్యాల ఉత్పత్తి కుంటుబడింది. రైతుకు సరైన నీటి సరఫరా మొదలైన వసతులు లేక తరచు కరువులు ఏర్పడ్డాయి. వ్యవసాయోత్పత్తులను అమ్ముకోడానికి మార్కెట్లు వెలిశాయి. దీంతో అంతకు ముందున్న గ్రామీణ స్వయం పోషక స్థితి విచ్ఛిన్నమైంది. ఇది ఒక పార్శ్వం నుండి చూస్తే ప్రయోజనాత్మకమే. చిన్న చిన్న గ్రామాలకు పరిమితమై మధ్యయుగాల ఆర్థిక సామాజిక వాతావరణంలో జీవనం సాగిస్తున్న గ్రామీణ రైతాంగం విముక్తి చెంది, ఆధునిక కాలపు పెట్టుబడిదారీ భూ సంబంధాల్లోకి ప్రవేశించడం, కారల్‌మార్క్స్ మాటల్లో బ్రిటీషువారు సాధించిన గొప్ప సామాజిక విప్లవం. అయితే ఈ మార్పు వెనుక ఒక ప్రబల మానవ విషాదాంత సన్నివేశం ఇమిడి ఉంది. దీనికి భారతీయ

రైతులు గొప్ప మూల్యాన్ని చెల్లించారు. ఇంగ్లాండు నుండి దిగుమతయ్యే పారిశ్రామిక వస్తువుల పోటీకి తట్టుకు నిలబడలేక చేతి పరిశ్రమలు, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో విస్తారంగా నెలకొన్న చేతివృత్తులు, వాటి ఉత్పత్తులు అంతరించిపోయాయి. పారిశ్రామిక క్షీణత (Deindustrialisation) సంభవించి అనేక కోట్ల మంది ప్రజలు జీవనాధారాన్ని కోల్పోయి తమ బ్రతుకుదెరువు కోసం వ్యవసాయ రంగంలోకి ప్రవేశించారు. అప్పటికే కిక్కిరిసి ఉన్న వ్యవసాయరంగం వీరి ప్రవేశంతో మరింతగా ఒత్తిడికి గురై శల్యావశిష్టంగా మారింది. భారతీయ రైతాంగం నేటికీ ఎదుర్కొంటున్న గ్రామీణ రుణభారం అప్పుడే ప్రారంభమైంది. వ్యవసాయం కనీస జీవనస్థాయికి (Subsistance level) దిగజారింది.

ఇక్కడ గమనించాల్సిన అంశాలు రెండున్నాయి. ఒకటి, భారతీయ ఆర్థిక వ్యవస్థలో వలసపాలన తెచ్చిన మౌలిక మార్పులు. రెండు, అందులో భాగంగా వ్యవసాయరంగం దెబ్బతిని, రైతాంగం తీవ్ర ఆర్థికదోపిడికి గురై తమ భూకమతాలను మధ్యవర్తులకు, అంటే చిన్న పెట్టుబడిదారులకు, వడ్డీ వ్యాపారులకు దఖలు పరచి, వ్యవసాయ కూలీలుగా మార్పు చెందడం. ఈ పరిస్థితి అప్పట్లో భారతదేశం ఒక classical colony గా మారిన వైనాన్ని తెలియజేస్తుంది. ఒక వలస దేశం తన మనుగడను కేవలం వలస రాజ్యం కోసమే సాగిస్తుంది. వలస దేశపు ప్రయోజనాలు ఈ షణ్మాత్రం వలస రాజ్య ఎజెండాలోకి చేరవు. వలస రాజ్యపు ఆర్థికావసరాలకు అనుగుణంగా వలస దేశంలో అనుసరించాల్సిన ఆర్థిక విధానాలు మలచబడతాయి. దీనికి చక్కటి ఉదాహరణ భారతదేశంలో, పైన చెప్పుకున్నట్లుగా, ఇంగ్లాండు ప్రవేశపెట్టిన వ్యవసాయ సంస్కరణలు.

భారత రైతాంగాన్ని గూర్చిన కొన్ని అపోహలు ఆంగ్ల చరిత్రకారులు తమ రచనల్లో చొప్పించారు. భారతదేశ చరిత్ర రచన కూడ వారి వలస ప్రయోజనాలను దీర్ఘకాలికంగా పరిరక్షించుకోవాలన్న రీతిలో జరిగిందని కూడా మనం ఇక్కడ గుర్తుంచుకోవాలి. భారతీయ రైతు సాధుస్వభావుడనీ, అణుకువతో నడుచుకుంటాడనీ, అతనిలో పోరాట (Militant) స్వభావం కనబడదనీ, వలసవాద రచయితలు స్థూలంగా రైతు స్వభావాన్ని చిత్రించారు. నిరసనకు, తిరుగుబాటుకు, భారత రైతు దూరంగా ఉంటాడనీ, ఎన్ని కష్టాలైనా మౌనంగా భరిస్తూ ఓర్పుకు పర్యాయపదంగా భారతీయ రైతును వారు అభివర్ణించారు. నిశితంకాని స్థూల దృష్టితో చూస్తే ఈ వర్ణన నిజమనేంతటి విధంగా మనకు అగుపిస్తుంది. ఇది సత్యంకాదు. భారతీయ రైతు విద్యలేమికి లోబడి 'అజ్ఞానం'తో ఉండొచ్చునేమో కానీ, చైతన్య రహితమైన మనిషికాడు. నిరసన తెలపడానికి ఏ మార్గమూ తోచనప్పుడు తాను సాగుచేస్తున్న భూమిని గాలికి వొదిలి మూటముల్లెతో, పిల్లాజెల్లాతో, పీడన తప్పించుకోడానికి మరో ప్రాంతానికి వలసపోయిన ఘటనలు మన చరిత్రలో కోకొల్లలు. వలసపాలన వేళ్ళూనుకున్న, 1757 నుండి 1857 దాకా - వంద సంవత్సరాల మనదేశ చరిత్రలో కొన్ని వందల, వేల రైతాంగ తిరుగుబాట్లు జరిగాయంటే

మనం ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. ఇటీవలి కాలంవరకూ మనకు లభించిన చారిత్రక ఆధారాలను బట్టి దేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ ఈ తిరుగుబాట్లు జరిగాయి. ఇందులో కొన్ని పెద్దవి, మరికొన్ని మధ్యతరహా, ఇంకా కొన్ని చిన్నవి. గ్రామస్థాయి నుంచి ప్రాంతీయ స్థాయివరకు ఈ తిరుగుబాట్లు విస్తరించాయి. వీటిని సివిల్ తిరుగుబాట్లు, రైతాంగ తిరుగుబాట్లు, ఆదివాసీ తిరుగుబాట్లు అని మూడు విధాలుగా వర్గీకరణ చేయవచ్చు. భూమికోసం, భుక్తికోసం, అధిక శిస్తులకు వ్యతిరేకంగా అధికారుల నిరంకుశత్వానికి, జమీందార్ల పీడనకు వ్యతిరేకంగానూ, ప్రభుత్వం ప్రవేశపెట్టిన అటవీ చట్టాలను, ఎక్సైజ్ చట్టాలను, ఒకటేమిటి, వలసపాలన సాగించిన ఆర్థిక దోపిడిలోని సమస్త అంశాలకు నిరసనగా ఈ తిరుగుబాట్లు జరిగాయి. రైత్వారీ విధానం ప్రవేశపెట్టిన కాలంలో రాయలసీమ, తమిళనాడుల్లో జరిగిన పాలేగాండ్ల తిరుగుబాట్లు, అటవీ చట్టాలకు వ్యతిరేకంగా మన్యం ప్రాంతంలో జరిగిన ఆదివాసీ తిరుగుబాట్లు (అల్లూరి సీతారామరాజు తిరుగుబాటుకు ఎంతోముందు), కృష్ణాజిల్లాలో జమీందార్లకు వ్యతిరేకంగా వచ్చిన తిరుగుబాట్లు ఇందులో కొన్ని ఉదాహరణలు మాత్రమే.

1857 తిరుగుబాటు తరువాత బ్రిటీష్ సామ్రాజ్యవాదుల స్వభావంలో మార్పు వచ్చింది. భారతదేశంలో వారనుసరించిన విధానాల్లో అది ప్రతిఫలించింది. భారతదేశంపై తన ఆధిపత్యం దాదాపు శాశ్వతంగా కొనసాగించుకోవాలన్న నిర్ణయానికి వచ్చినప్పుడు అంతకముందు తన స్వప్రయోజనాల కోసమైనా అవలంభించిన ఆధునికీకరణ ప్రక్రియ పక్కన పెట్టింది. అప్పుడే భారతీయ సమాజంలో జాతీయవాద భావాలు పొడసూపడం ప్రారంభమైంది. వలసపాలన అనుసరించిన ఆర్థిక, పరిపాలన, విద్యాపరమైన విధానాల ప్రభావంతో దేశంలో విద్యాధిక మధ్యతరగతి వర్గం ఒకటి తలెత్తింది. ఇది ముందుగా సాంస్కృతిక, సామాజిక రంగాల్లో సంస్కరణలు, మార్పులు తేవాలన్న సంకల్పంతో ప్రారంభించి, క్రమేపీ రాజకీయంగా కూడా ప్రజలను చైతన్యవంతుల్ని చేయడానికి పూనుకుంది. ఈ వర్గం తలకెత్తుకున్న సమాజ మరమ్మత్తులో భాగంగా ప్రజాసమస్యల్ని కూడా పట్టించుకోనారంభించింది. 1885 కు ముందు, అంటే అఖిలభారత జాతీయ కాంగ్రెస్ స్థాపనకు పూర్వం, దేశంలో అనేక ప్రాంతాల్లో ఈ రాజకీయ చైతన్యం సంఘాలు, సమాజాల రూపంలో వ్యక్తమయింది. కొన్ని ప్రాంతాల్లో ఇవి ప్రత్యక్షంగా రైతాంగ సమస్యలు (ధనిక, మధ్యతరగతి ప్రధానంగా) పట్టించుకుంటే, మరికొన్నిచోట్ల విశాల ప్రాతిపదికపై ఏర్పడ్డ పౌర సమాజాలు తమ డిమాండ్లలో అధిక భాగాన్ని రైతుల సమస్యలపై కేంద్రీకరించాయి. మద్రాసు రాజధానికి సంబంధించి రెండు ఉదాహరణల్ని చెప్పుకుందాం. ఒకటి, 1850 దశకంలో మద్రాసులో స్థాపించిన మద్రాస్ నేటివ్ అసోసియేషన్ (MNA) దీని స్థాపకుడు గాజుల లక్ష్మినరసుచెట్టి. ఈ సంస్థ గ్రామీణ ప్రాంతాల్లో రైతు లెదుర్కొంటున్న సమస్యలను చేపట్టింది. లక్ష్మినరసు చెట్టి మద్రాసులో ఒక సభను ఏర్పాటుచేసి, మెమొరాండం తయారుచేశాడు. అప్పట్లోనే ముప్పైవేలమంది సంతకాలతో ఈ మహాజరును బ్రిటీషు

ప్రభుత్వానికి నివేదించాడు. విద్య, వాణిజ్యం, పాఠశాలల్లో మతబోధ లాంటి అంశాలను అలా ఉంచుదాం. రైతులకు సంబంధించి అధిక శిస్తులు, శిస్తు వసూళ్ళలో అవలంభించిన అత్యంత క్రూర పద్ధతులు - జప్తులు చేయడం, కొరడాలతో కొట్టడం, రైతులకు సంబంధించిన అన్ని వస్తువులను బలవంతంగా లాక్కోవడం, భూముల్నుంచి వెళ్ళగొట్టడం, నీటిపారుదల సౌకర్యాలు కల్గించకపోవడం, సరైన రోడ్లు, రవాణా సౌకర్యాలు కొరవడడం - ఇందులోని ప్రధానాంశాలు. ఈ మహజరు సమర్పించాక బ్రిటీష్ పార్లమెంట్ సభ్యుడు డాన్బీ సెమూర్ (Damby Seymour) మద్రాస్ రాజధానిలో నేటివ్ అసోసియేషన్ వారితో కలిసి పర్యటించి రైతులు అనుభవిస్తున్న కష్టాలను బ్రిటీష్ ప్రభుత్వానికి స్వయంగా నివేదించాడు. ఈ ఒరవడిలోనే కృషిచేసిన మరో సంస్థ కోస్తా ఆంధ్ర ప్రాంతానికి చెంది ఉండడం విశేషం. 1870 వ దశకంలో కాకినాడ పట్టణంలో 'కాకినాడ లిటరరీ అసోసియేషన్' పేరుతో ఒక సమాజం స్థానిక ప్రజల్లో ప్రాజ్ఞ వాతావరణం కోసం ఒకవైపు విద్య సాంస్కృతిక రంగాల్లో కృషిచేస్తూనే మరోవైపు స్థానిక గోదావరి డెల్టాలో ఉన్న రైతు సమస్యలను ప్రభుత్వానికి నివేదించబూనుకుంది. ఇలాంటి దృష్టాంతాలు ఇంకా అనేకం మనకు అగుపడకుండా చరిత్ర గర్భంలో కనుమరుగయ్యాయి. అయితే, ఇక్కడ మనం చెప్పుకోదల్చుకున్నది ముఖ్యంగా ఒక విషయం. అదేమంటే, రైతులు వలస పాలనలో అత్యంత కఠినమైన పరిస్థితుల్లో జీవిస్తూ ఉన్నారు. కాగా, వారి సమస్యలను ఎప్పటికప్పుడు మహజర్ల ద్వారా, నిరసనల ద్వారా, తిరుగుబాట్ల ద్వారా, ఏ పద్ధతులు వారికి అందుబాటులో ఉంటాయో ఆ యా మార్గాల ద్వారా ప్రభుత్వానికి తమ గోడు చెప్పుకుంటూనే ఉన్నారు. మనం గమనించాల్సిన మరో అంశం, 1857 సిపాయిల (తిరుగుబాటు), 1885 (జాతీయ కాంగ్రెస్ స్థాపన) మధ్య కాలంలో పొడసూపిన ఈ సామాజిక, రాజకీయ చైతన్యం విద్యాధిక మధ్యతరగతి వర్గపు చొరవతో, వారి నాయకత్వంలో వచ్చినా ఆ చైతన్యపు పరిధి రైతాంగ సమస్యల వరకూ విస్తరించింది. దీనికి కారణాలు అనేకం ఉండొచ్చు. దేశంలో అప్పట్లో 90 శాతం గ్రామీణ ప్రాంతాలు. ప్రజల ఆర్థిక వ్యవస్థ ప్రధానంగా వ్యవసాయం. ఇంకా ఇలా ఎన్నో కారణాలున్నా, అన్నింటికంటే ముఖ్యమైనది భారతీయ మధ్యతరగతి వర్గపు వేళ్ళు (roots) గ్రామీణ ప్రాంతాల్లో ఉండడమే. వీరు గ్రామాల్లోని అగ్ర, మధ్యకులాల నుండి వచ్చి పట్టణాల్లో స్థిరపడి, ఆంగ్ల విద్యకు ఎగబడి అటు ప్రభుత్వంలో ఉద్యోగాలు సంపాదించుకోవడమో, లేక విద్యాపరమైన వృత్తుల్లో స్థిరపడడమో జరిగింది. ఏది ఏమైనా మేధోపరమైన వీరి తలలు పట్టణ ప్రాంతాల్లో ఉండే వీరి సామాజిక మూలాలు గ్రామీణ ప్రాంతాల్లో ఉండేవి. సూక్ష్మంగా భారతీయ మధ్యతరగతి వర్గ స్వభావం ఇందులో మనకు వ్యక్తమౌతుంది.

జాతీయోద్యమం అధికారికంగా 1885 లో ఆరంభమైంది. భారత జాతీయ కాంగ్రెస్ ఈ ఉద్యమానికి నాయకత్వం వహించింది. జాతీయోద్యమం స్థాపకుల్లో కానీ, ప్రథమ మహాసభకు (బొంబాయి) హాజరైన ప్రతినిధుల్లో కానీ రైతు నాయకులు లేదా రైతు ఉద్యమాల్లో పాల్గొని

అనుభవం గడించిన కార్యకర్తలు లేకపోవడం కాకతాళీయం కాదు. కాంగ్రెస్ సంస్థ తన తొలి దశలో (మితవాద) రూపొందించుకున్న ప్రణాళికలో వ్యవసాయ లేదా రైతు సంబంధమైన అంశాలు కొన్ని వున్నా, ఆ దశలో ఉద్యమ ఎజెండా విద్యావంతుల, పట్టణ మధ్యతరగతి ప్రజల ఆకాంక్షలకు, విశాలార్థంలో భారతీయ భవిష్యత్ సమాజ నిర్మాణ స్వరూప స్వభావాల గూర్చి పట్టించుకుంది. అంత మాత్రం చేత అప్పటి జాతీయ కాంగ్రెస్ రైతుల సమస్యలను పెడచెవిని పెట్టిందని కాదు. మితవాద దశలో నాయకత్వం కూడా ముఖ్యంగా మధ్య లేక ఎగువ మధ్యతరగతులకు చెందిందన్న విషయాన్ని మనం గమనించాలి.

జాతీయోద్యమాన్ని ముందుండి నడిపిన జాతీయ కాంగ్రెస్ తొలినాటి వార్షిక మహాసభల తీర్మానాలను పరిశీలిస్తే, పైన చెప్పినట్లు రైతాంగ సమస్యలకు కేటాయించిన చోటు (Space) చాలా తక్కువ. ఉదాహరణకు, కొన్ని తీర్మానాలను ఇక్కడ ఉటంకిద్దాం. శాశ్వత శిస్తు విధానంపై 'ఒకటి రెండు' తీర్మానాలు. ఎక్సైజ్ సుంకాలపై మరికొన్ని తీర్మానాలు. ఉప్పు పన్ను, అటవీ చట్టాలు మొదలగు రైతాంగ సమస్యలపై తన దృష్టిని నిలిపింది. ఇక్కడ కూడా దాని దృష్టి ధనిక రైతులపై ప్రధానంగా ఉండి, కొసరుగా అటవీ ప్రాంతాల్లో ఉండే ఆదివాసులపై బ్రిటీషువారు ప్రయోగించిన చట్టాలపై కొంత చర్చ జరిగింది. అంతకుమించి జాతీయోద్యమం భూ సమస్యపైగానీ, వ్యవసాయ ప్రధానమైన ఆర్థికవ్యవస్థ గురించికానీ పట్టించుకోలేదు. ఒక కోణం నుంచి చూసినప్పుడు ఇది జాతీయోద్యమంలోని ప్రధాన లోపమే! కానీ, జాతీయోద్యమ పుట్టుక, పెరుగుదల గూర్చి తార్కికంగా విశ్లేషించినప్పుడు ఇది లోపంగా కాక, దాని పరిమితిగా చెప్పుకోవాలి. ప్రపంచంలోని వలసవాద వ్యతిరేక ఉద్యమాలను అధ్యయనం చేస్తే ఈ ధోరణే సర్వత్రా వెల్లడవుతుంది. పట్టణ ప్రాంతాల, విద్యాధిక, మధ్యతరగతి, చిన్న వ్యాపార - వాణిజ్యవర్గాల, ఉద్యోగి బృందాల స్వతంత్ర వృత్తులకు చెందిన ప్రజలు పరిమిత పరిధిలో ఈ ఉద్యమాలను నిర్మించారు. మనదేశ ఉదాహరణను గమనిస్తే జాతీయోద్యమ సామాజిక పునాది ఈ దశలో పై చెప్పిన వర్గాలకు పరిమితమైంది. ఒక ఉద్యమ స్వభావం, దాని లక్ష్యాలు, చేపట్టే పద్ధతులు, అవలంబించే వ్యూహాలపై ఆధారపడి వుంటుంది.

జాతీయోద్యమంలోకి మొదటిసారిగా గ్రామీణ ప్రజలు, ముఖ్యంగా ధనిక, మధ్యతరగతి రైతులు, 1905 లో ప్రారంభమైన స్వదేశీ ఉద్యమంలో పాల్గొనడం గమనిస్తాం. ఇది కూడా దేశంలోని కొన్ని ప్రాంతాల్లో మాత్రమే జరిగింది. ముఖ్యంగా బెంగాల్లో కొన్ని జిల్లాల్లో రైతులు ఉద్యమంలో పాలుపంచుకున్న ఘటనలు సుమిత్ సర్కార్‌లాంటి చారిత్రక పరిశోధకుల రచనల్లో వెల్లడైంది. పట్టణ ప్రాంతాల్లోని మధ్యతరగతి ప్రజల భూప్రయోజనాలు దెబ్బతింటాయన్న భయంతోనే లేదా వారికి గ్రామీణ ప్రాంతాలతో ఉన్న సజీవ సంబంధాల వల్లనో ఇది సాధ్యమైంది. ఏమైనా, స్వదేశీ వస్తువుల అమ్మకాలు, విదేశీ వస్తు బహిష్కరణలు, వలస విధాన ప్రతిఘటనలు, గ్రామీణ సంతల్లో (fares), సభల్లో, ఊరేగింపుల్లో, పాటల్లో, నినాదాల్లో వ్యక్తమయింది. ఆంధ్ర

దేశానికి సంబంధించి రైతాంగ జనబాహుళ్యం ఉద్యమంలో భాగస్వామ్యం కాకున్నా, ఉద్యమ స్ఫూర్తిని వారిలో కలిగించే ప్రయత్నాలు - తెనాలి బాంబుకేసు, కోటప్పకొండ తిరునాళ్ళ ఘటనలు- నిరూపిస్తున్నాయి. ఈ ఉదాహరణలు కేవలం చెదురుమదురుగా జరిగిన సంఘటనలుగా కాక, క్రమేపీ జాతీయోద్యమ సందేశం పట్టణాల పొలిమేరలు దాటి, గ్రామీణ ప్రాంతాలకు విస్తరించే క్రమాన్ని సూచిస్తుంది. అంటే, జాతీయోద్యమ సామాజిక పునాది విస్తరింపబూనుకుంది.

స్వదేశీ ఉద్యమ దశ ముగిశాక, 1917-18 లో మహాత్మాగాంధీ జాతీయోద్యమంలోకి ప్రవేశించేముందు, అంటే దాదాపు పది సంవత్సరాలపాటు జాతీయోద్యమం దాదాపు స్తబ్దుగా ఉండిపోయింది. అతివాద, మితవాద వర్గాలు చీలిపోవడం, విప్లవ జాతీయవాదుల (Revolutionary Nationalists) కార్యకలాపాలు విఫలం కావడం మాత్రమే ఈ స్తబ్దతకు కారణాలు కావు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో హోంరూల్ ఉద్యమాలను ఇటు దక్షిణాదిలో అనిబీసెంట్, అటు పశ్చిమోత్తర ప్రాంతాల్లో తిలక్ నడిపి, జాతీయోద్యమాన్ని సజీవంగా ఉండేటట్లు చేశారు. అయినా ఈ దశలో కూడా రైతాంగ స్థాయికి అది విస్తరించలేదు.

భారతీయ సమాజ స్వరూప స్వభావాలను ఓం ప్రథమంగా అర్థం చేసుకున్న జాతీయ నాయకుడు గాంధీ. భారతదేశపు గుండెకాయ గ్రామాల్లో నిక్షిప్తమై ఉందని ఆయన గ్రహించాడు. ఎనభై శాతం పైగా ప్రజలు గ్రామాల్లో జీవిస్తున్న వాస్తవం ఆయన ఆకళింపు చేసుకున్నాడు. వలస పాలనలో అత్యంత ప్రాథమిక స్థాయిలో దోపిడికి గురైన జనం గ్రామీణ వ్యవసాయాధారిత ప్రజలని తెలుసుకున్నాడు. కటిక దారిద్ర్యం, కఠోర జీవనం రైతాంగ జీవనానికి పర్యాయపదాలుగా ఆయన గ్రహించాడు. అసలైన జాతి విమోచనోద్యమానికి జవసత్వాలు వారినుండి రావాలను కున్నాడు. పట్టణ ప్రాంతాలకు పరిమితమై, మహాజర్లకు, సభలకు, తీర్మానాలకు, ఊరేగింపులకు కుంచించుకుపోయిన ఉద్యమానికి ప్రజాపునాదిని కల్పించాలని సంకల్పించాడు. నాయకత్వాన్ని కూడా చిన్న పట్టణాలకు, గ్రామాలకు చెందిన సమాజాల నుండి తయారుచేయాలనుకున్నాడు. దీని ఫలితమే ప్రయోగాత్మకంగానైనా ఆయన అత్యంత సమర్థవంతంగా నిర్వహించిన ఖేడా, చంపారన్ ఉద్యమాలు. ఇవి చేపట్టిన సమస్యలు రైతాంగానికి చెందినవే. కాకుంటే వాటిలోని రైతుల ఆర్థిక స్థోమతలోని తారతమ్యాలు వేరు. గాంధీ ప్రయోగించిన పోరాట పద్ధతుల్ని గురించిన చర్చ ఇక్కడ అప్రస్తుతం. ఆయన చేపట్టిన సమస్యలు, వాటి పరిష్కార క్రమంలో భాగస్వాములుగా ముందుకొచ్చిన రైతాంగం ఈ అంశాన్ని నిర్ధారిస్తాయి.

జాతీయోద్యమం ప్రజా ఉద్యమ స్వభావాన్ని సంతరించుకున్నది 1920 దశకంలో. అప్పటికి గాంధీ జాతీయోద్యమ నాయకుడిగా రూపొందాడు. తిలక్‌తో సహా తొలితరం ముగిసింది. దేశప్రజల సమస్యల పట్ల ఆయన పెంచుకున్న అవగాహన, తాను చేపట్టిన పోరాట పద్ధతులు, మొదటి ప్రపంచ యుద్ధానంతర ఆర్థిక రాజకీయ పరిణామాలు ఆయన అవగాహనలో భాగమైనాయి. దేశీయ బూర్జువా వర్గం మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బలపడింది. వలస,

సామ్రాజ్యవాద ఆర్థిక ప్రయోజనాలకు, దేశీయ పెట్టుబడిదారీ ప్రయోజనాలకు మధ్య నున్న అంతరాన్ని, దానిలోని వైరుధ్యాన్ని నాయకులు గ్రహించారు. జాతీయోద్యమ నాయకత్వం మధ్యతరగతి వర్గాధీనంలోనే ఉండిపోయింది. కాకుంటే ఉద్యమానికి జాతీయ పెట్టుబడిదారుల వత్తాసు అధికమైంది. గాంధీ వర్గ సామరస్యం పేరుతోనో లేక తన వ్యూహంలో భాగంగానే ఎప్పుడూ ఈ వర్గాన్ని దూరంగా ఉంచలేదు.

1921-22 సంవత్సరాల్లో గాంధీ ప్రారంభించిన మొట్టమొదటి సహాయ నిరాకరణోద్యమం మన స్వాతంత్ర్య పోరాటంలో తొలిసారిగా బహుళ ప్రజా స్వభావాన్ని పొందింది. సహాయనిరాకరణలో ముఖ్య నినాదం పన్నుల నిరాకరణ. ఇది రైతాంగానికి చెందిన ముఖ్య సమస్య. మొత్తం రైతాంగాన్ని అఖండంగానే (indivisible) అటు గాంధీకానీ, ఇటు జాతీయోద్యమం కానీ పరిగణించింది. సామ్యవాద భావాలతో ఆవిర్భవించిన వామపక్ష రాజకీయాలు బలపడేదాకా రైతాంగంలోని అనేక పొరలను వీరు విడమర్చి చూడలేదు. పన్నుల నిరాకరణ, భూమిలేని నిరుపేద రైతులకు సంబంధించినది కాదు. ధనిక, మధ్యతరగతి రైతులు ఈ మహోద్యమంలో ప్రధానంగా పాల్గొన్నా, వారి ప్రభావంలో ఉంటున్న పేద రైతాంగం జాతీయోద్యమంలోకి కాలుబెట్టింది. గ్రామాల్లో ఉండే సాముదాయిక భూములైన బీళ్ళు, బంజర్లు, అటవీ ప్రాంతాల్లో విధించిన పుల్లరి పన్నులాంటి సమస్యలు పేద రైతాంగాన్ని కదిపాయి. మొత్తం భారతదేశం మాట అటుంచి, ఆంధ్ర ప్రాంతాన్ని పరిశీలిస్తే ఈ ఉద్యమ కాలంలో జరిగిన మూడు ప్రధాన పోరాటాలు రైతాంగ కదలికను తెలియపరుస్తాయి. ఒకటి పెదనందిపాడు ఫిర్కాలో పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వంలో జరిగిన రైతుపోరాటం. రెండు, పల్నాటి పుల్లరి సత్యాగ్రహం. మూడు చీరాల - పేరాల ఉద్యమం. 'ఒకే సంవత్సరంలో స్వరాజ్యం' అనే నినాదంతో ప్రారంభమైన సహాయ నిరాకరణోద్యమం హింస నెపంతో మధ్యంతరంగా నిల్చిపోయినా అది సాధించిన ఫలితం రైతులను ఉద్యమంలోకి తీసుకురావడం. ఈ మూడు ఉద్యమాలు, జాతీయోద్యమంలో అంతర్భాగాలుగా వచ్చినవే. ఇందులో చీరాల - పేరాల సత్యాగ్రహం ప్రధానంగా అర్థపట్టణ (Semi Urban) స్వభావాన్ని కలిగివుంది.

గుంటూరు జిల్లాలో చీరాల - పేరాల రెండూ పంచాయితీ గ్రామాలు. వీటిని రెంటినీ కలిపి, అప్పట్లో ప్రభుత్వంలో వున్న జస్టిస్ పార్టీ, మున్సిపాలిటీగా మార్చి ఎక్కువ పన్నులు విధించింది. దీనికి ప్రజలు నిరసించి ఆ రెండు గ్రామాల పొలిమేరలకు ప్రజలను తరలించి, పన్నుల నిరాకరణ ప్రకటించారు. ఇక్కడ గమనించాల్సింది ఈ రెండు గ్రామాల్లోని ప్రజలు, ముఖ్యంగా రైతులు, చేనేత పనివారు. ఈ రెండు వర్గాలు ఉద్యమంలో విశేషంగా పాల్గొన్నాయి. మరొక అంశం, దీనికి నాయకత్వం వహించిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వెయ్యిమందితో 'రామదండు' అనే ఒక స్వచ్ఛంద దళాన్ని ఏర్పరచి చుట్టుపక్కల గ్రామాల్లో ఉద్యమానికి మద్దతుగా రైతులను సమీకరించాడు. సమస్య కొంతవరకూ పట్టణ స్వభావంతో ముడిపడివున్నా ఉద్యమానికి బాసటగా నిలిచిన ప్రజలు మాత్రం రైతు వర్గానికి చెందినవారే.

ఇక పెదనందిపాడు ఫిర్కాలో జరిగిన పన్నుల నిరాకరణోద్యమం అఖిల భారత స్థాయిలో గుర్తింపు పొందింది. ఆంధ్ర దేశంలో మరెక్కడా అప్పుడు అలాంటి ఉద్యమం నిర్వహించబడలేదు. భూమిశిస్తు ప్రధానాంశం. దీనికి, పెంచిన నీటితీరువా తోడ్పడింది. దీని నిర్వహణ, నాయకత్వం పూర్తిగా రైతులదే. పర్వతనేని వీరయ్య చౌదరి నాయకత్వం వహించాడు. ఉద్యమం దాదాపు నూరు గ్రామాలకు పాకింది. నాలుగు వేలమంది వాలంటీర్లతో ఒక దళం ఏర్పడింది. సన్నకారు రైతులు ఉద్యమానికి ఊపిరిపోసినా వీరయ్యచౌదరి లాంటి ధనిక రైతులే నాయకత్వం వహించారు. పన్నుల చెల్లింపు పూర్తిగా ఆగిపోయింది. ప్రభుత్వ నిర్బంధం అనేక రూపాల్లో అమలుజరిపినా రైతులు పన్ను చెల్లించలేదు. పెదనందిపాడు ఫిర్కాలోని అనేకమంది గ్రామాధికారులు రాజీనామా చేశారు. ఇక పన్నులు వసూలు చేసేది ఎవరు ? అందువల్లే శిస్తు నిరాకరణ విజయవంతమైంది. ప్రభుత్వం సాగించిన దమనకాండ, అరెస్టులతో ఆగలేదు. గ్రామాధికారులను భయపెట్టడం, శిస్తు వసూళ్ళకు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయడం, ఆస్తులను జప్తు చేయడంలాంటి చర్యలు ముమ్మరమైనాయి. దీనికితోడు భూములు వేలం వేశారు. కానీ కొనేవారు లేరు. ఇది కూడా సహాయ నిరాకరణలో భాగమే. దీంతో ప్రభుత్వం మరింత కఠిన చర్యలకు పూనుకుంది. సైన్యాన్ని గ్రామాల్లో దించింది. కవాతులు చేయించింది. గ్రామాల్లో దించిన సైనిక పోలీసు దళాలకు అయ్యే ఖర్చు ఆ గ్రామాల ప్రజలే భరించాలని ఆర్డర్లు జారీ చేసింది. అయినా రైతులు చలించలేదు. సత్యాగ్రహాన్ని ఆపలేదు.

ఈ సత్యాగ్రహానికి సంబంధించిన ఒక ముఖ్యాంశం మనం చెప్పుకోవాల్సి ఉంది. ఉద్యమ కొనసాగింపుపై కాంగ్రెస్ పార్టీలో భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. ఉద్యమం శాంతి యుతంగా కొనసాగుతుందా ? లేక అహింసా మార్గాన్ని విడనాడి హింసా స్వభావాన్ని సంతరించు కుంటుందా ? అన్నది సమస్య. స్థానిక జిల్లా కాంగ్రెస్ నాయకులు గాంధీజీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి ఉద్యమాన్ని ఆపుచేయమని పైనుంచి ఒత్తిడి తెచ్చారు. అప్పటికే దేశవ్యాప్తంగా శాసనోల్లంఘన ఉద్యమాన్ని గాంధీజీ నిలుపు చేశాడు. అయినా ఆ నిలుపుదలను ధిక్కరించి పెదనందిపాడు సత్యాగ్రహం కొనసాగడంతో గుంటూరు జిల్లా దేశం దృష్టిని ఆకర్షించింది. ఎలాగైతేనేం, జిల్లా కాంగ్రెస్ నాయకులు, కొండా వెంకటప్పయ్య తదితరులు, ఏకపక్షంగా ఉద్యమాన్ని నిలిపివేశారు. రైతులు తీవ్రనిరాశ నిస్పృహలకు లోనయ్యారు.

పెదనందిపాడు సత్యాగ్రహం ఒక విషయాన్ని స్పష్టం చేసింది. తమ కోర్కెలకోసం చేపట్టిన ఉద్యమాన్ని, ఎన్ని కష్టాలన్నైనా ఎదుర్కొని నడిపించగల శక్తిసామర్థ్యాలు, పట్టుదల రైతాంగంలో పెంపొందాయనీ వ్యక్తమైంది. కాంగ్రెస్ ఇలాంటి రైతు ఉద్యమాలను తుదికంటా కొనసాగించి రైతుల డిమాండ్లు నెగ్గించుకోవడంలో వెనుకంజ వేసిందన్న విషయం కూడా తేటతెల్లమైంది. రైతుల ఆర్థికపరమైన కోర్కెలకన్నా రాజకీయ లక్ష్యాలకు కాంగ్రెస్ మరింత ప్రాధాన్యమిచ్చింది.

పల్నాడులో జరిగిన 'పుల్లరి సత్యాగ్రహం' సామాన్య రైతుల్లో పెరిగిన చైతన్యానికి మరింత అద్దం పట్టింది. అటవీ ప్రాంతాల్లో పశువులను మేపుకునేందుకు పుల్లరి రేట్లు పెంచారు. వంటచెరకు మొదలైనవి అటవీ ప్రాంతాలనుంచి తెచ్చుకునేందుకు మరింత ఎక్కువ సొమ్ము చెల్లించాల్సిన పరిస్థితి ఏర్పడింది. అటవీశాఖ ఉద్యోగుల దురంతాలు పెచ్చు పెరిగాయి. ఇవన్నీ కలగలిసి 1921 లో ఏర్పడ్డ కరువు మొదలగు ప్రత్యేక పరిస్థితుల వల్ల పల్నాటిసీమలోని ప్రజలు సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా ముందుకొచ్చారు. దీనికి ఉన్నవ లక్ష్మీనారాయణ నాయకత్వం వహించాడు. పల్నాడు ప్రాంతంలో ప్రజలు, ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్, రెవెన్యూ డిపార్ట్‌మెంట్ అధికారులను సామాజికంగా వెలివేశారు. దాంతో వారికి నిత్యాకృత్యంగా సేవలందించే చాకళ్ళు, మంగళ్ళు పనిచేయడం మానివేశారు. జిల్లా కలెక్టరు మాచెర్లకు వచ్చి, తాను జారీచేసిన ఆర్డర్లను ప్రజలకు తెలియజెప్పడానికి డప్పు వేయమని చెబితే, డప్పులవాళ్ళు ఎగనామం పెట్టారు. ఈ పరిస్థితిని సమీక్షించి నివేదిక తయారుచేయడానికి పల్నాడు బయలుదేరి వెళ్ళిన నాయకులు - ఉన్నవ లక్ష్మీనారాయణ, మాడభూషి వేదాంతం లక్ష్మీనరసింహాచారిని కలెక్టర్ తన ఎదుట హాజరు కమ్మని సమన్లు జారీచేశాడు. వారిద్దరినీ ప్రజలు మంగళవాద్యాలతో, ఊరేగింపుగా కలెక్టర్ దగ్గరకు తీసుకెళ్ళారు. కలెక్టర్ విధించిన సెక్యూరిటీ షరతులను వారిద్దరూ ధిక్కరించడంతో వారిని అరెస్ట్‌చేసి జైలుకు పంపారు. దీంతో సత్యాగ్రహం ఊపందుకుంది. రైతుల పన్నులు చెల్లించడం పూర్తిగా ఆపివేశారు. పశువులను పన్ను చెల్లించకుండానే అడవుల్లోకి తోలారు. కాంగ్రెస్ ఒక దశలో దీనికి తన విముఖతను తెలియజేసింది. పుల్లరి చెల్లించమని ఆదేశించింది. ప్రజలు దీనిని పెడచెవిని పెట్టారు. పన్నుల నిరాకరణను కొనసాగించారు. అనేక గ్రామాలు స్వరాజ్య గ్రామాలుగా ప్రకటించుకున్నాయి. ప్రజలకు - ఫారెస్ట్ గార్డులకు, పోలీసులకు మధ్య ఘర్షణ లెక్కువయ్యాయి. పోలీసులను అనేకచోట్ల ప్రజలు అవమానాలకు గురిచేశారు. దీని పర్యవసానమే పల్నాడు - పుల్లరి సత్యాగ్రహ నాయకుడైన కన్నెకంటి హనుమంతు పోలీసుల చేతిలో పొందిన వీరమరణం. హనుమంతు నాయకత్వంలోని 'మించాలపాడు' గ్రామ ప్రజలు బందెలదొడ్డికి తోలుకుపోతున్న పశువులను ఆపడానికి ప్రయత్నించారు. అప్పుడు జరిగిన ఘర్షణల్లో హనుమంతు, అతని సహచరులిద్దరూ మరణించారు. పోలీసు దమనకాండతో పాటు, కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమాన్ని విరమించడంతో పల్నాటి - పుల్లరి సత్యాగ్రహం ఆగిపోయింది. పైన ఉదహరించిన మూడు ఘటనల సారాంశం ఏమిటంటే 1920 దశకానికి ఆంధ్ర రైతాంగం తమ కోర్కెల విషయంలో చైతన్యం పొందింది. ప్రత్యేకించి ఫలానా కార్యక్రమాన్ని ఇదమిద్ధంగా జాతీయకాంగ్రెస్ సూచించకపోయినప్పటికీ, రైతులు తమ స్థానిక సమస్యల పరిష్కారానికి మిలిటెంట్ ఉద్యమాలను నిర్వహించారు. రాజకీయ పోరాటంలో ప్రముఖ పాత్ర వహించే స్థితికి ఆంధ్ర రైతాంగం పరిణితి చెందింది. భవిష్యత్‌లో నిర్మించబోయే రైతాంగ ఉద్యమాలకు ఇవి నాంది పలికాయి. అంతేకాదు. కాంగ్రెస్ ప్రారంభించిన సహాయ

నిరాకరణోద్యమం, ఈ ఉద్యమాలను ప్రేరేపించింది. దాంట్లో భాగంగానే రైతులు బహుళ సంఖ్యలో పాల్గొన్నారు. అయినా, రైతు సమస్యలకు ఉద్యమంలో ప్రత్యేకించి చోటు లేదు. అందువల్ల అవి ఒక విధంగా స్వతంత్ర ప్రతిపత్తితోనే నడిచాయి. కాంగ్రెస్ గీసిన గీతకు లోబడలేదు. జాతీయోద్యమానికి ప్రజా బాహుళ్య మద్దతు అవసరమైంది. ఉద్యమ సామాజిక పునాదులు విస్తరించాల్సిన అవసరం ఏర్పడింది. ఆ దిశలో, బహుళ సంఖ్యలో ఉన్న రైతులు ఉద్యమంలోకి వస్తేనే కాని అది నెరవేరదు. దానికోసం, గాంధీజీ ఎంతో ఆలోచనతో రూపొందించిన సహాయ నిరాకరణోద్యమంలోకి మొదటిసారిగా రైతాంగం ప్రవేశించింది. రైతులు పాల్గొనడం ఉద్యమ అవసరం. కానీ రైతులు పాల్గొన్నది వారి సొంత అవసరాలకోసం వారి డిమాండ్లను సాధించుకోవడం కోసం. ఈ సూక్ష్మాంశాన్ని మనం గ్రహించాలి. అప్పటికింకా జాతీయోద్యమానికి ప్రత్యేకించి రైతుల గూర్చిన స్పష్టమైన ఎజెండా లేదు. పెట్టుబడిదారుల ప్రయోజనాలు, దేశీయ పరిశ్రమల స్థాపన, ఇంగ్లాండుకు తరలించుకుపోతున్న సంపదను ఆపడం, మధ్యతరగతికి సంబంధించిన ఉద్యోగాలు, విద్య వగైరా కోర్కెలతోనే ఉద్యమం కొనసాగుతూ వుంది.

1920 వ దశకానికి రైతుసంఘాల నిర్మాణం అటు జాతీయ స్థాయిలో, ఇటు ప్రాంతీయంగా జరగలేదు. అంటే రైతు ఉద్యమం సంఘటితం కాలేదు. దానర్థం రైతులకు సంఘాలు లేవనికాదు. ఉన్నా, అవి చెదురుమదురుగానే పనిచేస్తున్నాయి. స్థానిక సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నాయి. వీటన్నింటినీ ఒక గొడుగు కిందకు తెచ్చే ప్రయత్నం 1930వ దశకంలో కానీ జరగలేదు. ఈ అంశాన్ని గూర్చి వివరంగా రాబోయే అధ్యాయంలో తెలుసు కుందాం.

సహాయ నిరాకరణ ఉద్యమంలో భాగంగా గుంటూరు జిల్లాలో జరిగిన, పైన పేర్కొన్న మూడు పోరాటాలు సమసిపోయాక, ఆంధ్ర దేశంలో గిరిజన రైతాంగం రంపతిరుగుబాటుగా చెలరేగింది. దీన్నే మనం తిరగుబాటుగానూ, అల్లూరి సీతారామరాజు తిరుగుబాటుగానూ వర్ణిస్తాం. ఆంగ్లేయ ప్రభుత్వం ప్రవేశపెట్టిన అటవీ చట్టాలవల్ల ఆదివాసీల జీవితం దుర్భరం అయింది. వారి సంప్రదాయ 'పోడు' వ్యవసాయ పద్ధతిని దెబ్బతీయడం, అటవీ సంపదపై అధిక పన్నులు విధించడం, రోడ్లు వేయించి కూలీ సరిగ్గా ఇవ్వకపోవడం, బండచాకిరీ చేయించుకోవడం వీరి సమస్యల్లో కొన్ని మాత్రమే. వీటికి వ్యతిరేకంగా ఆదివాసీలు తిరగబడ్డం 19వ శతాబ్దపు ఆఖరిదశా కాలంనుండే ప్రారంభమైంది. 'రంప పితూరీ'లుగా పేర్కొనబడిన ఈ తిరుగుబాట్లు అల్లూరి సీతారామరాజు నాయకత్వం వహించిన మన్యం విప్లవానికి ముందు జరిగాయి. ప్రకృతి ప్రసాదించిన సహజమైన అటవీసంపదను అనుభవిస్తూ, పర్యావరణాన్ని కాపాడుకుంటూ ఎన్నో ఏళ్ళుగా ప్రశాంత జీవనం సాగిస్తున్న ఆదివాసీలు ఆంగ్ల ప్రభుత్వ చట్టాలపై తిరుగుబాటు చేయడంలో ఆశ్చర్యం లేదు. రామరాజు ఈ అసమ్మతిని కూడగట్టి, గిరిజనుల అభిమానాన్ని చూరగొని, పోరాటానికి సిద్ధమయ్యాడు. మన్యం విప్లవం హింసాయుతమైంది.

(సాయుధ పోరాటం) ఏజెన్సీ ప్రాంతానికి దగ్గరలో ఉన్న పోలీసు స్టేషన్లపై దాడిచేసి రామరాజు ఆయుధాలు సమకూర్చుకున్నాడు. భీకరంగా జరిగిన ఈ పోరాటపు తొలిదశలో ఆదివాసీలు తాత్కాలిక విజయాన్ని సాధించినా తుదకు బ్రిటీష్ ప్రభుత్వ ముష్కర హింసాకాండకు తలొగ్గారు. రామరాజు ప్రాణాలు కోల్పోయాడు. 1924 జూన్‌కల్లా మన్యం విప్లవం అణచివేయబడింది. ఈ తిరుగుబాటులోని ప్రత్యేకత అది రాజకీయ స్వభావం కలిగి ఉండడమే. అంతకుముందు జరిగిన రంప తిరుగుబాట్లు బ్రిటీషువారి దోపిడీ వ్యతిరేక తిరుగుబాట్లుగానే జరిగాయి. కానీ రామరాజు లక్ష్యం దేశ స్వాతంత్ర్యం. జాతీయవాద ప్రభావం ఆయనపై వుంది. అంతేకాక గిరిజన ప్రాంతాల్లోని ముఠాదారులు మొదలగు ధనిక రైతులు సాయం చేసినా పోరాటంలో అధిక సంఖ్యలో పాల్గొన్నది సామాన్యులే. మరో విషయం కూడా మనం గమనించాలి. రామరాజు మైదాన ప్రాంతాలనుండి వెళ్ళి పోరాటానికి నాయకత్వం వహించడంతో రాజకీయ ఆశయాలను సరిగ్గా అర్థం చేసుకున్నాడు. రామరాజు పోరాటం పకడ్బందీగా జరిగినా దానిపై ఎదురుదాడి కూడా తీవ్రంగానే జరిగింది. దాన్ని తట్టుకుని వీరోచితంగా సాగిన ఈ పోరాటం చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

మన్యం తిరుగుబాటుకు కాంగ్రెస్ మద్దతు లభించలేదు. హింసాయుత పద్ధతుల్ని వారు నిరసించారు. అప్పటి పత్రికలు కూడా (ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక) తిరుగుబాటు యెడల సానుభూతి చూపలేదు. తుదకు మహాత్ముడు కూడా ఇలాంటి సాయుధ రైతాంగ పోరాటాలకు నిరసన ప్రకటించాడు. ఇది తెలిసిన విషయమే అయినా, ఎన్నో త్యాగాలతో కూడిన రైతాంగ తిరుగుబాట్ల యెడల కనీస సానుభూతి చూపకబోవడం, అప్పటి జాతీయోద్యమ పాక్షిక వైఖరిని, వర్గస్వభావాన్నీ తెలియజేస్తుంది. మన్యం తిరుగుబాటు విఫలం కావడంలో ఆశ్చర్యం లేదు. రామరాజుకున్న ఆలోచన, సామర్థ్యం, అతని ఆశయం, అప్పటి పరిస్థితులకు సరితూగేట్లు లేవు. దేశంలోని ఆర్థిక, సామాజిక పరిస్థితులు ఆ తిరుగుబాటును సమర్థించే పరిణితికి చేరుకోలేదు. ఆ తిరుగుబాటుకు ఆసరాగా దేశంలో మరెక్కడా అలాంటి తిరుగుబాట్లు రాలేదు. కాలపరిపక్వత మాట అటుంచి, ఆంగ్లేయుల సైనికబలం ముందు రామరాజు తిరుగుబాటు నిలువలేకపోయింది.

జాతీయోద్యమంలో భాగంగా, జాతీయోద్యమ స్ఫూర్తితో 1920వ దశకంలో జరిగిన ఈ ఉద్యమాలు, తిరుగుబాట్లు, రైతాంగంలో అలుముకున్న అసంతృప్తినీ, ఆంగ్లేయ వ్యతిరేకతను, పోరాట సన్నద్ధతను తెలియజేస్తున్నాయి. పోరాటాలు నిర్వహించడానికి, త్యాగాలు చేయడానికి, తుదకు ప్రాణాలు అర్పించడానికీ రైతాంగం సిద్ధంగా ఉంది. వారి నా విధంగా పురికొల్పింది అప్పుడు నెలకొన్న పరిస్థితులే ! కానీ వారికొక సంఘటిత ఉద్యమం లేదు. సరైన నాయకత్వం లేదు. సమస్యలకు అద్దం పట్టే భావజాలం లేదు. ఈ లోపాలను పూడ్చడానికి, రైతులను సంఘటిత పర్చడానికి 1930వ దశకంలో అఖిలభారత స్థాయిలో - రైతు ఉద్యమం - కిసాన్ సభ ఆవిర్భవించింది.

# అఖిల భారత కిసాన్ సభ - ఆంధ్రులో రైతు ఉద్యమాలు

ఆధునిక భారతదేశ చరిత్రలో 1920వ దశకం ప్రాముఖ్యతను సంతరించుకుంది. సామ్రాజ్యవాద దేశాల మధ్య, వలసల ఆధిపత్యంకోసం జరిగిన మొదటి ప్రపంచయుద్ధం 1918 లో ముగిసింది. యుద్ధంలో అనేక నష్టాలను చవిచూచిన బ్రిటన్, వలస ప్రపంచంపై తన పెత్తనాన్ని మరింత దృఢతరం చేసుకుంది. యుద్ధంలో పాల్గొనకపోయినా అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచానికి తన ఉనికిని తెలియపరచింది. దీని పర్యవసానమే, అప్పటి అమెరికా అధ్యక్షుడు ఉడ్రోవిల్సన్ ప్రతిపాదించిన 14 అంశాలు (Fourteen Points). యుద్ధానంతరం స్థాపించిన ప్రపంచశాంతి సంస్థ నానాజాతి సమితికి యీ అంశాలే ప్రాతిపదిక అయ్యాయి. యుద్ధ కాలంలో నిరంకుశ జార్ చక్రవర్తుల పరిపాలన అంతమై బోల్షివిక్ విప్లవం రష్యాలో విజయవంతమైంది. సోవియట్ రష్యా ఏర్పడింది. స్వేచ్ఛ, సమానత్వం, సామ్యవాదం పునాదిగా ఏర్పడ్డ సోవియట్ రష్యా ప్రపంచ పీడిత ప్రజలకు ఆశావహంగా నిలిచింది. వలస దేశాల్లో కొనసాగుతున్న జాతీయ విముక్తి ఉద్యమాలకు తన వత్తాసు ప్రకటించింది. గాంధీజీ దక్షిణాఫ్రికా నుండి తిరిగివచ్చి స్వాతంత్ర్యోద్యమానికి కొత్త జవసత్వాలను సమకూరుస్తున్న తరుణం. ఖిలాఫత్ ఉద్యమం, రౌలత్ చట్టాలకు వ్యతిరేకంగా పోరాటం, జలియన్‌వాలాబాగ్ ఉదంతం దేశప్రజల్లో జాతీయ స్ఫూర్తిని ఇనుమడింపజేశాయి. ముందు అధ్యాయంలో ప్రస్తావించినట్లుగా గాంధీజీ సహాయ నిరాకరణోద్యమానికి పిలుపునిచ్చాడు. దేశంలోని నలుమూలలకు విస్తరించి, జాతీయోద్యమం మొదటిసారిగా ప్రజోద్యమంగా మారింది. అదే కాలంలో అనేక రైతు ఉద్యమాలు, పోరాటాలు అనేక ప్రాంతాల్లో విజృంభించాయి. రైతాంగ సమస్యలపై అధ్యయన కృషి కొనసాగింది. స్థానికంగా, ప్రాంతీయంగా రైతుసంఘాల నిర్మాణం కూడా జరిగింది.

ఈ తరుణంలో 1929 లో ప్రపంచ వ్యాప్తంగా ఆర్థికమాంద్యం ఏర్పడి పెట్టుబడిదారీ దేశాల్లోని ఆర్థిక వ్యవస్థలు అతలాకుతలమైనాయి. ఈ సంక్షోభానికి భారతదేశం కూడా గురికాక తప్పలేదు. రైతాంగం నడుం విరిగింది. ఆహార ఉత్పత్తుల మార్కెట్ తగ్గిపోయింది. పంటల ధరలు పూర్తిగా పడిపోయాయి. అయినప్పటికీ రైతులు చెల్లించాల్సిన కౌలురేట్లు, అప్పులపై వడ్డీలు తగ్గలేదు. ఋణభారం అధికం కావడంతో రైతులు తమకున్న కొద్దిపాటి కమతాల్నీ అమ్ముకుని వ్యవసాయ కూలీలుగా మారిపోయారు. గ్రామీణ ప్రాంతాల్లోని చేతివృత్తులవారు తమ వృత్తులను పోగొట్టుకుని నిరుద్యోగులయ్యారు. ఇదీ స్థూలంగా ఆనాటి ఆర్థిక పరిస్థితి. అందులో ప్రధాన భాగమైన రైతాంగ దుస్థితి. నిస్సహాయ, నిరుద్యోగ, నిరాశ్రయ, నిరాధార రైతాంగాన్ని ఆదుకోవడానికి జాతీయోద్యమంలోని అభ్యుదయ శక్తులు, ముఖ్యంగా వామపక్షాలు ముందుకొచ్చాయి. 1930-34లో ఉప్పుసత్యాగ్రహం పేరిట జరిగిన శాసనోల్లంఘన ఉద్యమం విరమించబడ్డంతో వామపక్ష శక్తులు ప్రజల్లోని నిరాశా నిస్పృహలను ఉపయోగించుకొని మరింత పుంజుకున్నాయి.

1936 జనవరిలో మీరట్ నగరంలో కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ జాతీయ సమావేశం జరిగింది. ఆ సందర్భంగా వామపక్ష రాజకీయ కార్యకర్తలు రైతాంగ సమస్యలు చర్చించడానికి ఒక సన్నాహక కమిటీని వేయాలని తీర్మానం చేశారు. దానికి సంయుక్త కన్వీనర్లుగా శ్రీయుతులు ఎన్.జి. రంగా, జయప్రకాష్ నారాయణ్‌లను నియమించారు. అఖిలభారత కిసాన్ కాంగ్రెస్‌ను ఏర్పాటు చేసే బాధ్యతను వీరికి అప్పగించారు. అదే సంవత్సరం ఏప్రిల్‌లో జాతీయ కాంగ్రెస్ లక్నోలో సమావేశమైంది. దేశంలోని పలుప్రాంతాల నుండి వచ్చిన రైతుసంఘాల ప్రతినిధులను అక్కడ సమావేశపరిచారు. ఈ సమావేశంలో అఖిలభారత కిసాన్ సభ ఏర్పడింది. దాన్నే ప్రథమ మహాసభగా పేర్కొన్నారు. అఖిలభారత కిసాన్ సభ ప్రారంభమైంది. శ్రీయుతులు స్వామి సహజానంద సరస్వతి (బీహార్), ఎన్.జి. రంగా (ఆంధ్ర), సోహన్‌సింగ్ జోష్ (పంజాబ్), ఇందూలాల్ యాగ్నిక్ (గుజరాత్) ఆ సభకు హాజరైన ప్రముఖులలో కొందరు. వీరికి తోడు కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీకి చెందిన జయప్రకాష్ నారాయణ్, రామ మనోహర్ లోహియా కూడా ఉన్నారు. అప్పటి జాతీయకాంగ్రెస్ అధ్యక్షుడైన జవహర్లాల్ నెహ్రూ సభకు హాజరై తన సంఘీభావాన్ని తెలిపాడు. భూ యాజమాన్యం ఎవరికుండాలి ? అనేది ప్రధాన సమస్యగా ఆయన భావించాడు. కిసాన్ సభ జాతీయ కాంగ్రెస్‌కు అనుబంధంగా ఉండాలని కూడా నెహ్రూ అభిప్రాయపడ్డాడు. కానీ ఆ ప్రతిపాదనను కాంగ్రెస్ తిరస్కరించింది.

స్వామి సహజానంద కిసాన్ సభ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. రైతులను దోపిడికి గురిచేస్తున్న భూస్వామ్య, జమిందారీ వ్యవస్థను రద్దు చేయాలని సహజానంద అభిలషించాడు. రైతాంగ పోరాటాలకు సరైన సమయం వచ్చిందని గట్టిగా విశ్వసించాడు. కిసాన్ సభ ఏర్పాటు ప్రధానంగా రైతులను జమిందార్ల నుండి కాపాడ్డం కోసమే జరిగిందని రామమనోహర లోహియా తెలియపరిచాడు.

అప్పుడు చేసిన తీర్మానాలు, రైతాంగాన్ని ఆర్థికదోపిడి నుంచి విముక్తి చేయాలని, దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించాలని, జమిందారీ ఇనాందారీ, తాలూక్‌దారీలాంటి భూస్వామ్య వ్యవస్థల్ని రద్దు చేయాలనీ పేర్కొన్నాయి. రైత్వారీ ప్రాంతాల్లోని అధిక భూమిశిస్తు పద్ధతిని మార్చాలని తీర్మానాలు చేశారు. కిసాన్ సభ ప్రణాళిక నమూనాను తయారుచేసి, ఆచార్య ఎన్.జి. రంగాను కార్యదర్శిగా ఎన్నుకున్నారు. సభకు హాజరైన వివిధ రాష్ట్రాల ప్రతినిధులను తమ తమ ప్రాంతాల్లో అనుబంధ శాఖలు ఏర్పాటు చేయాలని ఆదేశించారు.

**ఫైజ్‌పూర్ మహాసభ (1936) :** అఖిలభారత కిసాన్ సభ రెండో మహాసభ 1936 డిసెంబర్ 26, 27 తేదీల్లో మహారాష్ట్రలోని ఫైజ్‌పూర్‌లో జరిగింది. మహాసభకు ఎన్.జి. రంగా అధ్యక్షత వహించాడు. ఈ మహాసభలోని ఒక ముఖ్యాంశం. మన్మాడ్ నుండి 500 మంది రైతులు, 200 మైళ్ళు పాదయాత్ర చేసి ఎర్రజెండాలతో వచ్చారు. నెహ్రూ, రంగా, జయప్రకాష్ నారాయణ్, ఎం.ఎన్. రాయ్, నరేంద్రదేవ్, డాంగే, యూసఫ్ మెహ్రాలీలాంటి కాంగ్రెస్ నాయకులు,

రైతునాయకులు వారికి స్వాగతం చెప్పారు. ఎన్.జి. రంగా తన అధ్యక్షోపన్యాసంలో ఇలా చెప్పాడు. "సోషలిస్టు రాజ్యాన్ని, సమాజాన్ని ఏర్పరచుకునే ధ్యేయంతో మనం తయారవ్వాలి. ఈనాటి అన్నివిధాల ప్రజలను దోపిడి చేసే సంస్థలు, వాటి ప్రయోజనాలను పూర్తిగా రద్దుచేస్తేనే తప్ప అలాంటి సమాజం ఏర్పడదు. ఇతర దేశాల్లోని కార్మికవర్గాలు తమ రాజకీయ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నారు. కానీ మనం అటు బ్రిటీషు సామ్రాజ్యవాదులతోను, ఇటు మధ్యయుగంనుంచీ కొనసాగుతున్న దుస్సంప్రదాయాలతోను దీర్ఘకాల పోరాటాలు సాగించాల్సి వుంది. స్వరాజ్యంకోసం జరిపే మన పోరాటానికి ప్రతి దశలోనూ, జమీందార్లు, పెట్టుబడిదార్లు అడ్డంకులు సృష్టిస్తున్నారు.... సోషలిస్ట్ ప్రభుత్వాన్ని సాధించేందుకు బాధలను అనుభవిస్తూ, పోరాటాలను సాగించే రైతుల, కార్మికులదే భవిష్యత్తు. గ్రామాల్లోను, పట్టణాల్లోనూ ఉన్న కార్మికులు జరిపే పోరాటాల్లో, వాటితో ప్రతి రైతూ చేయి కలపడం పవిత్ర కర్తవ్యంగా భావించాలి. సమిష్టి కృషితో ఎంతో సాధించవచ్చు".

అఖిలభారత కిసాన్ సభ ఏర్పడ్డం, ప్రత్యేకించి రైతు సమస్యలపై దృష్టి సారించడం, జాతీయ కాంగ్రెస్‌లోని ప్రముఖ నాయకులు దీనికి తమ మద్దతు ప్రకటించడం, సమావేశాల్లో చురుగ్గా పాల్గొనడం వల్ల జాతీయ కాంగ్రెస్ తన ఎజెండాలో వ్యవసాయ సంబంధిత కార్యక్రమాన్ని భాగంగా చేర్చుకుంది. రైతాంగం ఎదుర్కొంటున్న పేదరికం, నిరుద్యోగం, ఋణభారం దేశంలో తక్షణ సమస్యలుగా పేర్కొంది. సామ్రాజ్యవాద దోపిడిని తొలగించాలనీ, భూస్వామ్య విధానం రద్దుకావాలనీ, పన్నుల విధానం మార్పు చెందాలనీ, రైతాంగానికి తక్షణ సహాయం అందించాలనీ ప్రకటించింది. రైతులకు సంబంధించిన అన్ని సమస్యలను ఈ కార్యక్రమంలో చేర్చింది. 1937 లో జరగనున్న ఎన్నికల ప్రణాళికలో వీటిని చేర్చింది కూడా. చిత్రమేమంటే, ఈ డిమాండ్లను ఎన్నికలముందుగానీ, ఆ తరువాతగానీ కాంగ్రెస్ అమలుజరపలేదు. పైగా కిసాన్‌సభ వర్గపోరాట పంథాని చేపట్టి, ఆ ప్రాతిపదికపై ఉద్యమాలను నిర్మించేకొద్దీ కిసాన్ సభ అంటే కాంగ్రెస్‌కు గిట్టని విధంగా తయారైంది. 1937 ఎన్నికలయ్యాక, కాంగ్రెస్ పాలిత రాష్ట్రాల్లో కిసాన్‌సభ కార్యక్రమాలపై, కార్యకర్తలపై నిర్బంధం ఎక్కువైంది. జమిందార్లతో లాలూచీ, రైతులపట్ల విరోధ వైఖరి, నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ లాంటి నాయకులకు వేరే అభిప్రాయాలున్నప్పటికీ, మొత్తంమీద కాంగ్రెస్ కిసాన్ సభను తన సంస్థలో ఒక భాగంగా ఇముడ్చుకోలేకపోయింది.

## ఆంధ్ర ప్రాంతంలో రైతు ఉద్యమాల పుట్టుక

జాతీయ స్థాయిలో కిసాన్ సభ నిర్మాణం, పెంపుదల, పై విధంగా సాగుతుండగా, ఆంధ్ర దేశంలో అంతవరకూ ప్రాంతీయ పరిధిలో సాగుతున్న రైతు ఉద్యమం జాతీయ స్థాయి ఉద్యమంలో భాగమైన క్రమ పరిణామాన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

నేటి ఆంధ్రప్రదేశ్‌లోని కోస్తా, రాయలసీమ జిల్లాలు 19వ శతాబ్దపు ప్రారంభంకల్లా ఆంగ్లేయుల ప్రత్యక్ష పాలనలోకి వచ్చాయి. తెలంగాణా ప్రాంతం అప్పట్లో హైదరాబాద్ రాష్ట్రంగా నైజాం నవాబు పాలనలో ఉండేది. పేరుకు ఇది స్వతంత్ర రాజ్యమైనా దానిపై పెత్తనం మాత్రం ఆంగ్లేయులే వహించారు. వారి చట్టాలు, సంస్కరణలు ఇక్కడ ప్రవేశపెట్టలేదు. హైదరాబాదు రాష్ట్ర వెనుకబాటుతనానికి (మిగతా ప్రాంతాలతో పోల్చినప్పుడు) ఇది ఒక ముఖ్య కారణం. అదలా ఉంచి ఆంధ్రప్రాంతానికొస్తే, 1800 తరువాత బ్రిటీషువారు దేశంలో తమ ఏలుబడి కింద వున్న ఇతర ప్రాంతాల్లోలాగే ఇక్కడ కూడా రెవెన్యూ, విద్య, పరిపాలన, రాజకీయార్థిక సంస్కరణలను ప్రవేశపెట్టారు. కోస్తా ప్రాంతంలో భూమిశిస్తు విధానం ముఖ్యంగా జమిందారీ పద్ధతి కాగా, రాయలసీమ జిల్లాల్లో రైత్వారీ విధానాన్ని అమలుపరిచారు. ఈ రెండు విధానాలు, ఇంతకుముందు చెప్పుకున్నట్లుగా, రైతుల ప్రయోజనాలను కాపాడలేకపోయాయి. జమిందారీ పద్ధతి సరేసరి. అటు రైత్వారీ పద్ధతిలో కూడా ధనిక భూస్వాములు బలంగా ఎదిగారు. వారికి చేదోడువాదోడుగా వడ్డీ వ్యాపారస్తులు నిలిచారు. దీంతో రైతుల ఆర్థిక పరిస్థితి అధ్వాన్నమైంది. రైతాంగం తమ వ్యతిరేకతను వెల్లడించడానికి పూనుకున్నారు. ఈ క్రమంలో రైతుసంఘాల నిర్మాణం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో రైతు సంఘాలు చెదురుమదురుగా 20వ శతాబ్దానికి కొంచెం అటు ఇటుగానే ప్రారంభమైనాయి. 19వ శతాబ్దపు ఆఖరు దశకంలో ఆంధ్రప్రాంతంలో జిల్లా మహాసభలు మొదలయ్యాయి. ఇవి ముఖ్యంగా రైతు సమస్యలను ముగ్గులోకి తెచ్చాయి. ఈ జిల్లా మహాసభలు డెల్టా ప్రాంతాలైన గోదావరి, కృష్ణాజిల్లాల్లో ప్రారంభం కావడం ఆయాచితంగా జరగలేదు. 1850 దశకంలో గోదావరి, కృష్ణా నదులపై కట్టిన ఆనకట్టల పర్యవసానంగా ఈ జిల్లాల్లో ఒక సంపన్న మధ్యతరగతి రైతాంగం పుట్టుకొచ్చింది. సాంప్రదాయిక తిండిగింజల పంటలతోపాటు వ్యాపారపంటలు కూడా అభివృద్ధి చెంది ఆర్థికంగా రైతాంగం బలపడింది. సమాజంలో విద్యాధిక మధ్యతరగతి వర్గంలో పెంపొందిన చైతన్యమే రైతాంగంలో కూడా ప్రస్ఫుటం కావచ్చింది. డెల్టా ప్రాంతపు రైతులు నీటితీరువా పన్ను హెచ్చింపుపై సమీకృతమవడం ఇప్పుడే జరిగింది. పంటకాలువల రిపేర్లు, గ్రామాలకు రవాణా సౌకర్యాలు, విద్యాసౌకర్యాల కోసం ఈ మహాసభల్లో తీర్మానాలు చేయనారంభించారు. అప్పటి తెలుగు పత్రికల్లో ఈ సభల గూర్చిన సమాచారం పుష్కలంగా లభ్యమౌతుంది. జిల్లా మహాసభలు (District Conferences) జరగడం, మొత్తం భారతదేశంలోనే ఆంధ్ర ప్రాంతంలో ప్రథమంగా జరగడం గమనార్హం. 1892 లో కృష్ణాజిల్లా మహాసభ ఏలూరులో జరిగింది. ఆ తరువాత వివిధ జిల్లా రాజకీయ సభల్లో రైతు సమస్యలు చర్చించి తీర్మానాలు చేశారు. రైతుల్లో పొడసూపిన ప్రభుత్వ వ్యతిరేక స్పృహ రైతుసంఘాల నిర్మాణానికి ప్రోది చేసింది. 1905 లో గుడివాడ తాలూకా రైతులు సమావేశమై తమ సమస్యలపై తీర్మానాలు చేశారు. ఇదే క్రమంలో, 1908 లో నెల్లూరు జిల్లాలో వ్యావసాయక సంఘం ఒకటి ఏర్పాటైంది. వ్యవసాయ పద్ధతుల్లో మేలైనవి ఎంపిక చేసినవాటి గురించిన

ప్రచారంతోపాటు, ప్రభుత్వానికి మహజర్లు సమర్పించడం, రైతులకు కావల్సిన వ్యవసాయ పనిముట్లు తెప్పించి ఇవ్వడం, వారి కార్యక్రమాల్లో భాగాలయ్యాయి. నీటిపారుదల సౌకర్యాలు పెంచాలనీ, పంటలు పండనప్పుడు శిస్తు రెమిషన్ పొందే హక్కు రైతులకు న్యాయబద్ధంగా ఇవ్వాలనీ, వ్యవసాయదారులకు కావల్సిన అడవిలోని కలప వగైరాలు ఉచితంగా పొందే హక్కు ఉండాలనీ తీర్మానాలు చేశారు.

1914 లో కృష్ణాజిల్లా రైతు మహాసభ జరిగింది. 1920 దశకంలో జరిగిన కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాల మహాసభల్లో జమీందారీ ప్రాంతాల్లోని రైతుల సమస్యలపై తీర్మానాలు చేశారు. జమీందార్ల భూములను ప్రభుత్వం వశపరచుకుని, పరిహారంగా జమీందార్లకు కొంతమేరకు ఆర్థిక వనరులు సమకూరిస్తే, జమీందార్ల బారినుండి రైతులను తొలగించవచ్చునని ఈ సభలు అభిప్రాయపడ్డాయి. జమీందారీ ప్రాంతాల్లో రైతులనుభవిస్తున్న దుర్భర పరిస్థితులను విచారించి పరిష్కార మార్గాలు చూపడానికి, విచారణ కమిటీని వేయాలని ఈ సభలు డిమాండ్ చేశాయి. 1920 లో తెనాలి పట్టణం నుండి 'రైతు' అనే పత్రిక త్రిపురనేని రామస్వామి చౌదరి సంపాదకత్వంలో వెలువడడం, రైతాంగ చైతన్యంలో ఒక ముఖ్య మజిలీ. ఇదే కాలంలో జమీందారీ ప్రాంతాల్లో రైతులు, జమీందార్ల పెత్తనానికి నిరసనగా సంఘర్షణలకు దిగారు. ఈ ఘటనలు జమీందారీ రైతుసంఘాల ఏర్పాటుకు దోహదం చేశాయి. 1920 కల్లా రైతు సమస్యలపై కృషి చేయడానికి తాలూకా, ఫిర్కాస్థాయివరకు సంఘాలు ఏర్పడ్డం గమనార్హం. ఈ సంఘాల్లో పాల్గొన్నవారు రైతాంగంలోని అన్ని స్థాయిలకు చెందినవారు. అయితే నాయకత్వం మాత్రం ధనికరైతుల, న్యాయవాదుల, విద్యావంతుల చేతిలో వుండేది. నాయకత్వంలోని వారికి జాతీయ కాంగ్రెస్ రాజకీయ వాసన కూడా లేకపోలేదు. అందుకనే ఈ దశలోని రైతుసంఘాల నిర్మాణం జాతీయోద్యమంలో భాగంగానే మనం చెప్పుకోవాలి.

సహాయ నిరాకరణ ఉద్యమం, రైతాంగాన్నీ, వారి సమస్యల్నీ ముందుకు తేవడం జాతీయ కాంగ్రెస్ ఊహించని పరిణామం. జాతీయోద్యమంలో రైతాంగం పాల్గొనడం ఇదే మొదటిసారని మనం ముందే చెప్పుకున్నాం. గాంధీ నాయకత్వంలో జాతీయ కాంగ్రెస్ ఆశించింది కూడా అదే. జాతీయోద్యమ పునాది పెరగాలి. సమాజంలోని మరిన్ని వర్గాలు ఉద్యమంలో పాల్గొనాలి. తద్వారా ఉద్యమం బలపడాలి. 1921-22 లలో జరిగింది సరిగ్గా ఇదే. కానీ దీనివల్ల ఒనగూడిన ఫలితం మాత్రం భిన్నం. రైతాంగం జాతీయోద్యమ లక్ష్యాల పరిధికి మాత్రమే లోబడలేదు. సమాజంలోని ఒక వర్గపు ప్రజలు ఉద్యమంలో, ఆ ఉద్యమ లక్ష్యాలతో ప్రభావితులై పాల్గొన్నా కూడా, ఆ పాల్గొనడం అన్నది తమ ప్రయోజనాల లక్ష్యాలవైపు కూడా ఆ తర్వాత కాలంలో కొనసాగుతుంది. దీనికి ఇంకొంచెం వివరణ ఇవ్వాల్సి వుంది. ఇక్కడ, రైతాంగం పాల్గొన్నది అన్నప్పుడు 'రైతాంగాన్ని' సామాన్యార్థంలో (Generalisation) ప్రయోగిస్తున్నాం. రైతాంగం మొత్తాన్నీ ఒకే మూసలో పోసి - ఒకే యూనిట్‌గా పరిగణిస్తున్నాం. అప్పట్లో జరిగిందిదే.

అప్పటికింకా భారతీయ కిసాన్ ఉద్యమంలో రైతాంగ వర్గీకరణ జరగలేదు. ఇంకా చెప్పాలంటే సహాయ నిరాకరణోద్యమంలో ఎంతో కొంత పెద్ద ఎత్తున రైతాంగం పాల్గొనింది - అన్నప్పుడు అప్పటి దశలో ధనిక మధ్యతరగతి రైతులు పాల్గొన్నారనే చెప్పాలి. అప్పట్లో రైతాంగ చైతన్యం అంతవరకే పరిమితమైంది. ఇక, ఇప్పుడు మనం ఈ పేరా మొదట్లో వివరిస్తున్న రైతాంగ ఉద్యమ ఆశయాలను గూర్చిన చర్చ కొనసాగిద్దాం. జాతీయోద్యమంలో పాల్గొన్న అప్పటి రైతాంగం, ఆ పోరాట క్రమంలో జాతీయ ఉద్యమ లక్ష్యాలను అధిగమించి తన వర్గ లక్ష్యాలను ముందుకు తెచ్చింది. అందువల్లనే సహాయ నిరాకరణోద్యమాన్ని అర్థంతరంగా నిలిపివేసినప్పటికీ, రైతాంగంలో ఆ పోరాటం కలిగించిన చైతన్యంతో రైతుసంఘాల నిర్మాణం జరిగింది. గుంటూరుజిల్లా రైతుసంఘం 1923 లో అప్పికట్లలో ఏర్పడింది. ఇక్కడ జరిగిన రైతు మహాసభకు పాతూరు వెంకటప్పయ్య అధ్యక్షత వహించాడు. ఈ సభలో పాల్గొన్న ఆచార్యరంగా (అప్పటి గోగినేని రంగనాయకులు) సమాజంలో అత్యధిక సంఖ్యలో ఉన్న రైతాంగానికి రాజకీయాధిపత్యం కావాలని మొట్టమొదటిసారిగా వాక్రుచ్చాడు. ఆ తరువాత, అదే దశకంలో ఒంగోలు ప్రాంతంలో ఒక రైతు సంఘం ఏర్పడింది. జాతీయ కాంగ్రెస్ ఉద్యమంలో చురుగ్గా పనిచేస్తున్న మాగంటి బాపినీడు, దుగ్గిరాల సూర్యప్రకాశరావు మొదలగు రైతు నాయకులు ఫిర్కా, తాలూక, జిల్లా స్థాయిల్లో రైతుసంఘాలు ఏర్పాటుచేసి వాటిని రాష్ట్రస్థాయి రైతుసంఘానికి అనుసంధించాలని విస్తృత ప్రచారం చేశారు. ఆ విధంగా ఏర్పడే రైతుసంఘం, అప్పటి ముఖ్య రైతు సమస్యలైన ఋణాలు, ఎరువులు, విత్తనాలు, రీసెటిల్‌మెంట్ సమస్యలను శాసనసభ దృష్టికి తీసుకెళ్ళాలని నిర్ణయించారు.

పై క్రమంలో ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం అనే సంస్థ తన ప్రథమ మహాసభను గుంటూరులో జరుపుకుంది. బిక్కిన వెంకటరత్నం అధ్యక్షుడు. కాగా, మాగంటి బాపినీడు, నరసింహదేవర సత్యనారాయణ, ఎన్.జి. రంగా కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. ఈ మహాసభ ప్రధానంగా చర్చించిన సమస్య రీసెటిల్‌మెంట్ రిపోర్ట్స్ ఆధారంగా పెంచిన భూమిశిస్తు. ఈ సమస్య ముఖ్యంగా కృష్ణా, ఉభయగోదావరుల ధనిక రైతులకు సంబంధించినదైనా, అది ప్రధాన భూమిక కావడం అప్పుడే ఏర్పడ్డ రైతుసంఘ వర్గ స్వభావాన్ని సూచిస్తుంది. రుణభారం, సహకార ఉద్యమంలాంటి ఇతరేతర సమస్యలు కూడా ఇక్కడ చర్చకు వచ్చాయి. రాజకీయంగా కూడా ఈ మహాసభ ఒక తీర్మానంలో సైమన్ కమీషన్ రాకను బహిష్కరించాలని రైతులకు పిలుపు నిచ్చింది.

రెండో రాష్ట్ర రైతు మహాసభ 1929 లో విజయవాడ పట్టణంలో జరిగింది. దీనికి ఆచార్య ఎన్.జి. రంగా అధ్యక్షుడు. సామాన్య రైతు సమస్యలతోపాటు రైతులకు పూర్తి రక్షణకోసం రైతు రాజ్యస్థాపన జరగాలని ఆచార్యరంగా వాంఛించాడు. నిశితంగా గమనిస్తే ఈ భావన జాతీయోద్యమ లక్ష్యాలకు కొద్దిగా భిన్నంగా ఉన్నట్లు స్ఫురిస్తుంది. జాతీయ స్వాతంత్ర్యం వచ్చినంత మాత్రాన, కాంగ్రెస్ ఆశిస్తున్నట్లుగా రైతు సమస్యలు పరిష్కారం కావేమోనన్న శంకద్యోతకమయింది.

మూడో ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభ బాపట్లలో 1931 లో జరిగింది. వేమవరపు రామదాసు పంతులు అధ్యక్షుడు ఎన్.జి. రంగా కార్యదర్శి, మాగంటి బాపినీడు - మరో ఇద్దరు సహాయ కార్యదర్శులు. మూడవ మహాసభ జరిగే సమయానికి రైతాంగ ఉద్యమం తన పోరాటాన్ని రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా సాగించింది. అంటే రైతాంగ ఉద్యమాలు ఈ మూడు సంవత్సరాల కాలంలో (1928-31) రైత్వారీ ప్రాంతాల్లో జరిగాయి. భూమిశిస్తు విధానంలో, 30 సంవత్సరాలకొకసారి శిస్తును సమీక్షించి తిరిగి పన్ను విధించాల్సి వుంటుంది. దీనిప్రకారం 1928 లో కొత్త శిస్తు విధానం అమల్లోకి రావాలి. అయితే రైతాంగంలో వచ్చిన వ్యతిరేకత దృష్ట్యా ప్రభుత్వం కొంత మందకొడిగా ఈ విధానాన్ని అమలుపరచబూనుకుంది. రీసెటిల్‌మెంట్ పని నిర్వహించేందుకు ప్రభుత్వం బి.జి. హోల్డ్స్‌వర్త్ (B.G. Holdsworth)ను ప్రత్యేకాధికారిగా నియమించింది. అతడు సమర్పించిన నివేదికలో భూమి విలువ గణనీయంగా పెరిగిందనీ, తిండిగింజల ధరలు కూడా పెరిగాయనీ, తద్వారా వ్యాపార వాణిజ్యాలు కూడా పెంపొందాయనీ చెబుతూ భూమిశిస్తును రూపాయకు మూడు అణాలు పెంచాలని సిఫార్స్ చేశాడు. దీనికి వ్యతిరేకంగా రైతులు సమీకృతమయ్యారు. కృష్ణాజిల్లా రైతు మహాసభలో (1928) పెంచిన పన్నుకు వ్యతిరేకంగా తీర్మానం చేశారు. ప్రభుత్వం పెంచదల్చుకున్న భూమిశిస్తు, నీటితీరువాలను వ్యతిరేకించారు. దీంతో కోస్తా జిల్లాల్లో రైతు ఉద్యమం విస్తరించింది. ఈ ఉద్యమానికి పరోక్షంగా 1928 లో 'బార్డోలీ'లో శిస్తు హెచ్చింపుకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం ఊపు నిచ్చింది. దీనికితోడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ 1928 లో జూలైలో సమావేశమైనప్పుడు, టంగుటూరి ప్రకాశంపంతులు భూమిశిస్తు - సెటిల్‌మెంట్‌లకు వ్యతిరేకంగా రైతులు గ్రామగ్రామాన సభలు నిర్వహించాలని పిలుపు నిచ్చాడు. వ్యవసాయానికి సంబంధించిన ఆదాయాలు, ఖర్చులు, రుణాలు తదితరాలపై వాస్తవాలు సేకరించి, సెటిల్‌మెంట్ ఆఫీసర్ నివేదికలోని లోపాలను బహిర్గతం చేయాలన్నాడు. ప్రభుత్వం పెంచదల్చుకున్న పన్ను చట్టవిరుద్ధమనీ, ప్రజల సమ్మతి లేనిదే పెంచకూడదనీ ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానం చేయడం, దానిప్రకారం ప్రజోద్యమాన్ని నిర్మించాలనుకోవడం ఇక్కడ మనం గమనించదగ్గ విషయం. కాంగ్రెస్ క్రమేపీ తన కార్యక్రమాన్ని రైతుల్లోకి తీసుకెళ్ళి, వారి సమస్యలను చేబూనడం ద్వారా తమ పలుకుబడిని పెంచాలనుకుంది. ఇది ఒక అభిప్రాయం. మరొక కోణం నుంచి చూసినప్పుడు సమాజంలో అధిక భాగంగా ఉన్న రైతాంగ సమస్యలు పట్టించుకోకుండా ఉంటే రైతులు మరొక (రాజకీయ) మార్గంలోకి వెళ్ళే అవకాశాన్ని కూడా కాంగ్రెస్ తన దృష్టిలో ఉంచుకుంది. కానీ రైతుల్ని మాత్రం పన్ను కట్టవద్దని కాంగ్రెస్ చెప్పలేదు. ప్రచారానికి మాత్రమే పరిమితమై రైతాంగంలో కాంగ్రెస్ రాజకీయాలను విస్తృతపరచాలనుకున్నారు. ఏమైనా పైన చెప్పినట్లు ఆంధ్రలో రైతాంగ సమస్యలను ప్రత్యక్షంగా చేపట్టే ప్రక్రియను కాంగ్రెస్ ఇప్పుడే (1928 ప్రాంతంలో) ప్రారంభించింది. కానీ అంతర్గతంగా కాంగ్రెస్ సంస్థలో అనేకమంది భూవసతి కలిగినవాళ్ళు ఉండడంతో రైతాంగ ఉద్యమానికి నాయకత్వం వహించడంలో కాంగ్రెస్ పూర్తిగా సఫలీకృతం కాలేకపోయింది.

ఉభయగోదావరుల, కృష్ణాజిల్లాల రైతులు మాత్రం ఒక ఐక్య కమిటీగా ఏర్పడి దండు నారాయణ రాజు నాయకత్వంలో రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా ఉద్యమం కొనసాగించారు. దీంతో ప్రభుత్వం ఒక ఆర్థిక విచారణ కమిటీని ఏర్పరచింది. దీనికి ప్రజాప్రతినిధుల్నే సభ్యులుగా నియమించింది. ఆచార్య రంగా కార్యదర్శిగా ఏర్పడ్డ ఈ కమిటీ ఈ మూడు జిల్లాల్లో విస్తృతంగా పర్యటించింది. భారీ సంఖ్యలో ప్రజలు హాజరయ్యారు. అవసరమైతే ప్రత్యక్ష చర్య చేపట్టాలన్న అభిప్రాయం వ్యక్తమై, ఆ విధంగా తీర్మానాలు కూడా చేశారు. వీటి పర్యవసానం, ప్రభుత్వం పెంచిన పన్నును వసూలు చేయాలని నిర్ణయించుకున్నప్పుడు, పన్నుల నిరాకరణకు పిలుపిచ్చారు. ఈ తరుణంలో గుంటూరుజిల్లా రైతాంగం కూడా అక్కడ ప్రవేశపెట్టబూనుకున్న రీసెటిల్ మెంట్‌కు వ్యతిరేకంగా ఉద్యమంలో ప్రవేశించింది. ఆర్థిక విచారణ కమిటీ నివేదిక వ్యవసాయ ఖర్చులు ఎంతగానో పెరిగాయనీ, రైతులకు మిగులుతున్న ఆదాయం వారి జీవనోపాధికి కూడా చాలడం లేదనీ, రుణభారం ఎక్కువై రైతులు తమ భూములు కోల్పోతున్నారనీ నివేదించింది. ఈ నివేదిక రైతు ఉద్యమానికి మరింత ఊపు నిచ్చింది. ఇంతేకాక గుజరాత్‌లో సర్దార్ వల్లభాయ్ పటేల్ నాయకత్వంలో, అదే సమయంలో ఖేడా, ఖైరా జిల్లాల్లో జరుగుతున్న రీసెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమం సత్ఫలితాలను సాధించడంతో, కృష్ణా గోదావరి జిల్లాల రైతులు మరింత ఉత్తేజితులయ్యారు. ప్రభుత్వోద్యోగులకు రైతులు సహాయపడలేదు. వేలం వేస్తే భూములు కొనడానికి ఎవరూ ముందుకు రాకపోవడం, జప్తుచేసిన వస్తువులను ప్రభుత్వ కార్యాలయాలకు తరలించేందుకు సహాయం అందకపోవడంతో ప్రభుత్వం బలహీనపడింది. 1930 దశకంలో గాంధీజీ తన రెండవ సహాయ నిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం పేరుతో ఆరంభించాడు. పోరాట పథంలో ఉన్న రైతాంగం ఇందులో ఉధృతంగా పాల్గొని ఉప్పు సత్యాగ్రహ యాత్రల్ని విజయవంతం చేసింది. ఇంకోవైపు భగత్‌సింగ్, రాజగురులాంటి విప్లవకారుల ఉరితీతలు దేశంలో అలజడిని రేపాయి. లక్షలాది ప్రజలు జైళ్ళు పాలయ్యారు. ఈ సంక్షోభ సమయంలో ప్రభుత్వం 1934 వరకూ రీసెటిల్‌మెంట్ ప్రకారం పెంచిన పన్నులను వసూలు చేయలేదు. అంతేకాక 1929 లో వచ్చిన ఆర్థికమాంద్యంతో రైతుల ఆర్థిక పరిస్థితి మరింత దిగజారింది. పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు మాత్రమేకాక, వాటికంటే అధికంగా వ్యవసాయ సరుకుల ధరలు పడిపోయాయి. భూముల ధరలు కూడా బాగా దెబ్బతిన్నాయి. 1931లో వడ్ల బస్తాధర కేవలం 21/2 రూపాయలు మాత్రమే. కిరోసిన్ డబ్బా 14 అణాలు (రూపాయికంటే తక్కువ) గజం చొక్కాగుడ్డ 2 అణాల 6 పైసలు. సత్యనాధన్ కమిటీ రిపోర్టు ప్రకారం అప్పటికి రైతాంగ రుణభారం 103 కోట్లు దాటింది. నిరుద్యోగం పెరగడం, నిత్యావసర వస్తువులను, కనీస జీవనభృతికి కావల్సిన అవసరాలను కొనలేని స్థితిలోకి పేదరైతులు దిగజారారు. దీంతో అప్పులు ఎక్కువయ్యాయి. వడ్డీ వ్యాపారస్తులు, భూస్వాములు, రైతుల భూములను చౌకగా కొనుక్కున్నారు. శిస్తులు కట్టలేని రైతుల భూములు వేలం వేయడం, జమీందారీ ప్రాంతాల్లో శిస్తు వసూళ్ళకోసం నిర్బంధకాండ

ప్రయోగించడం, భూముల్నుండి వెళ్ళగొట్టడంలాంటి చర్యలు జరిగాయి. అనేకమంది పేదరైతులు కొసకు తమ భార్యల మంగళసూత్రాలు అమ్మి, పన్నులు చెల్లించిన సందర్భాలు కూడా అనేకం వున్నాయి. దీంతో రైతు సభలు గ్రామస్థాయి నుండి జిల్లా స్థాయివరకూ విస్తృతంగా జరిగాయి. రుణాలను రద్దుచేస్తూ ప్రభుత్వం మారుటోరియం ప్రకటించాలన్న డిమాండ్‌తో రైతాంగం మరింత సంఘటితమైంది.

ఇంతటి ఆర్థిక సంక్షోభం ఒకవైపు జరుగుతుండగానే, మద్రాస్ ప్రభుత్వం రీసెటిల్‌మెంట్ ద్వారా పెంచిన, రూపాయికి మూడణాల వంతున అదనపు పన్నును, ప్రజలనుంచి వసూలుచేయ మొదలెట్టింది. జైళ్ళుపాలయ్యారు. రైతు ఉద్యమం ఈ తరుణంలో మరింత వేగం పుంజుకుంది. కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలకే కాక గుంటూరు, నెల్లూరు తదితర జిల్లాలకు రైతు ఉద్యమం వ్యాపించింది. ఎట్టకేలకు ప్రభుత్వం దిగివచ్చి 1935 భారత ప్రభుత్వచట్టం అమల్లోకి వచ్చేంతవరకూ పన్ను వసూళ్ళను ఆపివేయాలని నిర్ణయించుకుంది.

ఇక్కడ రెండు అంశాలను మనం గమనించాలి. ఒకటి 1931-32 రీసెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమం, ఆంధ్రదేశంలోని రైతాంగ ఉద్యమంలో ఒక గుణాత్మక మార్పును తీసుకురాగలిగింది. రైతాంగ ఉద్యమం స్పష్టమైన డిమాండ్లతో సంఘటితమైంది. ప్రభుత్వ నిర్బంధకాండను ధైర్యంగా ఎదుర్కొంది. రైతాంగాన్ని తమ సమస్యలపై చైతన్యవంతం చేసే కార్యక్రమం కొనసాగింది. శిక్షణ శిబిరాలు నెలకొల్పడం, ఉద్యమ కార్యకర్తలను తయారుచేయడం ఆరంభమైంది. రెండు, జమీందారీ ప్రాంతాల్లో రైతుసంఘాలు ఏర్పడ్డాయి. రైతు ఉద్యమంలో ఇదొక మలుపు. ఇదే కాలంలో, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, 1934 లో, ఆంధ్ర దేశంలో కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ స్థాపించబడింది. అంతకంటే ముఖ్య విషయం అదే సంవత్సరంలో ఆంధ్ర కమ్యూనిస్ట్ పార్టీ ఆర్గనైజింగ్ కమిటీ కూడా ఏర్పడింది. అప్పటినుండే రైతాంగ ఉద్యమానికి వర్గస్వభావం ఏర్పడ్డ జొచ్చింది. దోపిడీకి గురవుతున్న రైతులు మాత్రమేకాక, వ్యవసాయకూలీలు, కార్మికులు సంఘటితమై తమ సంఘాలను ఏర్పరచుకొని, ఒకవైపు తమ డిమాండ్లకోసం పోరాడుతూ, మరొకవైపు జాతి విముక్తికోసం పోరాడాలన్న ద్విముఖ వ్యూహం ఆరంభమైంది. అందులో భాగంగా గ్రామస్థాయినుండి రైతుసంఘాల నిర్మాణానికి కమ్యూనిస్టులు నడుం కట్టారు. ఈ ఉద్యమంలో అన్ని రాజకీయ అభిప్రాయాల కార్యకర్తలు పాల్గొన్నారు. కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ, కమ్యూనిస్ట్ పార్టీ ఆచార్య రంగా అనుచరులు రైతుసంఘాలను నిర్మించారు. 1934 డిసెంబరులో నాలుగవ ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభ విశాఖపట్నంలో జరిగింది. దీనికి ఆచార్యరంగా అధ్యక్షుడు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి కార్యదర్శి. 1936 లో రాష్ట్ర రైతుసంఘం అధికారికంగా రిజిష్టర్ అయింది. తిరిగి 1936లో నిడుబ్రోలులో రైతు మహాసభ జరగడం, అంతకుముందు మాదిరే ఆచార్యరంగా, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి అధ్యక్ష కార్యదర్శులుగా ఎన్నికవడం జరిగింది. 1937 లో నిడుబ్రోలులోనే జరిగిన రైతు మహాసభలో

కొమ్మారెడ్డి అధ్యక్షునిగా, చలసాని వాసుదేవరావు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఈ సభల్లో ప్రధానంగా రైతుల రుణభారాన్ని రద్దుచేసి, వారిని వడ్డీ వ్యాపారస్తుల బారినుండి తప్పించడానికి రుణ విమోచన చట్టం తీసుకురావాలని డిమాండ్ చేశారు. జమీందారీ విధానం పోవాలనీ, శిస్తురేట్లను తగ్గించడమేకాక బకాయిలను కూడా రద్దుచేయాలన్న కోర్కెలు వీటిలో ముందుకొచ్చాయి.

ఇంతలో 1937లో భారత రాజ్యాంగ చట్టం (1935) ప్రకారం దేశంలో వివిధ రాష్ట్రాల్లో ఎన్నికలు జరిగాయి. జాతీయ కాంగ్రెస్ తన ప్రణాళికలో రైతులకు సంబంధించిన కోర్కెల పత్రాన్ని ఆమోదించి అందులో చేర్చుకుంది. రైతుల రుణభారం తగ్గించడం, జమీందారీ ప్రాంతాల్లో శిస్తులు తగ్గించడం, ఇంకా అనేక ఇతర డిమాండ్లను కాంగ్రెస్ ఆమోదించడం వలన రైతు ఉద్యమానికి మరింత బలం చేకూరింది. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్‌ను రైతుసంఘాలు పూర్తిగా బలపరిచాయి. కాంగ్రెస్ తమ కోర్కెలను తీరుస్తుందన్న నమ్మకంతో ముఖ్యంగా కోస్తాజిల్లాల్లోని రైతులు ఎన్నికల్లో చురుగ్గా పాల్గొన్నారు. రైతాంగం కాంగ్రెస్‌కు అనుకూలంగా ముందుకొచ్చింది. మధ్యయుగాల భూస్వామ్య వ్యవస్థకు ప్రతినిధులైన జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీలను ఓడించారు. జాతీయ కాంగ్రెస్ అఖండ విజయం పొందింది. అయితే ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీకి ఘనవిజయాన్ని సాధించిపెట్టిన కీర్తి మధ్యతరగతి రైతాంగానిదే. దిగువ మధ్యతరగతి, పేదరైతులకు, వ్యవసాయకూలీలకు ఓటింగ్ హక్కులేదు. జమీందార్లు, సంపన్నరైతులు, జస్టిస్ పార్టీకి మద్దతిచ్చారు. ఎన్నికలలో కాంగ్రెస్ విజయం రైతాంగంలో గొప్ప ఉత్తేజాన్నిచ్చింది. మారుమూల గ్రామాల్లో కూడా కార్యకర్తలు సంఘాలు ఏర్పాటు చేశారు. ఎన్నికలు ముగియగానే కాంగ్రెస్ పార్టీ అధికారం చేపట్టాక చల్లపల్లిరాజా లాంటి జమీందార్లు కాంగ్రెస్‌తో స్నేహానికి పూనుకున్నారు. రాజగోపాలాచారి నాయకత్వంలో ఉన్న కాంగ్రెస్ మంత్రివర్గం ఎస్టేట్ల రద్దు విషయంలో నిర్దిష్ట వైఖరి అవలంభించక తటపటాయించింది. అంతవరకూ రాష్ట్ర రైతుసంఘంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న కాంగ్రెస్ నాయకులు కళావెంకట్రావు, మొసలికంటి తిరుమలరావు, ముళ్ళపూడి పళ్ళంరాజు మొదలైనవారు రాష్ట్ర రైతుసంఘం నుంచి తప్పుకున్నారు.

రాష్ట్ర రైతు సంఘానికి అధ్యక్షులుగా కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి ఎన్నికయ్యారని ఇంతకుముందు చెప్పుకున్నాం. నెల్లూరు నుండి వెంకటగిరి జమీందారీ వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహిస్తున్న వెంకట్రామనాయుడు 'జమీన్ రైతు' పత్రికను ప్రారంభించాడు. రైతు సంఘం నాయకులు, వాలంటీర్ దళాలుగా ఏర్పడి, గ్రామ గ్రామాలకు తిరిగి, వేసవి రాజకీయ పాఠశాలలు ప్రారంభించి, రైతాంగ కార్యకర్తలకు శిక్షణ ఇచ్చారు. 1937లో గన్నవరంలో రైతు మహాసభ జరిగింది. ఆచార్య రంగా అధ్యక్షత వహించగా చండ్ర రాజేశ్వరరావు వాలంటీర్ ఆర్గనైజర్‌గా పనిచేశారు. ఇందులో అనేకమంది రైతు నాయకులు పాల్గొని జమీందారీ రద్దు తీర్మానంతోపాటు ఇతర తీర్మానాలు కూడా చేశారు. ఇంతలో మద్రాస్ ప్రభుత్వం రైతుల రుణాలపై మారుటోరియం ప్రకటించింది.

పైన పేర్కొంటూ వచ్చిన రైతాంగ ఉద్యమ పెంపుదల, దాని ఉధృతి క్రమానుగతంగా గ్రామ గ్రామాలకు పాకి, రైతు రక్షణకు రైతు దండ్లు లేక వాలంటీర్ దళాలు ఏర్పడ్డాయి. ఈ పరిణామం 1937లో ప్రారంభం కానున్న చారిత్రాత్మక రైతు యాత్రకు పూర్వరంగంగా నిలిచింది. రైతు యాత్రను గురించి చెప్పుకునేముందు, రైతు ఉద్యమంలో కమ్యూనిస్టుల ప్రవేశాన్ని గురించి, తొలి దశలో వారి పాత్ర గురించి క్లుప్తంగా చెప్పుకుందాం. ఆంధ్రలో 1930 దశకపు తొలి సంవత్సరాల దాకా రైతు ఉద్యమంలో ధనిక, మధ్య తరగతి రైతుల పాత్రే ప్రముఖంగా ఉండేది. వారిదే ఉద్యమ పునాది కూడా. వారి ప్రయోజనాలే ప్రధాన డిమాండ్లు. ఆ దశలో ఉద్యమానికి సరైన కార్యాచరణ లేదు. ఉద్యమానికి రైతు పునాది పెరుగుతున్నా దానికొక సుసంఘటిత నిర్మాణం, గమ్యం లేవు. ఈ లోటుపాట్లను పూడ్చి, దానికొక చక్కని రూపం కల్పించింది కమ్యూనిస్టులు. కమ్యూనిస్టు సిద్ధాంత ప్రభావానికి గురైన అనేకమంది ఆంధ్ర యువకులు ఉప్పు సత్యాగ్రహం తర్వాత, దేశ స్వాతంత్ర్యంతో పాటు దేశంలోని పీడిత ప్రజానీకాన్ని ఆర్థిక దోపిడీ నుంచి విముక్తి చేయాలని ఆశించారు. దీనికి సరైన విధానం సోషలిస్టు పద్ధతిలోనే సాధ్యమౌతుందని నమ్మారు. దీనికనుగుణంగా వర్గ సంఘాలు నిర్మించి, ఆ యా వర్గాల ప్రజల సమస్యలు చేపట్టి వారిని రాజకీయ ఉద్యమాల్లోకి తీసుకు రావాలనుకున్నారు. అప్పటి కమ్యూనిస్టు యువ నాయకులను చేరదీసి ఒక ఆర్గనైజింగ్ కమిటీని ఏర్పరచారు. దీనికి అనుగుణంగానే 1935లో కమ్యూనిస్టులు కూలీ రక్షణ సమితులను స్థాపించారు. ఇవి రాష్ట్రమంతటా వ్యాపించాయి. కమ్యూనిస్టు భావాలు గల కరపత్రాలను, పుస్తకాలను ముద్రించి భావ వ్యాప్తి చేశారు. మద్రాసులో దీనికొక కార్యాలయాన్ని స్థాపించి పుచ్చలపల్లి సుందరయ్య కార్యదర్శిగా వ్యవహరించాడు. 1935లో కాకినాడలో ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ సమావేశంలో తీసుకున్న నిర్ణయం ప్రకారం కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో వీరు ప్రవేశించి, దానిలో కార్య నిర్వాహక పదవులకు ఎన్నికై తద్వారా ప్రజల్లోకి వెళ్ళారు. 1935 నుండి నిర్వహించిన రైతు యాత్రల్లో విరివిగా పాల్గొన్నారు. దీంతో రైతు సంఘ స్వభావంలో, విస్తృతిలో గొప్ప మార్పు వచ్చింది. గ్రామస్థాయి నుండి ఏర్పడ్డ రైతు సంఘాలను సక్రమంగా నిర్వహించడం, వాటికొక ఆఫీసు, కార్యవర్గం, కనీస కార్యక్రమం, వీటిని నిర్వహించేందుకు తమ యావత్ కాలాన్ని వెచ్చించగలిగిన 'ఫుల్‌టైమర్లు' వచ్చారు. దీని ఫలితంగా 1936లో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘానికి కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావు ప్రధాన, సహాయ కార్యదర్శులుగా వరుసగా ఎన్నుకోబడ్డారు. ప్రతి జిల్లాలో కమ్యూనిస్టు యువకులు రైతాంగ బాధ్యతలు స్వీకరించి రైతు సంఘాలు నిర్మించారు. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం అనే ఒక ఏకీకృత సంస్థ మొదలై ఎర్రజెండా నాయకత్వంలో ముందుకు సాగనారంభించింది. అయితే ఇది పూర్తిగా కమ్యూనిస్టులకే అంకితమైపోలేదు. వారు ప్రధాన పాత్రల్లో ఉండి ఉద్యమానికి వెన్నెముకగా నిలిచారు.

# రైతు రక్షణ యాత్ర

1930 దశకం ఆరంభం నుండి ఆంధ్ర రైతు ఉద్యమంలో రైతు దండుల దుగ్గిరాల గోపాలకృష్ణయ్య రామదండు తరహాలో ఏర్పడ్డాయి. వీటినే వలంటీర్ దళాలుగా కూడా చెప్పుకోవచ్చు. రైతు ఉద్యమాన్ని మారుమూల ప్రజల్లోకి తీసుకెళ్ళడానికి ఇదొక ముఖ్య సాధనంగా పనికొచ్చింది. ఈ ప్రయోగం నుండే రైతుయాత్ర అనే ప్రక్రియ కూడా ముందుకొచ్చింది. రైతుల చేతిలో ఈ యాత్రలు మంచి పదునైన పనిముట్లుగా తయారయ్యాయి. అదేకాలంలో గాంధీజీ నిర్వహించిన దండి ఉప్పు సత్యాగ్రహం (దండి మార్చ్) జాతీయ స్థాయిలో రైతులకు కొత్త ఆయుధాన్ని అందించింది. రైతుయాత్రకు దండియాత్ర స్ఫూర్తిగా నిలిచింది. ఆచార్య రంగా అభిప్రాయంలో, ప్రారంభంలో తన అనుచరులైన భారతీదేవిరంగా, ఆచంట నాగయ్య, ఎన్.వి. సుబ్బయ్యలచే 1931లో గుంటూరులో రైతు యాత్రలు ఆరంభమయ్యాయి. జిల్లా స్థాయిలో నిర్వహించిన ఈ యాత్రలు కలెక్టర్ ఆఫీసుకు తరలి వెళ్ళి మారుటోరియం లాంటి రైతుల విజ్ఞాపనలతో మహజర్లను అందజేశాయి. రంగా అభిప్రాయంలో ఈ యాత్రలు మద్రాసు రాష్ట్రంలో అనేక జిల్లాల్లో వార్షిక యాత్రలుగా ప్రసిద్ధికెక్కాయి. ప్రముఖ జాతీయ నాయకులు న్యాపతి సుబ్బారావు పంతులు (అఖిల భారత కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి), మోచర్ల రామచంద్రరావు పంతులు, దండు నారాయణరాజు, మాగంటి బాపినీడు, జారుగంటి వెంకట సుబ్బయ్య, పుల్లెల శ్యాంసుందరరావు, కల్లూరి సుబ్బారావు ప్రభృతులు ఈ యాత్రల్లో పాల్గొన్న కొందరు ముఖ్యులు. రైతుయాత్ర ఆయుధాన్ని బీహార్‌లో స్వామి సహజానంద సరస్వతి రైతాంగ పోరాటంలో శక్తిమంతమైన ఆయుధంగా మలిచాడు. స్వామి సహజానంద జమీందారీ విధానానికి వ్యతిరేకంగా ఒక లక్షమంది రైతులను సమీకరించి యాత్ర నిర్వహించడం జాతీయ స్థాయిలో అందర్నీ ఆకర్షించింది. అఖిలాంధ్ర రైతు రక్షణ యాత్రకు ఇదే పద్ధతిలో సన్నాహాలు ప్రారంభమయ్యాయి.

ఆంధ్రదేశంలో పెల్లుబికిన రైతాంగ చైతన్యాన్ని ఒక నిర్దిష్ట మార్గంలో పెట్టేందుకు, కోస్తా ప్రాంతంలో ఉన్న రైతుల్ని ఉద్యమంలోకి సమీకరించేందుకు ఆంధ్ర రైతు రక్షణ యాత్ర తోడ్పడింది. దీని వెనుక ఉన్న ముఖ్య డిమాండ్ జమీందారీ వ్యవస్థను రద్దు చేయడం. దాంతోపాటు రాష్ట్రంలోని రైతాంగ సమస్యలని పరిశీలించి వాటిపై ప్రభుత్వ దృష్టిని, ప్రజల దృష్టిని కేంద్రీకరింపజేసి ప్రభుత్వానికొక నివేదికను సమర్పించడం. 1937 ఎన్నికలలో కాంగ్రెస్ అఖండ విజయం సాధించడంతో ఈ ఆలోచనకు మరింత బలం చేకూరింది. అప్పట్లో ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘానికి అధ్యక్షుడైన కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి నాయకుడుగానూ, కార్యదర్శి చలసాని వాసుదేవరావు ఉపనాయకుడుగానూ వ్యవహరించారు. కొమ్మారెడ్డి కాంగ్రెస్‌వాది. రైతు నాయకుడు. వాసుదేవరావు 1936 కల్లా కమ్యూనిస్టు పార్టీలో ఒక ముఖ్య సభ్యుడు.

రైతుయాత్ర 1937 జూలై 3వ తేదీన ఉత్తరాంధ్రలోని ప్రస్తుత శ్రీకాకుళం జిల్లాలో ఉన్న ఇచ్ఛాపురం నుండి ప్రారంభమైంది. ఆచార్య రంగా ఈ యాత్రకు ప్రారంభోత్సవం చేశాడు. పుల్లెల శ్యాంసుందరరావు సభకు అధ్యక్షత వహించి తన ఆశీస్సులందించాడు. యువ కాంగ్రెస్ నాయకుడు గౌతు లచ్చన్న తదితరులు వెంటరాగా యాత్ర ప్రారంభమైంది. ప్రారంభోత్సవ సభకు 200 మంది రైతులు హాజరయ్యారని అప్పటి పత్రికలు రాశాయి. రైతు జెండాను గేదెల చంద్రయ్య నాయుడు ఆవిష్కరించారు. ఆచార్య రంగా తన ఉపన్యాసంలో రైతు రక్షణ యాత్రలు ఆంధ్రదేశానికి కొత్తవి కాకున్నా, ప్రస్తుత యాత్ర భారతదేశ రైతు ఉద్యమ చరిత్రలో ముఖ్యస్థానం వహిస్తుందన్నాడు. రైతు సమస్యలకు దూరంగా వుంటున్న కాంగ్రెస్ నాయకులను యాత్రలో పాల్గొనమని హెచ్చరిస్తూ, రైతు రక్షణ నిధికి విరివిగా విరాళాలు ఇవ్వాల్సిందిగా విజ్ఞప్తి చేశాడు. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చుండి జగన్నాథం, లచ్చన్న, పుల్లెల శ్యాం సుందరరావు రైతులందరినీ యాత్రలో పాల్గొనమనీ, యాత్ర విజయానికి తోడ్పడమనీ కోరారు. రైతు గీతాలు ఆలపిస్తూ, బలరామపురం రాజపురం ఇంకా అనేక గ్రామాలు దాటి సాయంత్రానికి రైతు యాత్ర 'కవిటి' గ్రామానికి చేరుకుంది. కవిటి గ్రామ ప్రజలు రైతుయాత్ర దళానికి స్వాగతమిచ్చి, భజనలు చేసి రాత్రికి బహిరంగ సభ జరిపారు. ఉపన్యాసకులు రష్యా దేశంలో రైతులు ఎట్లా సుఖపడుతున్నదీ, దానికి కారణం ప్రజలు తమ రాజ్యాన్ని స్థాపించుటయే నని చెప్పారు. అట్టి రాజ్య స్థాపనకు రైతుల ఐక్యత, సంఘశక్తి అవసరమని పేర్కొన్నారు. స్థానిక సమస్యలైన నీటి తీరువా పన్ను, కొబ్బరి తోటల పెంపకంలో కష్ట సుఖాలు, సిలోను - జావాల నుండి కొబ్బరినూనె దిగుమతి చేసుకోవడంవల్ల ఏ విధంగా స్థానికంగా ధరలు తగ్గిపోయినదీ మొదలగు విషయాల గూర్చి తీర్మానాలు చేశారు. మొత్తం మీద ఈ దశలో యాత్ర ఎంతో ఉత్సాహంతో, ఉత్తేజంతో కొనసాగింది.

యాత్ర పర్యాటక కమిటీవారు విడుదల చేసిన పత్రికా ప్రకటనలో రుణ పరిష్కార చట్టం, ఎస్టేట్ ల్యాండ్ యాక్టు, ఫారెస్ట్ యాక్టు, భూమి శిస్తు విధానం చట్టానికి సవరణలు సూచిస్తూ, రైతులు సభలకు వేలాదిగా హాజరై తమ కష్ట నిష్ఠూరాలు నివేదించుకుంటూ రైతు రక్షణ యాత్రను విజయవంతం చేయాలని విజ్ఞప్తి చేశారు. రైతు రక్షణ నిధి / పై సాఫండ్‌కు విరివిగా విరాళాలివ్వాలని అర్థించారు. శ్రీకాకుళం జిల్లా యాత్ర జరుగుతున్నప్పుడు స్వాతంత్ర సమర యోధులు, పార్వతీపురం వాస్తవ్యులు గొర్లి సూర్యనారాయణ, పార్వతీపురం నుంచి వెళ్ళి టెక్కలిలో యాత్రలో పాల్గొన్నారు. వారితోపాటు హరికృష్ణ చౌదరి, దుక్క సూర్యనారాయణ రెడ్డి (నేపాడ), సిల్లా రాజులు రెడ్డి (పాటల రచయిత), నిబాను నరసింహమూర్తి ఇంకా అనేకులు రైతు భజనలు చేస్తూ పాల్గొన్నారు. దారి పొడవునా ప్రతి గ్రామంలోనూ ఆగుతూ, సభలు ఏర్పాటు చేస్తూ రైతు సమస్యల గూర్చి గౌతు లచ్చన్న, చుండి జగన్నాథం, కొమ్మారెడ్డి, చలసాని ప్రభృతులు ఉపన్యాసాలు చేశారు. గ్రామాల్లోని రైతులు యాత్ర పట్ల ఉత్సాహంతో స్పందించారనీ,

యాత్రలో కలసి నడిచారనీ, యాత్ర ఒక మహా ప్రవాహంలా సాగిపోయిందనీ గొర్లి సూర్యనారాయణగారు తెలిపారు.

ఇక దక్షిణ విశాఖ జిల్లాలోకి రైతు రక్షణ యాత్ర ప్రవేశించింది. తొలుతగా జిల్లా రైతు సంఘం బొబ్బిలి తాలూకా తెర్లాం గ్రామం నుండి ఒక రైతు దండును ఏర్పరచి ఆంధ్ర రాష్ట్ర రైతు దండుతో కలిపారు. రాష్ట్ర రైతు యాత్ర 1937 జూలై 18వ తేదీ ఉదయం పది గంటలకు విశాఖపట్నంచేరి, అక్కడ సాయంత్రం బహిరంగ సభ జరిపారు. 19వ తేదీన గాజువాక, 20న అనకాపల్లి, 21న తాళ్ళపాలెం అదేరోజు రాత్రి నరసింగుపల్లిలో విశ్రాంతి తీసుకున్నారు. 22, 23 తేదీల్లో రేగుపాలెం, ఉద్దండపురం, నరసింహపల్లిలో సభలు జరిపారు. దీనితో దక్షిణ విశాఖ జిల్లా పర్యటన పూర్తయింది.

విశాఖపట్నం జిల్లా సరిహద్దులు దాటిన రక్షణయాత్ర జూలై 23న తూర్పుగోదావరి జిల్లాలోని తుని పట్టణంలో ప్రవేశించింది. యాత్రదళం ఒక జిల్లా నుంచి మరొక జిల్లాకు చేరుకోకముందే ఆ జిల్లా రైతు నాయకులు ముందుగానే సర్క్యులర్లు జారీచేసి జిల్లాలోని నలుమూలల్లో ఉన్న రైతు కార్యకర్తలను సమాయత్తం చేసి, స్థానిక సమస్యలపై అర్జీలు సేకరించి నాయకులకిమ్మని ఆదేశించేవారు. తూర్పు గోదావరి జిల్లా రైతు సంఘం కార్యదర్శి వెన్మత్స సూర్యనారాయణ జారీచేసిన తన ప్రకటనలో ఈ క్రింది విధంగా తెలిపారు. "రైతు యాత్రికులు సుమారు 1500 మైళ్ళు కాలి నడక ప్రయాణం చేయవలసి ఉన్నది. కనుక ప్రతి స్థలంలోకి రావడం అసాధ్యం. ముఖ్యంగా మార్గంలో తగిలే గ్రామాలకే రాగలిగెదరు. ఆ గ్రామాలకు వచ్చినప్పుడు ఆ ప్రాంతాల రైతులు, వ్యవసాయ కూలీలు స్వయంగా వారిని కలుసుకొనియో, మహజర్ల మూలముగనో తమ అవసరాలను, కష్టములను తెలుపుకోవాలి. ఈ లోపున జిల్లాలో ప్రతి గ్రామమందునూ, విరివిగా రైతు సభ్యుల చేర్చియూ, రైతు సంఘముల స్థాపించియూ తద్వారా రక్షణయాత్రవారు మదరాసులో ప్రభుత్వంతో ఆందోళన చేసే సమయంలో ఇచ్చట గ్రామాల్లో కూడా రైతులు, వ్యవసాయ కూలీలు సభలు జరిపి తీవ్రమైన ఆందోళన జరిపితేనే కానీ లాభముండదు."

రైతు రక్షణ యాత్ర తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించిన కార్యక్రమం ఈ విధంగా జరిగింది. జూలై 20వ తేదీన వచ్చి తుని మీదుగా అన్నవరం, గొల్లప్రోలు, పిఠాపురం, కిర్లంపూడి, సామర్లకోట, మేడపాడు, బిక్కవోలు, రాయవరం, నరసారావుపేట, వేళంగి, ద్రాక్షారామం, గంగవరం, ముక్తేశ్వరం, అమలాపురం, బోడసకుర్రు, నగరం, మానేపల్లి, రాజోలు, అంతర్వేదిపాలెం గ్రామాలను పర్యటిస్తారని ఆర్గనైజింగ్ సెక్రటరీ ప్రకటించారు.

తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ నాయకుడు, రైతు ఉద్యమ ప్రముఃఖుడు, ఆనాడు రైతు రక్షణ యాత్రకు స్వాగతం చెప్పిన వారిలో ఒకరు శ్రీ ఇనుగంటి నారాయణరావు. ఆయన తన జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ, ఆనాటి రైతు యాత్రకు విశేష ప్రజాదరణ

లభించిందనీ, అది రైతాంగ ఉద్యమానికి ఎంతగానో తోడ్పడిందనీ పేర్కొన్నాడు. యాత్రా దళానికి పాయకరావుపేట వద్ద స్వాగతం చెప్పారు. దళ ఉపనాయకులు శ్రీ చలసాని వాసుదేవరావు నాయకత్వంలో తేటగుంటలో సభ జరిగింది. ఈ వార్త దగ్గరలోని గ్రామాలకు ప్రత్తిపాడు, జగ్గంపేట వ్యాపించి అక్కడి రైతులు సమావేశమై రైతు సమస్యలపై తీర్మానాలు చేసి నాయకులకు అందజేశారు. ఈ సభలకు చింతం సత్యనారాయణ దాసు, పెన్మత్స అనంతం, పెన్మత్స సత్యనారాయణరాజు మొదలగువారు నాయకత్వం వహించారు. ఈ క్రమంలోనే పిఠాపురం తాలూకాలో చెరువు లోతట్టు భూమి వెయ్యి ఎకరాలు పేద రైతులకు పంపిణీ చేసే భూపోరాటం జరిగింది. (దీన్ని కాంగ్రెస్ వ్యతిరేకించింది.)

రైతుయాత్ర ఫలితంగా జిల్లాలో గణనీయమైన రాజకీయ చైతన్యం వచ్చింది. తాలూకా స్థాయిలో రైతు మహాసభలు జరిగాయి. జిల్లా మహాసభ 'ర్యాలి' గ్రామంలో జరిగింది. ఆ రోజుల్లో పదివేలమంది బహిరంగ సభకు హాజరయ్యారంటే రైతుయాత్ర ఎంతటి సంచలనం కలిగించిందో మనం ఊహించుకోవచ్చు. మహాసభ నిర్వహణకు ప్రతి రైతు కుటుంబం ఎంతో కొంత విరాళం ఇవ్వడమే కాకుండా ఆడ, మగ భేదం లేకుండా అసంఖ్యాకంగా ప్రజలు ఈ మహాసభలో పాల్గొన్నారు.

తూర్పు గోదావరి జిల్లాలో రైతుయాత్ర విజయానికి తోడ్పడిన వారిలో ఒకరైన శ్రీ మహీధర రామమోహనరావు తన జ్ఞాపకాల్లో కొన్ని విలువైన విషయాలు వెల్లడించారు. కమ్యూనిస్టు ఉద్యమంలోకి అప్పుడప్పుడే ప్రవేశిస్తున్న శ్రీ మహీధర యాత్ర గూర్చి ప్రచారం చేయడానికే తిళ్ళకుప్ప, కేశనకురుపాలెం, పోలవరం గ్రామాల్లో సభలను, తమ సహకార్యకర్త కేశనకురుపాలెం నివాసి గాదిరాజు రామరాజుతో కలసి నిర్వహించారు. యాత్రాదళం పగలంతా పర్యటించడం, సాయంత్రమయ్యే సరికి చిన్న గ్రామాల కూడలిలో సభ జరపడం, ఆ రాత్రికి గ్రామస్థులు పెట్టిన అన్నం తినడం, దగ్గరలో ఉన్న సత్రాల్లో విడిది చేయడం రివాజుగా జరిగే కార్యక్రమం. తూర్పుగోదావరి జిల్లా నుండి పశ్చిమగోధావరి జిల్లాలో దళం ప్రవేశించింది. పశ్చిమగోదావరి జిల్లాకు సంబంధించిన విశేషాలు అప్పట్లో ప్రచురించిన ఒకటి రెండు కరపత్రాల ద్వారా తెలుస్తున్నాయి. అంతేకాక అప్పటి రైతు సంఘ కార్యకర్తల వ్యాసాల ద్వారా కూడా మరికొంత అదనపు సమాచారాన్ని గ్రహిస్తాం. కొవ్వూరు, తణుకు తాలూకాల్లో ఐదు రోజుల ప్రచారంలో 70 మైళ్ళ దూరాన్ని రైతుయాత్ర పూర్తి చేసింది. ఈ రెండు తాలూకాల్లో తాలూకా మహాసభలు జరిగాయి. రైతుల ఉత్సాహం ఉరకలు వేసింది. కొవ్వూరు తాలూకా తాళ్ళపూడి, అన్నదేవరపేట గ్రామాల్లో సభలు జరిగాయి. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, చలసాని వాసుదేవరావులు రైతు సంఘాల ఆవశ్యకతను గూర్చి వివరించారు. ఆ తరువాత యాత్ర గోపాలపురం, గొల్లగూడెం గ్రామాల గుండా ధర్మవరం చేరింది. అదే క్రమంలో చాగల్లు, బ్రాహ్మణగూడెం గ్రామాలను తాకి నిడదవోలు చేరింది. నిడదవోలులో పెన్మత్స సుబ్బరాజుగారి

అధ్యక్షతన సభ జరిగింది. రైతు సంఘాలు, కాంగ్రెస్ మధ్యనున్న సంబంధాల గూర్చి, యాత్ర లక్ష్యాలను గూర్చి సభలో వివరించారు. మహీధర జగన్మోహనరావు నిడదవోలు సభలో పాల్గొన్నారు. రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ఈ సభల్లో తీర్మానించారు. కొవ్వూరు తాలూకా రైతుల సమస్యలను ఈ సభలు చర్చించాయి. చాలా వరకు ఈ తాలూకాలు మెట్ట ప్రాంతాలే. వీటినే 'రెడ్డి సీమ' అంటారు. పశువుల మేతకు తప్ప, పంటలకు పనికిరాని భూములు. ఎక్కువ భూమి వర్షాధారంపైనే ఆధారపడడం వల్ల పంటలు పండుతాయనే నమ్మకం లేదు. జమీందారీ గ్రామాలను యాత్ర దళం దర్శించినప్పుడు అక్కడ హెచ్చు పన్నులు విధించడం, రైతులు తాము చెల్లించాల్సిన పన్నులు చెల్లించక బకాయిలు పడడం, రుణభారం ఎక్కువగా ఉండడం దళం గమనించింది. తణుకు తాలూకా సంచారంలో ఉండ్రాజవరం గ్రామంలో సభ జరిగింది. రైతు రక్షణ నిధికి విరాళాలు వసూలు చేశారు. తర్వాత సత్యవాడ గ్రామంలో సభ జరిగింది. సభలో వెయ్యిమంది జనం. దళ నాయకులు రైతు సంఘాల ఆవశ్యకతను గూర్చి, వ్యవసాయ కూలీల సమస్యల పరిష్కారాన్ని గూర్చి ఉపన్యసించారు. పోలంగి గ్రామం చేరుకునేవరకు మార్గమధ్యంలో అనేక వందలమంది ప్రజలు మేళతాళాలతో దళాన్ని ఆహ్వానించారు. కొమ్మారెడ్డి, కార్మిక కర్షక పతాకమైన ఎఱ్ఱజెండాను ప్రతిష్ఠించారు. ఈ సభల్లో స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొనడం ఒక విశేషం. యాత్రాదళం తణుకులో పర్యటిస్తున్నపుడు తాలూకా రైతు మహాసభ జరిగింది. పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు అల్లూరి సత్యనారాయణ రాజు అధ్యక్షత వహించాడు. కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ నాయకుడు మద్దూరి అన్నపూర్ణయ్య ఉపన్యసించారు. ఈ సభలోనే తాలూకా రైతు సంఘం నిర్మాణం జరిగింది. ఆ తరువాత దళం వెలిందపఱ్ఱు, మల్లిపూడి, మీదుగా నత్తా రామేశ్వరం చేరింది. గ్రామ యువజన సంఘం ఆధ్వర్యంలో ప్రజలు స్వాగతం చెప్పారు. పెనుగొండలో జరిగిన బహిరంగ సభలో పాల్గొని, ఆచంట గ్రామంలో ఏర్పాటైన ఫిర్కా రైతుల మహాసభకు రైతు నాయకులు హాజరయ్యారు. ఆచంట గ్రామ ప్రజల కార్యదీక్షను, వారి ఆదర్శాలను యాత్రాదళం ప్రసంశించింది.

కొవ్వూరు, తణుకు తాలూకాలలో జరిగిన యాత్రను గూర్చి ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ బాధ్యుడైన మద్దుకూరి చంద్రశేఖరరావు ఈ విధంగా వ్యాఖ్యానించాడు. "రెండు తాలూకాల సంచారం రెండు రోజులలో పూర్తి అయినది. రైతుల ఉత్సాహం అపరిమితం. సభలు చాలా జయప్రదంగానూ, ఉత్సాహవంతంగానూ జరుపబడినవి. యాత్ర దిగ్విజయమైనది. ఈ తాలూకాలలో ముఖ్యంగా గమనించదగినది యువకుల ఉత్సాహం. ప్రతి గ్రామంలోను యువకులు అన్ని విధముల ఉద్యమానికి తోడ్పడుచున్నారు. ఈ తాలూకా దాదాపు డెల్టాయే. ఇచ్చట అప్పుల భారమెక్కువగా నున్నది. ఒక ఆచంట గ్రామంలోనే 60 లక్షల రూపాయల వరకు అప్పులున్నవి. ఆ గ్రామం ఆయకట్టు 5000 ఎకరాలు. ఇట్టి గ్రామాలు చాలా కలవు.

చాలామంది రైతులకు తమ కుటుంబాలను పోషించుకోగట్టిన ఆదాయము లేదు. అందుకే ఈ తాలూకాలో ముఖ్యమైన బాధలు అప్పులు, పన్నులు. రహదారులు, విద్యా సౌకర్యములు, వైద్య సౌకర్యములు చాలా తక్కువ. ఉన్న రోడ్లు కూడా బాగుగా లేవు."

"దళము 16 గ్రామాల్లో సభలు చేశారు. సంచారము 38 మైళ్ళ వరకూ ఉంది. అన్ని చోట్ల గుంపులు గుంపులుగా సభలకు హాజరగుచున్నారు."

తణుకు తాలూకాలోని యాత్రాదళం ప్రవేశించినప్పుడు వేలువెన్ను గ్రామ రైతు నాయకుడు సత్తిరాజు అచ్యుతరామయ్య యాత్ర దళాన్ని ఆహ్వానించాడు. ఈ తాలూకాలో యాత్రా దళానికి తోడ్పడిన వారిలో శ్రీ పెరంబదూరు ఆనందరావు, యాళ్ళబండి రంగనాయకులు, కలిదిండి సూర్యనారాయణరాజు, ఇవటూరి శరభరాజు, మల్లపరాజు భాస్కరరాజు మొదలగువారున్నారు. వీరు యాత్ర ప్రాముఖ్యాన్ని తెలుపుతూ గ్రామాల్లో పర్యటించారు. మల్లెపూడి గ్రామానికి చెందిన ఎస్. ఆనందరావు అప్పటి తన యాత్రాదళ స్మృతులను ఈ విధంగా రాసుకున్నాడు. "మాది మల్లెపూడి గ్రామం. యీ యాత్ర దళంకు ఆ గ్రామంలో సభ ఏర్పాటు చేశాం. మా గ్రామంకు యాత్రాదళ కార్యక్రమం యివ్వమని కోరుతూ రాష్ట్ర రైతు సంఘం వారికి జాబు వ్రాశాను. అందుమీదట రాష్ట్ర రైతు సంఘం నుండి శ్రీ నండూరి ప్రసాదరావుగారు కార్యక్రమం యిచ్చారని వ్రాశారు. అది గుర్తు ఉన్నది. మల్లెపూడి గ్రామంలోనివారు జాతీయాభిమానం కలవారు. 1930లో తణుకులో సత్యాగ్రహ శిబిరం పోలీసులు 144 సెక్షన్ క్రింద మూసివేసినప్పుడు మా గ్రామంలో ఏర్పాటు చేశాం. దానిని కూడా ప్రభుత్వం నిషేధించింది."

"మా గ్రామంలో కాంగ్రెస్, రైతు, యువజన సంఘాలు ఉండేవి. యాత్రా దళానికి గ్రామంలోని పెద్దలు దండు వెంకటరాజు, దండు సుబ్బరాజు, దండు జగన్నాధరాజు, రామరాజుగార్లు ఇంకా కొంతమంది అదే విధంగా యువకులలో గుడిమెట్ల చినసత్యం (మేడపాటి సత్తిరెడ్డిగారి మనువడు), గుడిమెట్ల బాపిరెడ్డి, దండు ఎర్రగోపాలరాజు, మేడపాటి సత్యం ఇంకా చాలామంది తోడ్పాటు యిచ్చారు."

"దళం వారిని సన్మానించి గ్రామ యువజన, కాంగ్రెస్, రైతు సంఘాల తరపున ఒక విజ్ఞాపన పత్రం ఇచ్చాము. అందులో ముఖ్యంగా కాలువకు లాకు కట్టించమనీ, రెండవది గోస్తనీనది మెరక అగుటవల్ల వర్షాకాలం ముంపుకు గురి అగుట చేత దానిని త్రవ్వించమనీ (ఈ నదిలో మేల్పూరి వరకూ పడవలు నడుస్తాయి. అక్కడ కాల్వ భీమవరం వరకూ త్రవ్వారు.) ఇంకా ఏవో సమస్యలు చేర్చాము. అవి గుర్తు రావడం లేదు. రైతు యాత్రాదళంతోపాటు నేను కూడా నర్సాపురం తాలూకా, అక్కడి నుండి భీమవరం వరకూ వెళ్ళాను. మల్లెపూడి నుండి బ్రాహ్మణ చెరువు మీదుగా మార్టేరు, అచ్చటి నుండి ఆచంట వెళ్ళి చేరింది దళం. ఆ రోజు అక్కడ సమావేశం ఏర్పాటు చేశారు. అల్లూరు సత్యనారాయణ, భూపతిరాజు లక్ష్మి

నరసింహరాజు, కోసూరి సుబ్బరాజు, ఉద్దరాజు రామం, సూరపరాజు, పేరెప మృత్యుంజయుడు ఇంకా చాలామంది వచ్చారు. అచట నుండి బయలుదేరిన దళం సాయంత్రం పాలకొల్లు చేరాం. అచ్చటకు శ్రీ ఎన్.జి. రంగాగారు, వారి సతీమణి భారతీదేవిగారు వచ్చారు. అక్కడ సభ జరిగింది. అధ్యక్షత వహించింది ఎవరో గుర్తులేదు". ఆ మర్నాడు దళం లంకలకోడేరులో సభ చేసింది. ఏ తాలూకాకు ఆ తాలూకాలో రైతు కార్యకర్తలు దళ ప్రచారంలో నిమగ్నులయ్యారు. భీమవరం తాలూకాలో తణికెళ్ళ వెంకట చలపతి, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, గొట్టుముక్కల వెంకటరామరాజు తదితర కార్యకర్తలు దళ విజయానికి కృషి చేశారు.

రైతు రక్షణ యాత్ర జరుగుతున్న సందర్భంలో రాష్ట్ర కాంగ్రెస్ వైఖరి అంత సహాయకారిగా ఉండేదికాదని అప్పట్లో యాత్రలో పాల్గొన్న వంకినేని సత్యనారాయణ ఇంకా మరికొందరు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. దీనికి కారణం ఆ యాత్రలోనేకాక, అప్పటి రైతు ఉద్యమంలో కమ్యూనిస్టుల ప్రాబల్యం పెరుగుతూ ఉండడమే కావచ్చు. చలసాని వాసుదేవరావుతో పాటు మద్దుకూరి చంద్రశేఖరరావు, నండూరి ప్రసాదరావు, పుచ్చలపల్లి సుందరయ్య మొదలగువారు అప్పటికే కమ్యూనిస్టు ఉద్యమ తొలి నాయకులు. అంతేకాక రైతు రక్షణ యాత్ర జమీందారీ రద్దు నినాదాన్ని, దాంతో పాటు ఇనాందారీ మొదలగు భూస్వామ్య విధానాలను రద్దు చేయాలని నిర్ద్వంద్వంగా డిమాండ్ చేసింది. ఇదిలా ఉండగా ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ 1937 ఎన్నికల తరువాత జమీందార్లతో, భూస్వాములతో లాలూచి పడ్డట్టుగా వ్యవహరించింది. కళా వెంకట్రావు, పట్టాభి సీతారామయ్యలాంటి కాంగ్రెస్ నాయకులు ఈ వైఖరిని ప్రత్యక్షంగానే ప్రదర్శించారు. దళ నాయకుడైన కొమ్మారెడ్డి వస్తుతా జాతీయవాది. కాంగ్రెస్ ఉద్యమంలో చురుగ్గా పాల్గొన్నవాడు. గాంధేయవాది. ఖద్దరు ధారి. కాంగ్రెస్ తరపున జైలుశిక్ష కూడా అనుభవించాడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌లో ముఖ్య స్థానాన్ని కూడా అలంకరించాడు. అయినా 1935 తరువాత ఆయన రాజకీయ వైఖరిలో మార్పు పొడసూపింది. ఒకవైపు క్రమశిక్షణతో కూడిన గాంధేయవాదిగా ఉంటూనే, అతివాద కాంగ్రెస్‌వాదిగా వామపక్ష భావాలను అభిమానించేవాడు. భారతదేశంలో కార్మిక/కర్షక ప్రభుత్వం ఏర్పడాలనుకున్నాడు. ఇదేకాలంలో సోషలిస్టు సాహిత్యాన్ని ఆయన నిశితంగా అధ్యయనం చేసేవాడని కూడా తెలుస్తుంది. వంకినేని సత్యనారాయణ మాటల్లో "ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఉంది. అందుచేత కమ్యూనిస్టు సాహిత్యం రహస్యంగా పంచడం జరుగుతూండేది. కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులలో ఒకరైన కామ్రేడ్ అజయ్ ఘోష్ బొంబాయి, కాన్పూరు, ఢిల్లీల నుండి ఏలూరుకు రహస్య కమ్యూనిస్టు సాహిత్యం పంపేవారు. వర్తకులకు రహస్య పాకేజీలలో సరుకులు వచ్చేవి. అయితే అందులో సరుకు రహస్య సాహిత్యమే. ఈ సాహిత్యాన్ని విడిపించి జాగ్రత్తగా పంపకం చేసేవారు. శ్రీ కొమ్మారెడ్డిగారు రెగ్యులర్‌గా ఈ సాహిత్యాన్ని తీసుకుని అధ్యయనం చేసేవారు."

పశ్చిమగోదావరి జిల్లా సంచారం అనంతరం రైతు రక్షణ యాత్ర కృష్ణా జిల్లాలో ప్రవేశించింది. కృష్ణాజిల్లా రైతు రక్షణయాత్ర సందర్భంగా జిల్లా రైతు సంఘం ఒక ప్రకటన విడుదల చేసింది. "రైతుయాత్రవారు రైతు క్షేమమునకు వినియోగించుటకు 'పైసా ఫండ్' అను పేరనొక నిధి నేర్పరచి ధనమును ప్రోగుచేయుచున్నారు. అందుకు రైతులంతా శక్తి కొలదీ విరాళములివ్వాలి. ఇచ్చిన ప్రతి పైసా తమ బాగుకు ఉపయోగపడుతుందని రైతులు తెలుసుకోవాలి. కృష్ణాజిల్లాలో ఈ యాత్ర జరుగునప్పుడు రైతు సభలు జరిపి, రైతుల కోర్కెలను ప్రకటించవలెను."

"రైతు దండు మన జిల్లాకు వచ్చు సరికి ఊడ్పులును, మెట్ట పైరులు వేయుటయూ గూడ పూర్తి అగును. కాన రైతులెల్లరు తండోపతండములుగా రైతు దండులో చేరి జిల్లాలో నొక్కుమ్మడి రైతునాద మొనర్చెదరు గాక." జిల్లా రైతు సంఘం ప్రధాన కార్యదర్శి సుంకర సత్యనారాయణ పై విజ్ఞప్తి చేశారు.

రైతు రక్షణ యాత్రలో పాల్గొన్న రైతు సంఘం సహాయ కార్యదర్శి శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావు స్మృతులలో "రైతు రక్షణయాత్రలో దళానికి స్వాగతం ఇచ్చాం.... 14, 15 రోజులు జిల్లాలో రైతు రక్షణ యాత్ర దళం తిరిగింది. గన్నవరం, నూజివీడు, తిరువూరు, విజయవాడ, జగ్గయ్యపేట, నందిగామ, కైకలూరు, బందరు, దివితాలూకాలు."

"దివి తాలూకా వచ్చిన యాత్రా దళం 15 రోజులు విశ్రాంతి తీసుకుంది. కొమ్మారెడ్డి కొద్ది రోజులు తమ వూరు వెళ్ళి అక్కడ విశ్రాంతి తీసుకున్నారు. జమీందార్లకు వ్యతిరేకంగా వారి దురాగతాల గురించి గ్రామగ్రామాన రైతాంగం పిటీషనులు ఇచ్చారు. బహిరంగ సభలు పెట్టుకుంటూ యాత్రదళం తిరిగి రావడానికి ముందే జిల్లాలో వారి ప్రోగ్రాం నిర్ణయించాం. కరపత్రాల ద్వారా ప్రచారం చేశాం. అనుమర్లపూడి సీతారామారావు ఇంకా అనేకులు పాల్గొన్నారు. దళం ఎక్కువ భాగం కాలి నడకనే తిరిగింది."

కృష్ణా జిల్లాలో రైతు యాత్రాదళం తిరువూరు పట్టణానికి చేరుకున్నప్పుడు అక్కడి టూరింగ్ సినిమా హాలులో బహిరంగ సభ జరిగింది. తిరువూరు తాలూకాలోని అన్ని గ్రామాల నుండి వందలాది మంది రైతులు, కూలీలు సభకు హాజరయ్యారు. సభ ప్రారంభం కాకముందు పట్టణంలో ఒక పెద్ద ఊరేగింపు జరిగింది. ఆ ఊరేగింపుకు కావల్సిన బ్యానర్లను, నినాదాలు అతికించిన అట్టలను తానే తయారుచేసినట్లు అప్పటి రైతు యాత్రికుడు సుంకర వీరభద్రరావు తన జ్ఞాపకాల్లో రాసుకున్నాడు.

తిరువూరుకు దగ్గరలో ఉన్న టేకులపల్లి గ్రామంలో ప్రజాకంటకుడైన ఒక భూస్వామి (రాజేశ్వరరావు) ఉండేవాడు. ఇతడి అమానుష చర్యలను ప్రజలు సహించలేక సహనం కోల్పోయి అతడిని హత్య చేశారు. దీని పర్యవసానంగా అనేక మందికి శిక్షలు విధించడం, వీరిలో కొందరు జైళ్ళలోనే మగ్గి చనిపోవడం జరిగింది. శిక్ష పూర్తి చేసుకుని తిరిగి వచ్చిన వ్యక్తులు, ఇంకా

అనేకమంది రైతులు, కూలీలు వినతి పత్రాలు తయారుచేసుకుని బహిరంగ సభకు వచ్చి కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తికి సమర్పించుకున్నారు. యాత్రాదళంతో సుంకర వీరభద్రరావు కూడా పర్యటించాడు. కృష్ణాజిల్లాలోనే కాక వీరభద్రరావు యాత్రా దళంతోపాటు గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో కూడా పర్యటించానని వ్రాసుకున్నాడు.

జయప్రదంగా తమ పర్యటన కృష్ణాజిల్లాలో ముగించుకుని రైతు యాత్రాదళం గుంటూరు జిల్లాలో ప్రవేశించింది.

గుంటూరు జిల్లాకు సంబంధించి రైతు రక్షణ యాత్ర సంచారం గావించిన సమాచారం మనకు కేవలం సత్తెనపల్లి గురించి మాత్రమే తెలుస్తున్నది. వావిలాల గోపాల కృష్ణయ్య, మాదల వీరభద్రరావు రచనల నుంచి యిది మనం గ్రహించగలుగుతున్నాం. అయితే రైతు రక్షణ యాత్రకు ముందుగాను, అది వచ్చిన సందర్భంలోను, జిల్లాలో నిర్వహించిన తాలూకా స్థాయి రైతు యాత్రల గూర్చి అప్పటి ఆంధ్ర పత్రిక (దిన పత్రిక) లోని వార్తల ద్వారా కొంత తెలుసుకోవచ్చు. (ఆంధ్ర పత్రిక 28/1/1938)

1938 జనవరి 19వ తేదీన బాపట్ల తాలూకాలోని 25 గ్రామాల నుండి రైతులు KLN సింహ నాయకత్వంలో తహసిల్దార్‌కు ఒక మెమోరాండంను సమర్పించారు. స్థానిక సమస్యలైన పెదనందిపాడు నుండి పొన్నూరుకు కంకర రోడ్డు వేయడం, ప్రతి రెవెన్యూ ఫిర్కాకు ఒక పశువుల వైద్యశాల ఏర్పాటు చేయడం, వ్యవసాయ కూలీల సహకార సంఘాలకు సేద్యానికి అనువైన భూములను మంజూరు చేయడం, మురుగునీటి పారుదల సౌకర్యాలు పెంపుజేయడం ఈ మెమోరాండంలోని ముఖ్యాంశాలు.

అదే జనవరి నెలలో (1938) 21వ తేదీన ఒంగోలు పట్టణంలో పెద్ద ఊరేగింపు జరిగింది. బాచిన సుబ్బారావు, ఎం. జయరామనాయుడు దీనికి నాయకత్వం వహించారు. జాతీయ జెండాలతో, ఎర్ర జెండాలతో ప్రదర్శనకారులు జాతీయ గీతాలు, రైతు పాటలు పాడుకుంటూ ఉత్సాహంగా పురవీధుల్లో ఊరేగి, సబ్ కలెక్టర్‌కు అర్జీని సమర్పించారు. ప్రభుత్వం తలపెట్టిన 'రుణ పరిష్కార బిల్లు' పరిధిని పెంచాలనీ, గ్రామోద్యోగుల లంచగొండి చర్యలను అరికట్టాలనీ, జమాబందీ ఖర్చుల పేరుతో వసూలు చేస్తున్న కానుకలు నిలుపు చేయాలనీ అర్థించారు.

నర్సరావుపేట తాలూకా రైతులు డిప్యూటీ కలెక్టర్ దగ్గరకు రాయబారంగా వెళ్ళి అమల్లో ఉన్న భూమి శిస్తు విధానాన్ని సవరించేంతవరకూ నూటికి 50 వంతుల పన్ను తగ్గించాలనీ, స్పెషల్ ట్రిబ్యునల్ ఏర్పాటు చేసేవరకూ ఎస్టేట్ లాండ్ యాక్ట్ ననుసరించి అమల్లో ఉన్న దావాల కన్నింటికీ స్టాంపు డ్యూటీని 50 శాతం తగ్గించాలనీ అభ్యర్థించారు. (ఆంధ్ర పత్రిక 28-1-1938).

1938 జనవరి 19వ తేదీన రేపల్లె తాలూకా రైతులు గోగినేని గోపాలరావు (బి.ఎ., బి.ఎల్.) నాయకత్వంలో తహసిల్దార్‌కు తమ కోర్కెలతో కూడిన వినతి పత్రాన్ని సమర్పించారు. పై క్రమంలోనే 22వ తేదీ సత్తెనపల్లికి చుట్టపక్కల 20 మైళ్ళ పరిధిలో ఉన్న గ్రామాల నుండి వచ్చిన నూరుమంది రైతులు సత్తెనపల్లి తహసిల్దార్‌కు తమ కోర్కెల పత్రాన్ని అందజేశారు. భారతీదేవి రంగా, గోగినేని లక్ష్మీనారాయణ నాయకత్వంలో జరిగిన ఈ రాయబారం మెట్ట భూముల శిస్తు నూటికి 25 వంతున తగ్గించాలనీ, ఫారెస్ట్ కాంపౌండ్ ఫీజును రద్దు చేయాలనీ విజ్ఞప్తి చేశారు. (ఆంధ్ర పత్రిక 28-1-1938).

పై ఉదహరించిన రైతు యాత్రలన్నీ స్థానికంగా నిర్వహించబడ్డాయి. కొమ్మారెడ్డి నాయకత్వంలో రానున్న బృహత్తర రైతు రక్షణ యాత్రకు సన్నాహక ఘటనలుగా వీటిని పేర్కొనాలి. రక్షణ యాత్ర ఒక జిల్లా నుండి మరొక జిల్లాకు రాక పూర్వమే సంబంధిత జిల్లా రైతు సంఘం జిల్లాలో ఉన్న రైతులకు యాత్ర గురించి తెలియజేసి స్థానిక యాత్రలు నిర్వహించమని పిలుపునిచ్చేది. గ్రామాల్లో ఉన్న రైతులు కలిసి సమావేశమై సమస్యలను చర్చించుకుని విజ్ఞాపన పత్రాలు సిద్ధం చేసేవారు. అంతేకాక, పైన మనం గమనించినట్లుగా, స్థానిక అధికారులను కలసి వారి డిమాండ్లను అందజేసేవారు. ఒకసారి రైతు రక్షణ యాత్ర అరుదెంచాక ఈ స్థానిక అర్జీలన్నింటినీ వారు సేకరించి రైతు సమస్యలను గ్రామ, ఫిర్కా, తాలూకా వారీగా చర్చించేవారు. ఇలా సేకరించిన కొన్ని వేల అర్జీలను అంతిమంగా యాత్ర మద్రాసుకు చేరుకోగానే ప్రభుత్వానికి సమర్పించారు. యాత్రాదళం ప్రభుత్వానికి ఇచ్చిన తుది మెమోరాండంలోని డిమాండ్లు ఈ స్థానిక అర్జీల నుండి గ్రహించి, క్రోడీకరించి ఒక రూపంలో పెట్టినవని మనం గ్రహించాలి.

రైతు రక్షణ యాత్ర సత్తెనపల్లి తాలూకాకు రాక పూర్వమే తాలూకా రైతు మహాసభను జనవరి 26న (1938) వేల్పూరు గ్రామ తోటలో ఏర్పాటు చేశారు. ఆచార్య రంగా దానికి అధ్యక్షత వహించాడు. పేట బాపయ్య కాంగ్రెస్ పతాకాన్ని, ఎర్రజెండాను ఎగురవేశాడు. పెద్ద ఊరేగింపు. అనంతరం సభ జయప్రదం అయింది.

రైతు రక్షణ యాత్ర కార్యక్రమం సత్తెనపల్లిలో ఏర్పాటైంది. మాదాల గ్రామం నుండి ఒక దళం బయలుదేరి కాలినడకన, డప్పు వాయిద్యాలతో 25 గ్రామాలు పర్యటించారు. వావిలాల గోపాలకృష్ణయ్య ఈ దళానికి ముందుగా సైకిల్ పైన వెళ్ళి, దళ రాక గురించి గ్రామస్తులకు తెలియజేసేవాడు.

గ్రామంలోని దేవాలయం వద్దనో, గ్రంథాలయం వద్దనో లేక గ్రామ చావిడి ముందో సభ ఏర్పాటయ్యేది. పాటలతో ప్రారంభమై, రైతు సమస్యలపై ఉపన్యాసాలు ఇచ్చేవారు. రైతు రక్షణయాత్ర వస్తున్న వైనాన్ని తెలిపేవారు. ఈ కార్యక్రమం సత్తెనపల్లి తాలూకాలో తీవ్ర సంచలనాన్ని కలిగించింది. ప్రచార దళానికి ప్రతి గ్రామంలోను అపూర్వ సత్కారం లభించేది.

భోజన వసతులు కల్పించి గ్రామస్తులు తమ అభిమానాన్ని చూపుకునేవారు. పక్క గ్రామం దాకా దళం వెంట నడచి తమ సంఘీభావాన్ని చాటుకునేవారు. రక్షణయాత్ర సత్తెనపల్లికి వచ్చినప్పుడు అనేక వేలమంది ప్రజలు హాజరు కావడానికి ఈ ప్రచారం ఎంతగానో తోడ్పడింది. తాలూకా ఆఫీసు సమీపంలో గల చింతల తోపులో జరిగిన సభలో కొమ్మారెడ్డి తదితర నాయకులు ప్రసంగించారు. ఈ సభను జయప్రదం చేయడంలో వావిలాలకు కుడిభుజంగా మాదాల వీరభద్రరావు వ్యవహరించారు. వావిలాల మాటల్లో "ఈ యాత్ర సందర్భంగా సత్తెనపల్లి తాలూకాలో ఒక దళం బయలుదేరింది. అది 120 గ్రామాలు గల సత్తెనపల్లి తాలూకాలో నేను, శ్రీయుతులు మాదల వీరభద్రరావు, కల్లూరి సుబ్బయ్య, జానం గుని శేషగిరిరావు, దర్శి లక్ష్మయ్య, ఆమంచి నరసింహారావు, ఇంకా పదిమంది 45 గ్రామాలు 10 రోజులు తిరిగి జిల్లా దళం వచ్చినప్పుడు వారితో కలిసి చివరకు గుంటూరు తాలూకా వదలి ఆంధ్ర రాష్ట్ర రైతు రక్షణ యాత్రాదళం తాలూకాలోని మేడి కొండూరు వచ్చినప్పుడు వారితో కలిసి గ్రామ గ్రామాన తిరిగి పల్నాడు తాలూకాలో వదలి పెట్టడం జరిగింది. ఈ తాలూకా దళంలో నేను సైకిలుపై వెళుతుండేవాడిని. కీ॥శే॥ డాక్టర్ సీతారామశాస్త్రి గారికి 'ర్యాలి' సైకిలు ఉండేది. అప్పటి రోజుల్లో, ర్యాలీ సైకిలు ఉండడం అంటే ఈనాడు ప్రిస్టేజి కారు కన్నా గొప్ప అన్నమాట. ఆ సైకిలు మీద ఊరిలోకి పోయేది. అందరినీ పోగు చేసేది. సమావేశం ప్రారంభించేది. రైతు గాయకుడు శెట్టిపల్లి వెంకటరత్నం వ్రాసిన 'ఆగునా జీవాలు - సాగునా లోకాలు' పాటతో ప్రారంభించేవాళ్ళం. దీనిని "ఆకలిమంటచే మలమల లాడే అనాథలంతా లేవండోయ్ అనే పాటతో ముగించేవాళ్ళం."

వావిలాల గోపాలకృష్ణయ్య కథనం ప్రకారం యాత్రాదళం పిడుగురాళ్ళకు చేరుకున్నాక అక్కడినుండి వినుకొండ తాలూకా మీదుగా బాపట్ల, ఒంగోలు తాలూకాలు పర్యటించి తన గుంటూరు జిల్లా పర్యటనను పూర్తి చేసింది.

గుంటూరు జిల్లాలో యాత్ర ముగించుకుని దళం ఫిబ్రవరి 16 నుండి రాయలసీమలో పర్యటిస్తుందని ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం మేనేజర్ నండూరి ప్రసాదరావు ఫిబ్రవరి 11, 1938న విడుదల చేసిన ఒక పత్రికా ప్రకటనలో పేర్కొన్నాడు. (ఆంధ్ర పత్రిక, ఫిబ్రవరి 11, 1938). ఆ విధంగానే విజయవాడ నుండి దళం చలసాని వాసుదేవరావు, పిన్నమనేని శీతారామయ్య మొదలగు సభ్యులతో ఫిబ్రవరి 15 సాయంత్రం బయలుదేరింది.

ఈ సందర్భంగా యాత్ర పర్యటనలో జరిగిన మార్పును తెలుసుకోవాలి. 1938 జనవరి మొదటి వారంలో ప్రారంభం కావల్సిన యాత్ర వాయిదా పడడానికి కారణాలను రైతు సంఘ ప్రధాన కార్యదర్శి చలసాని వాసుదేవరావు వివరించాడు. వాతావరణం సరిగా లేకపోవడం, అంతకంటే ముఖ్యంగా రుణాలపై మారిటోరియం చట్టాన్ని గూర్చిన ఆందోళన జనవరి 17 నుండి 24వ తేదీ వరకు జరపాల్సి రావడం మొదలైనవి పేర్కొన్నాడు. అంతేకాక మరో రెండు

కారణాలను కూడా వాసుదేవరావు వివరించాడు. జమీందారీ విచారణ సంఘం రైతులకున్న కష్టాలను ప్రభుత్వానికీ, కాంగ్రెస్ సబ్ కమిటీవారికీ నివేదించాల్సి ఉండడంతో రైతు కార్యకర్తలు అన్ని జిల్లాల్లో ఈ పనిలో నిమగ్నులై ఉండడంతో యాత్రకు అది అదను కాదని నిర్వాహకులు నిర్ణయించారు. అదీగాక రాయలసీమ రైతులు డిసెంబర్ నెలలో రాయలసీమ అటవీ మహాసభను ఏర్పాటు చేసి దానికి సంబంధించిన సమస్యలను చర్చించే కార్యక్రమంలో వున్నందువల్ల కూడా పర్యటన వాయిదా పడింది.

ఈ కారణాల వల్ల రాయలసీమ రైతులు యాత్ర వాయిదా పడ్డందుకు ఆశాభంగం చెందక జరగనున్న రైతు యాత్రను జయప్రదమొనర్చాలని వాసుదేవరావు తన ప్రకటనలో తెలిపారు.

రాయలసీమలో రైతు రక్షణ యాత్రను గూర్చిన వివరాలు ఎక్కువగా లభించడంలేదు. లభించినంతలో కర్నూలు జిల్లా పర్యటన గూర్చి జిల్లా రైతు సంఘ బాధ్యులు చేగిరెడ్డి బాలిరెడ్డిల ప్రకటనలో ఇలా వుంది. "తిప్పాయపాలెం దగ్గర ఆరంభమైన యాత్ర జంగంగుంట్ల, నాగులవరం, మొహద్దీపురం, అర్థవీడు, పాపినేనిపల్లె, ఆకవీడు, పుల్లల చెరువు గ్రామాల్లో పర్యటించి అక్కడ బహిరంగ సభలు జరిపారు. ప్రతిచోటా రైతులువారి సమస్యలను, కనీసపు కోర్కెలను, అర్జీల ద్వారా, వాగ్మూలముల ద్వారా నాయకులకు తెలియజేశారు. తిప్పాయపాలెం రైతులు తమ భూములపై విధించిన హెచ్చు శిస్తును తగ్గించాలని విజ్ఞప్తి చేశారు. ఆ ప్రాంతంలో కొత్తగా కట్టిన ప్రాజెక్టు వల్ల ఈ శిస్తులు అధికం చేశారని వారు విన్నవించుకున్నారు. రవాణా సౌకర్యాలు కలిగించాలని, అడవి సరుకును - పుల్లలు, పచ్చి ఎరువు వగైరా రైతులకు అందుబాటులో ఉండేందుకు ఉచిత పర్మిట్లు ఇవ్వాలని కోరారు. పంటలు పండనప్పుడు శిస్తు రెమిషన్ ఇవ్వాలని, అటవీ చట్టాలను రైతులకు అనుకూలంగా మార్చాలనీ, జంపాలేరు నదిపై వంతెన నిర్మించాలనీ తమ మహజర్లలో మొరపెట్టుకున్నారు."

రైతు రక్షణ యాత్ర దళం కర్నూలు జిల్లా పర్యటన ముగించుకుని నెల్లూరు జిల్లాకు వచ్చింది. జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి దువ్వూరి బలరామిరెడ్డి, యువజన కాంగ్రెస్ కార్యదర్శి రావి ఆదిశేషయ్య, జిల్లా కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ కార్యదర్శి బస్వారెడ్డి శంకరయ్య, జిల్లా జమీన్ రైతు కార్యదర్శి చిగుళ్ళ గుర్నాథం జిల్లా కార్యక్రమాన్ని ముందే నిర్ణయించారు. వారు తమ ప్రకటనలో భోజనాలకు ముందే సభలు జరుగుతాయనీ, సభలు జరిగే గ్రామాల చుట్టపక్కల రైతులు వచ్చి తమ కష్టసుఖాలను చెప్పుకోవాలనీ పేర్కొన్నారు.

"1938 ఫిబ్రవరి 28వ తేదీన రైతుదళం ఆత్మకూరు తాలూకా రాజోలు గ్రామంలో ప్రవేశించింది. ఆ గ్రామ రైతు నాయకులు ఎద్దుల బళ్ళలో ఎదురేగి దళానికి ఘన స్వాగతమిచ్చారు. గ్రామ రైతులు మేళతాళములతో దళమువారిని గ్రామమంతయు ఊరేగించిరి. ఈ ఉత్సవంలో ఎర్రజెండాలు, జాతీయ పతాకలు ఎగురవేసిరి. ముంగమూరు వెంకురెడ్డి

అధ్యక్షతన జరిగిన సభలో సుమారు 600 మంది రైతులు పాల్గొని తమ సమస్యల గూర్చిన అర్జీలను సమర్పించుకున్నారు. నీటి వసతులు కల్పించాలనీ, పశువుల పుల్లరి తగ్గించాలనీ, వారు తమ డిమాండ్లను నివేదించిరి. దళాధ్యక్షులు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి మాట్లాడుతూ, సమస్యల పరిష్కారానికి రైతు, కూలీ సంఘాలను స్థాపించాలనీ అవి రెండూ కలసి పనిచేసి దేశాన్ని కాపాడాలని ప్రబోధించారు. అదే సభలో గుంటూరు జిల్లా రైతు నాయకులు పులుపుల వెంకట శివయ్య, రష్యాలో స్థాపించిన కూలీ - రైతు రాజ్యం మాదిరే భారతదేశంలో కూడా అలాంటి రాజ్య స్థాపనకు కృషి చేయాలని ఉపన్యసించారు. రాజోలు నుండి రైతు రక్షణ దళం బయలుదేరి భీమవరం, గుడిపాడు మీదుగా కనిగిరి, నాగ సముద్రం, అంబులూరిపాలెం, చీమలపాలెం మీదుగా పెదపాడు, సిద్ధన కొండూరు, సోమవరప్పాడు, చామదల, బోగోలు తదితర గ్రామాల్లో సభలు జరిపింది. ఈ సభల్లో కొమ్మారెడ్డి, పులుపుల శివయ్య, బస్వారెడ్డి శంకరయ్య, సీతారామస్వామి తదితర రైతు నాయకులు, రైతు సంఘాల ఆవశ్యకత, పన్నుల విధానము, రైతు - కూలీల ఐకమత్యాన్ని గూర్చి ఉపన్యసించారు. గ్రామాలవారీ సమస్యలు నివేదించుకున్నారు.

భీమవరం గ్రామం ఒక అగ్రహారం. అక్కడ మాగాణి భూమిపై 20 రూపాయల నుండి 50 రూపాయల వరకు శిస్తు విధించారు. అగ్రహారందారు దాదాపు ఇరవై సంవత్సరాల నుండి చెరువు మరమ్మతు చేయించక, రైతుల నుండి నిర్బంధంగా పన్నులు వసూలు చేస్తున్నాడు. గుడిపాడు ప్రభుత్వ గ్రామం. అయినా నీటి వసతి లేదు. పారుదల కాలువ పూడిపోయింది. అయిననూ పబ్లిక్ వర్క్సు డిపార్ట్‌మెంట్ వారికి లంచమిస్తే కానీ పని చేపట్టరు. ప్రభుత్వంవారు ఈ పూడిపోయిన కాలువను రెండు మూడు వేల రూపాయల ఖర్చుతో మరమ్మతు చేయించాలనీ, దానివల్ల గ్రామంలో 580 ఎకరాలకు నీటి వసతి కలిగి, రైతులు దారిద్ర్య విముక్తులవుతారనీ తమ మహజరులో విన్నవించుకున్నారు. కలిగిరి గ్రామానికి కూడా నీటి వసతి లేదు. వ్యవసాయం వర్షాధారమైనందున ప్రతి సంవత్సరము పంటలు పండక రైతులు ఇతర ప్రదేశాలకు కూలి కోసం వలస వెళ్ళి ఆరు నెలల తరువాత తిరిగి వస్తున్నారు. పెదపాడు గ్రామం రేబాల పట్టాభిరామిరెడ్డి అనే భూస్వామి ఆధీనంలో ఉంది. ఎకరానికి 16 1/2 రూపాయిలు శిస్తు విధించి పండినా, పండకపోయినా శిస్తును గోళ్ళూడగొట్టి వసూలు చేస్తున్నాడు. ఇక సిద్ధన కొండూరు గ్రామస్తులు ప్రధానంగా కోడెల వ్యాపారస్తులు. ఆ గ్రామము దొడ్లవారి ఆధీనంలో వుంది. దౌర్జన్య పద్ధతులతో పంటలు లేకున్నా భూస్వాములు శిస్తు రెమిషన్ ఇచ్చేవారు కాదు. దీనికి తోడు ఎస్టేట్ నౌకర్లకు రైతులు లంచాలిచ్చుకోవాలి. చాకళ్ళు, కుమ్మర్లు వారికి ఉచిత సేవలు చేయాలి. వీరి దుర్మార్గాలను అరికట్టాలని గ్రామస్తులు అర్జీలిచ్చుకున్నారు.

ఇంతకంటే దారుణమైన పరిస్థితులు గవర్నమెంట్ గ్రామమైన చామదలలో నెలకొన్నాయని యాత్రదళంలోని సభ్యులు వ్యాఖ్యానించారు. ఈ గ్రామంలో శిస్తు చుట్టు

పక్కల గ్రామాల కంటే రెట్టింపుగా ఉంది. నీటిపారుదల సౌకర్యాలు బాగా తక్కువగా వుండి, గ్రామ రైతులు అనేక కష్టాలకు గురవుతున్నారనీ, వాటిని తొలగించుటకు వెంటనే చర్యలు చేపట్టాలనీ కోరారు. అధికారంలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వం తగు శ్రద్ధ వహించి వెంటనే నివారణ చర్యలు చేపట్టని యెడల కాంగ్రెస్ ప్రభుత్వం కూడా ఇతర ప్రభుత్వాల వలే ప్రజా వ్యతిరేక ప్రభుత్వంగా పరిగణింపబడునని చామదల గ్రామస్తులు హెచ్చరించారు.

కావలి తాలూకా నాగ సముద్రం శోత్రియం గ్రామం. ఆ గ్రామంలోని కరణంకు జీతం లేదు. అందువల్ల మేరలు పేరిట అన్ని రకాల దోపిడీలు చేయుచున్నాడనీ, ఎన్ని అర్జీలు పెట్టుకున్నా అతన్ని తొలగించలేదనీ, వెంటనే అతన్ని తొలగించినగాని గ్రామస్థుల ఇక్కట్లు యీడేరవని రైతులు కాంగ్రెస్ ప్రభుత్వాన్ని హెచ్చరించారు.

కావలి తాలూకా పర్యటన పూర్తిచేసి రైతు రక్షణ యాత్ర మార్చి 4వ తేదీ (1938) కోవూరు తాలూకాలో పర్యటన ప్రారంభించింది. అల్లూరు, ఇందుపూరు, తలమంచి, పద్మనాభసత్రం, గండవరం, ఎల్లాయిపాలెం, బుచ్చిరెడ్డిపాలెం, దామరమడుగు, గంగవరం, కోవూరు గ్రామాల్లో పర్యటించింది. ప్రతి గ్రామంలో సభలు జరిగాయి. దళాధిపతితోపాటు బస్వారెడ్డి శంకరయ్య, అల్లూరి రంగయ్య తదితరులు ఉపన్యసించారు. బస్వాయపాలెం గ్రామానికి నీటిపారుదల వనరులు కల్పించాలనీ, వెంకన్నపురం గ్రామంలో డొంకలేనందున మనుషుల, పశువుల రాకపోకలకు ఇబ్బందిగా వున్నదనీ, శోత్రియం గ్రామమైన యల్లాయిపాలెంలో రైతులకు పట్టాలివ్వలేదనీ మొదలగు గ్రామాల సమస్యలను మహజర్ల ద్వారా విన్నవించుకున్నారు. ఈ సమస్యలను తక్షణమే ప్రభుత్వం తీర్చకున్నచో కాంగ్రెస్ ప్రభుత్వ ప్రతిష్ఠకు భంగంకలుగునని రైతుదళ కార్యకర్తలు హెచ్చరించారు.

నెల్లూరు జిల్లా వ్యవసాయ కూలీలు ఎదుర్కొన్న ముఖ్య సమస్య పిచ్చముంతలతో (తక్కువ కొలపాత్రలు) కూలి గింజలు కొలవడం. దీనివల్ల కూలీల దురవస్థ చెప్పనలవి కాకుండా వుంది. ఈ సమస్యను గ్రామాల్లోని కాంగ్రెస్ రైతు సంఘాలవారు శ్రద్ధ తీసుకుని పరిష్కరించాలనీ, లేనిచో రైతు సంఘాలపట్ల, వ్యవసాయ కూలీలకు విశ్వాసం నశిస్తుందనీ హెచ్చరించారు.

మార్చి 21 (1938) కల్లా రక్షణయాత్ర నెల్లూరు పర్యటనా ముగించుకుని 25 నాటికి మద్రాసు చేరుకుంటుందని రైతుసంఘ ప్రధాన కార్యదర్శి ప్రకటించారు. యాత్ర విజయానికి ప్రతి జిల్లా నుండి ఐదుగురు ప్రతినిధులను మద్రాసుకు పంపవలెనని జిల్లా రైతు సంఘాలకు ఆయన సూచించారు. అంతేకాక, ప్రతి జిల్లాలో తాలూకాకు నాలుగు వేలమంది రైతులతో ప్రదర్శన చేసి, తాలూకా కచ్చేరీలకు పోయి, ఆ యా తాలూకాల్లో వున్న రైతు సమస్యల గూర్చి, రాష్ట్ర రైతు రక్షణ యాత్రను బలపరుస్తూ, యాత్ర తరపున అసెంబ్లీకిచ్చే మెమోరాండం ప్రతులను తాలూకా ఆఫీసర్లకు ఇవ్వాలని వాసుదేవరావు తన సర్క్యులర్‌లో పేర్కొన్నాడు. (సర్క్యులర్ 11, మార్చి 18, 1938).

# రైతు రక్షణ యాత్ర - ఫలితాలు
# ముగింపు

1937 జూలై 3వ తేదీన ఉత్తరాంధ్రలో (ఇచ్ఛాపురం నుండి) ప్రారంభమైన రైతుయాత్ర 1938 మార్చి 27వ తేదీ నాటికి మద్రాసుకు చేరింది. ఉభయ విశాఖ జిల్లాలు, ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలు, చెంగల్పట్టు జిల్లాలోని రెండు తాలూకాలు, రాయలసీమ ప్రాంతంలో ముఖ్యంగా కర్నూలు జిల్లాలో సంచారం చేసింది. మధ్యలో కొన్నాళ్ళు రైతు నాయకుల అనారోగ్యం వల్లా, వర్షాల మూలంగా, యాత్ర నిలిపివేయబడినా మొత్తం 130 రోజులు పర్యటించింది. 525 గ్రామాలను సందర్శించింది. 25వేల సంతకాలతో 800 దరఖాస్తులను స్వీకరించింది. ఇవి కాకుండా, స్థానిక సమస్యలపై రైతులు సమర్పించుకున్నా 300 పత్రాలను సేకరించింది. 500 గ్రామ సభలు, 60 ఫిర్కా స్థాయి సభలను నిర్వహించింది. మొత్తం మీద నాలుగు లక్షల యాభైవేలమంది రైతులు ప్రజలు సభల్లో పాల్గొన్నారని అంచనా.

**ఆధునిక భారతదేశ చరిత్రలో ప్రధానంగా జాతీయోద్యమ కాలంలో యింతటి మహత్తర ప్రజా సమీకరణ రైతాంగ ఉద్యమ సంఘటిత ఉద్యమ ప్రదర్శన - మరెక్కడా జరిగినట్లు మనకు తెలియదు. బహుశా దండి యాత్ర - ఉప్పు సత్యాగ్రహ సందర్భంగా గాంధీ నాయకత్వంలో జరిగిన ఉద్యమం మినహాయింపు కావచ్చు. కానీ అది కేవలం రైతులకు, రైతు సమస్యలకు మాత్రమే పరిమితం కాలేదన్న అంశాన్ని మనం గుర్తుంచుకోవాలి.**

రైతు రక్షణ యాత్ర జాతీయోద్యమంలో ఒకానొక కీలకదశలో నిర్వహించబడింది. 1929 నుండి ప్రపంచవ్యాప్తంగా నెలకొన్న ఆర్థిక మాద్యం భారతీయ రైతాంగంపై తీవ్ర ప్రభావాన్ని చూపింది. రైతుల ఆర్థిక స్థితి అస్తవ్యస్తమై రోజు గడవని పరిస్థితికి లోనయ్యారు. వారిని రక్షించడం తక్షణ కర్తవ్యంగా తయారైంది. కాగా 1930 దశకంలోనే వామపక్ష శక్తులు ఆంధ్రదేశంలో తమ ఉనికిని పునాదులు వేసుకోవడం ఆరంభమైంది. కాంగ్రెస్ - సోషలిస్టు పార్టీ, అందులో ప్రచ్ఛన్నంగా కమ్యూనిస్టులు ఉంటూనే, తమ పార్టీ నిర్మాణాన్ని ప్రత్యేకంగా నిర్మించుకోవడం ఆరంభించారు.

గ్రామీణ ప్రాంతాల్లో రైతులను, కూలీలను సమీకరించి, వారి సమస్యలను చేపట్టి, వాటి పరిష్కారానికి కృషి చేయడం ద్వారా తమ ఉద్యమాన్ని విస్తరించుకొంటున్నారు. కాంగ్రెస్ పార్టీ 1937 ఎన్నికలకు ముందు రైతాంగ డిమాండ్లను తన ఎన్నికల ప్రణాళికలో చేర్చుకుంది. వాటిని తీరుస్తానని హామీలు యిచ్చింది. ఇది జాతీయోద్యమంలో గమనించాల్సిన ముఖ్య మలుపు. ఇక ఆంధ్ర ప్రాంతంలో రైతు ఉద్యమం బలపడి ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘంగా ఏర్పడింది. గ్రామస్థాయి నుండి రాష్ట్ర స్థాయి వరకూ సంఘాలేర్పడి, 56 వేల సభ్యత్వంతో నిర్దిష్ట కార్యక్రమంతో, ఒక ప్రణాళిక ప్రకారం పనిచేస్తు వున్నది. రైతాంగ ఉద్యమాన్ని పటుతరం

చేయడానికీ, రాష్ట్రం మొత్తం మీద రైతులెదుర్కొంటున్న సకల సమస్యలను ఆకళింపు చేసుకోవడానికీ, వాటిపై ప్రజల, ప్రభుత్వ దృష్టిని ప్రసరింపజేయడానికి, ఒక సమగ్ర నివేదికను తయారు చేయడానికి రైతు యాత్రను నిర్వహించడం జరిగింది.

యాత్రలో అన్ని రాజకీయ పక్షాలు - జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీలు మినహా పాల్గొన్నాయి. కాంగ్రెస్ నాయకులు, వామపక్షాలు (సోషలిస్టులు, కమ్యూనిస్టులు) ముఖ్యంగా యువకులు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. రైతు రక్షణయాత్ర, అంతకు పూర్వం, 1933 సంవత్సరం నుండి స్థానికంగా, ప్రాంతీయంగా జరుగుతున్న రైతు యాత్రల అంతిమ పర్యవసానంగా మనం గ్రహించాలి. స్థానిక అధికారుల వద్దకు అక్కడి రైతులు తమ సమస్యలను ఏకరువు పెడుతూ, వాటి పరిష్కారం కోసం యాత్రలు జరుపుతూ వచ్చారు. ఇవి రైతాంగంలో పెంపొందుతూ వచ్చిన చైతన్యాన్ని తెలియజేయడమేగాక రైతు ఉద్యమం తృణమూల స్థాయి నుండి ఎలా ఎదుగుతూ వచ్చిందో వివరిస్తున్నాయి. అదేకాలంలో సంఘటిత సంఘ నిర్మాణం గూడ ఆరంభమైంది. స్థానికంగా జరిపిన రైతు యాత్రలు రైతుల్లో రాజకీయ స్పృహను కలిగించాయి. వాటికొక రాజకీయ ప్రయోజనాన్ని సమకూర్చాయి కూడా. దీనికి తోడు జాతీయ కాంగ్రెస్ తన ఎన్నికల ప్రణాళికలో రైతుల కోర్కెలను చేర్చడం రైతు ఉద్యమానికి రాజకీయ ప్రాముఖ్యం మాట అటుంచి, గొప్ప నైతిక బలాన్ని చేకూర్చింది. ఎన్నికల్లో గెల్చి, శాసనసభల్లోకి వెళ్ళే సభ్యులకు, మంత్రులకు వారు చేస్తున్న కృషికి వెలుపలి నుండి ప్రజా వత్తిడి, బలం కలిగించేందుకు ఈ రైతు యాత్రలు తోడ్పడ్డాయి. మరో విధంగా చెప్పాలంటే ప్రభుత్వానికి రైతాంగం గట్టి వత్తాసును కలిగించి ప్రభుత్వం చేయగలిగిన లేదా చేయాల్సిన పనులను సూచించేందుకు కూడా స్థానిక యాత్రలే కాక రైతు రక్షణ యాత్ర కూడా దోహదం చేసింది. దీనికి తార్కాణంగా మారుటోరియం చట్టం (రుణ నివారణ) జమీందారీలపై విచారణ లాంటి సమస్యలు ప్రభుత్వం చేపట్టినప్పుడు రైతులు వీటిని బలపరుస్తూ యాత్రలు జరిపారు. సభలు నిర్వహించారు. తద్వారా తమ మద్దతును ప్రభుత్వానికి అందజేశారు.

రైతు రక్షణ యాత్ర ప్రభుత్వానికి సుదీర్ఘ మెమోరాండాన్ని సమర్పించింది. సుదీర్ఘమే కాక, ఇది సమగ్రమైంది కూడా. ఆంధ్రదేశంలోని రైతులెదుర్కొంటున్న సమస్యలకు ఇది దర్పణమని దీన్ని పరిశీలిస్తే తేటతెల్లమవుతుంది. రైతులందరూ ఎదుర్కొంటున్న సామాన్య సమస్యలతోపాటు, ఒక్కొక్క జిల్లాలో, ఒక్కొక్క గ్రామంలో రైతుల సమస్యలను ఆకళింపు చేసుకొని వాటికొక రూపాన్నిచ్చింది. ఆంధ్రదేశపు రైతుల డిమాండ్ల మాగ్నా కార్టా (Magna Carta) గా దీన్ని అభివర్ణించవచ్చు.

రైతు నాయకులు తమ మెమోరాండంలో కొన్ని విలువైన వ్యాఖ్యలను చేశారు. వాటి పరిశీలనల్లో రైతాంగంలో నూటికి తొంభై అయిదుమంది కటిక దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. రైతాంగంలో వచ్చిన చైతన్యాన్ని ఒకవైపు అభినందిస్తూ మరోవైపు వారి కష్టాలను పేర్కొన్నారు.

పన్నుల భారం, భూమి శిస్తు విధానం, వరదలు, ప్రకృతి వైపరీత్యాలు వారిని కుంగదీస్తున్నాయి. భూముల ధరలు పడిపోయాయి. వారి పరపతి దెబ్బతింది. పూట గడవటం కష్టంగా వుంది. రీసెటిల్‌మెంట్ రేట్లు, నజరానాలు పెనాల్టీలు రైతులకు మోయలేని భారంగా తయారయ్యాయి. డెల్టా ప్రాంతాల్లోని రైతులు కూడా రుణగ్రస్తులై తమ భూములను కోల్పోయారు. ఈ భూ మార్పిడి వల్ల, మార్వాడీలు, షావుకార్లు లబ్ది పొందారు. ప్రభుత్వం జారీచేసిన రుణ నివారణ చట్టం రైతులకు పరిమిత స్థాయిలోనే ఉపయోగపడింది. ఈ చట్టాన్ని మరింత విశాలతరంచేసి పూర్తి రుణ పరిష్కారానికి తోడ్పడాలని మెమోరాండం ప్రభుత్వాన్ని కోరింది.

అనేక గ్రామాల్లో భూములకు నీటి వసతి లేదు. దీనికోసం మైనర్ ఇరిగేషన్ పనులు చేపట్టాలి. వీటివల్ల అనేక గ్రామాల్లో తరచు సంభవించే కరువులను నివారించవచ్చు. దీనికి తోడు ప్రజలకు తాగు నీటి సౌకర్యాలు లేక గుక్కెడు నీళ్ళ కోసం మైళ్ళ పర్యంతం వెళ్ళి మంచినీరు తెచ్చుకుంటున్నారు.

ఉద్యోగుల్లో లంచగొండితనం, అన్ని శాఖలకు పాకిపోయింది. లంచాలివ్వనిదే పనులు జరగడం లేదు. ప్రతీకారం జరుగుతుందన్న భయంతో రైతులు ఈ విషయాన్ని పైకి చెప్పడానికి సాహసింప లేకున్నారు. జాతీయ ప్రయోజనాలతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ మంత్రివర్గం ఉద్యోగులలో జాతీయాభిమానాన్ని పెంచి, వారిని ప్రజాసేవకులుగా తయారు చేయాలని మెమోరాండం గట్టిగా కోరింది. పోలీసుల దౌర్జన్యం పెచ్చుపెరిగి పోయిందనీ, వారు ప్రజా శ్రేయస్సుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారనీ చెబుతూ, వారి మితిమీరిన జులుంను అదుపులో పెట్టాలని మెమోరాండం అభిప్రాయపడింది. జమీందారీ ఇనాందారీ, మొఖాసా గ్రామాల్లోని రైతుల స్థితిగతులు నరకప్రాయంగా ఉన్నాయనీ మెమోరాండం వర్ణించింది. ఫ్యూడల్ పద్ధతులకు బలయిపోతున్న ఈ గ్రామాల్లో పాడుబడిన చెరువులు, పూడిపోయిన కాలువలు, పట్టాలులేని రైతులు, అధిక శిస్తులు, జప్తులు, వేలంపాటలు ఒకటేమిటి సమస్యల వలయంలో కూరుకుపోయిన జమీందారీ రైతుల కష్టాలను కళ్ళకు కట్టినట్లుగా రైతు నాయకులు తమ నివేదికలో పేర్కొన్నారు. గ్రామాల్లోని అన్ని రకాల ఖాళీ భూములను ఆక్రమించుకొని రైతులు, వారి పశువులు, కాలు మెదపడానికి కూడా వీలులేని స్థితిలో ఉన్నారు. శిస్తు కట్టలేని రైతులను కోర్టులకీడ్చడం అక్కడ నిత్యకృత్యంగా మారింది.

ప్రభుత్వం జారీచేసిన అటవీ చట్టాల వల్ల పుల్లరి రేట్లు పెరిగాయి. జమీందారీ, రైత్వారీ ప్రాంతాల్లోని అడవుల్లో అనాదిగా రైతులనుభవిస్తున్న హక్కులు తొలగించబడ్డాయి.

రైతు రక్షణ యాత్ర పేర్కొన్న రైతుల కడగండ్లు వారు వెళ్ళగలిగిన, రవాణా సౌకర్యాలు కలిగిన గ్రామాలవి మాత్రమే. వారు వెళ్ళని, వెళ్ళలేని ప్రాంతాల్లో అసంఖ్యాకంగా వున్న రైతుల కష్టాలు ఇంకా ఎక్కువ మోతాదులో ఉండి ఉండాలి. విద్య, వైద్య సౌకర్యాలు దాదాపు మృగ్యం. ప్రధానంగా వ్యవసాయ కూలీలుగా వుంటున్న దళితుల జీవన శైలి అతి హీనంగా వుండడాన్ని

రైతు రక్షణ యాత్ర గమనించింది. అంటరానితనం, అవిద్య, అజ్ఞానం, అనారోగ్యాలతో వీరు బానిసల కంటే హీనమైన స్థితిలో వున్నారు.

స్థానిక అధికారుల వైఖరి అత్యంత గర్హనీయంగా ఉంది. సమాజంలోని ధనిక స్వాముల ఊడిగం చేస్తూ, వారి చెప్పు చేతల్లో మెలగుతూ, రైతుల సమస్యల్ని పెడచెవిన పెడ్తున్నారు. ఈ సందర్భంలో మెమోరాండం వెల్లడించిన ఒక సత్యం ప్రసంశనీయంగా వుంది. అదేమంటే, స్థానికాధికారులకు ప్రజల భాష తెలుగుతో పరిచయం లేకపోవడం వల్ల వారు ప్రజల సమస్యలను అర్థం చేసుకోలేక, వారికీ, ప్రజలకు మధ్య అంతరం పెరిగింది. దీన్ని పూడ్చడానికి ప్రభుత్వ పాలన వ్యవహారాలను తెలుగులో జరపాలని వీరు ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. (ప్రజల భాషలో పాలన అన్నది రైతుయాత్ర జరిగిన 60 సంవత్సరాల తర్వాత నేటికీ ఎండమావిగానే మిగిలిపోవడం శోచనీయం.)

1937 ఎన్నికలు పూర్తయి, కాంగ్రెస్ మంత్రివర్గం అధికారంలోకి రాగానే రైతుల ఆశలు చిగురించాయి. వారిలో ఉత్సాహం మిన్నంటింది. కాంగ్రెస్ ప్రభుత్వం తమ కష్టాలను తీరుస్తుందన్న విశ్వాసం పెరిగింది. కొంతవరకూ రుణ నివారణ చట్టం, మధ్యపాన నిషేధ చట్టం, ప్రవేశ పెట్టడం ద్వారా రైతుల నమ్మకం ఎక్కువైంది. తాము తయారుచేసిన నివేదికలోని డిమాండ్లను తీర్చవలసిందిగా ప్రభుత్వాన్ని మెమోరాండం విజ్ఞప్తి చేసింది. జమీందారీ, రైత్వారీ ప్రాంతాల్లోని రైతుల సమస్యలపై మెమోరాండంలోని వివిధ అంశాలను, రైతాంగ అత్యవసర కోర్కెలను అనుబంధంలో పొందుపరుస్తున్నాం.

రైతు రక్షణ యాత్ర ఏం సాధించింది ? అన్న ప్రశ్నకు ప్రధానంగా చెప్పుకోవల్సింది అది రైతుల్లో కలిగించిన అపూర్వ సంచలనం, పెల్లుబికిన చైతన్యం. ఇది కేవలం భావపరమైనది మాత్రమే కాదు. చైతన్యం కేవలం ఆరంభ బిందువు మాత్రమే. దాన్ని కూడగట్టి, తగిన రూపమిచ్చి, ఆచరణలో పెడ్తే నికరమైన సత్ఫలితాలను సాధించవచ్చునని రైతు రక్షణ యాత్ర అనంతర పరిణామాలు మనకు తెలియజేస్తున్నాయి. రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో లెక్కకు లేనన్ని రైతు మహాసభలు జరిగాయి. వీటిని మనం రైతు రక్షణ యాత్ర సాధించిన మరో ప్రయోజనంతో కలిపి చూడాలి. అది ప్రభుత్వం అప్పటి రెవెన్యూ మంత్రి టంగుటూరి ప్రకాశం పంతులు ఆధ్వర్యంలో నియమించిన జమీందారీ విచారణ కమిటీ. ఈ కమిటీ తన విచారణ కొనసాగిస్తున్నపుడు ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం లక్షలాది రైతాంగాన్ని సమీకరించి కమిటీ ముందు సాక్ష్యాల్ని ఇప్పించింది.

ఇదే కాలంలో రైతు రక్షణ యాత్రచే మేల్కొన్న జమీందారీ, ఇనాందారీ ప్రాంతాల రైతులు పోరాటాలకు నడుం కట్టారు. ఇదొక చారిత్రాత్మక ఘటన. జమీందారీ విధానం రద్దుకు రైతు రక్షణ యాత్ర నాంది పలికింది. మునగాల, వెంకటగిరి, కాళీపట్నం, పిఠాపురం, మందస, చల్లపల్లి జమీందారీ, ఇనాందారీ వ్యతిరేక పోరాటాలు జరిగాయి. వీటి ప్రధాన ఉద్దేశ్యం

జమీందారీ భూస్వామ్య దోపిడీని అంతంచేసి, రైతులకు భూమిపై 'జిరాయితీ' హక్కును కల్పించడం. రాష్ట్రం మొత్తం మీద ఒకే రకమయిన రైతువారీ వ్యవస్థను నెలకొల్పడం. ఈ పోరాటాలు 1938-40 మధ్యకాలంలో జరిగాయి. లక్షలాది రైతాంగం వీటిలో పాల్గొన్నారు. అనేకమంది అరెస్టయ్యారు. ఎంతోమంది ప్రభుత్వ హింసాకాండకు గురయ్యారు. కాళీపట్నం జమీందారీ వ్యతిరేక పోరాటానికి నాయకత్వం వహించినందుకు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఉద్దరాజు రామం మొదలగు నాయకులు కాంగ్రెస్ నుండి సస్పెండయ్యారు. ఆనాడు కాంగ్రెస్‌లోని మితవాదులు ఉద్యమాలకు అనేక అడ్డంకులు కల్పించారు. బలుసు సాంబమూర్తిలాంటి కాంగ్రెస్ నాయకులు జమీందారీ విధాన రద్దును వ్యతిరేకించారు. రైతు ఉద్యమంలో ఎర్ర జెండాను ఎగుర వేయడానికి అభ్యంతరం చెప్పారు. అప్పటి మద్రాసు రాష్ట్ర ప్రధానమంత్రి రాజాజీ కూడా ఈ సమస్యపై స్పష్టమైన వైఖరి అవలంభించలేదు. పైగా దాన్ని విమర్శించాడు. రైతుయాత్ర, రైతాంగ పోరాటాల ఫలితంగానే మద్రాసు శాసనసభలో 1939లో ఎస్టేట్ ల్యాండ్ రెవెన్యూ బిల్లు ప్రవేశపెట్టబడింది. కానీ అప్పట్లో అది చట్టంగా రూపొందలేదు. దేశ స్వాతంత్ర్యం తరువాతనే 1948లో జమీందారీ విధానం శాశ్వతంగా రద్దు చేయబడింది.

# శ్రీకొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి జీవిత సంగ్రహం

శ్రీ కొమ్మారెడ్డి సత్యన్నారాయణమూర్తిగారు 1901లో పశ్చిమగోదావరి జిల్లా పోతునూరులో జన్మించారు. గాంధీజీ పిలుపు విని విద్యకు స్వస్తి చెప్పి 1919-21 సహాయ నిరాకరణోద్యమంతో జాతీయ స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించారు. 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని రాజమండ్రి, నెల్లూరు జైళ్ళలో ఒక ఏడాది కఠినశిక్ష అనుభవించారు. తిరిగి 1932 లో శాసనోల్లంఘన, రీసెటిల్‌మెంట్ వ్యతిరేక ఉద్యమంలో అరెస్టు చేయబడి మరొక 6 నెలల కఠినశిక్ష అనుభవించారు. విడుదలై వచ్చిన తరువాత హరిజనోద్యమం, ఖాదీ ఉద్యమం మున్నగువాటిలో పాల్గొన్నారు. కాంగ్రెస్‌లో అతివాద వర్గంతో కలిసి కూలీ రక్షణ సంఘాలు, రైతుసంఘాలు నెలకొల్పారు. 1935 లో పశ్చిమగోదావరిజిల్లా రైతు సంఘానికి అధ్యక్షత వహించారు. 1938 లో రాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులు, 1938లో పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు; ఎ.ఐ.సి.సి. సభ్యులు; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి ఈ విధంగా అటు జాతీయోద్యమంలోను, ఇటు రైతు ఉద్యమంలోను శ్రీ కొమ్మారెడ్డి ప్రముఖ పాత్ర వహించారు.

1929-30 లో తీవ్రమైన ఆర్థికమాంద్యం వచ్చి ధాన్యం ధరలు విపరీతంగా పడిపోయాయి. రైతాంగం దివాళా తీసి పన్నులు కూడా కట్టలేక ఋణాలు తీర్చలేక పెద్ద ఎత్తున భూములు అమ్ముకునే స్థితిలో పడ్డారు. వడ్డీవ్యాపారులు, షావుకార్లు భూములు కారుచౌకగా కొనివేశారు. ఇట్టి పరిస్థితుల్లో 1931లో ఎకరాకు రూ. 5/- వుండే నీటు తీరువా రేటును కృష్ణా ఉభయ గోదావరి జిల్లాలో రూ. 6.40 గా ప్రభుత్వము నిర్ణయించింది. అసలే ధాన్యం ధరలు పడిపోయి గోడుగోడు మంటున్న రైతాంగం రూపాయికి మూడు అణాలు అధికం చేసే ఈ రీసెటిల్‌మెంట్ పన్ను రేటు గోరుచుట్టుపై రోకటిపోటువలె పడినది. అందుచే రైతాంగం ఈ రీసెటిల్‌మెంట్‌కు వ్యతిరేకంగా ఆందోళన ప్రారంభించినది. పశ్చిమగోదావరి జిల్లాలో ఈ ఆందోళనకు శ్రీ దండు నారాయణరాజు, శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, శ్రీ మాగంటి బాపినీడు తదితరులు నాయకత్వం వహించారు. ఈ ఆందోళన ఉద్యమంలో శ్రీ కొమ్మారెడ్డి వీరందరితో పాటు అరెస్టు అయి జైలుశిక్ష అనుభవించారు. రీసెటిల్‌మెంట్ విధింపును తాత్కాలికంగా అయినా ప్రభుత్వం వాయిదా వేసుకోవలసి వచ్చింది.

1935 లో పశ్చిమగోదావరి జిల్లా రైతుసంఘం విశాల ప్రాతిపదికపై పునర్ నిర్మించబడినది. అధ్యక్షులుగా శ్రీ కొమ్మారెడ్డి కార్యదర్శిగా శ్రీ కలిదిండి సుబ్రహ్మణ్యంగార్లు ఎన్నుకోబడ్డారు. 1937 వరకు వీరే ఆ స్థానాలలో ఉన్నారు.

## రుణ విమోచన చట్టం కొరకు ఆందోళన

ఆర్థికమాంద్యం ఫలితంగా రైతాంగం రుణాలపాలై భూములను అమ్ముకొనుచున్న పరిస్థితుల్లో రైతాంగాన్ని రక్షించడానికి జరిగిన రుణవిమోచన పోరాటానికి శ్రీ కొమ్మారెడ్డి తదితరులు నాయకత్వం వహించారు. 1937లో గన్నవరంలో రాష్ట్ర రైతురుణ విమోచన సభ జరిగినది. అప్పుడు రాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులుగా వున్న శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా ఉన్న శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, కేంద్ర అసెంబ్లీ సభ్యులు శ్రీ గద్దె రంగయ్యనాయుడు, జమీన్ రైతు పత్రిక సంపాదకుడు శ్రీ నెల్లూరి వెంకట్రామనాయుడు శాసనసభ్యుడు శ్రీ కాట్రగడ్డ నారాయణరావు, శ్రీ బద్దిపూడి వెంకట నారాయణరెడ్డి, శ్రీ కాట్రగడ్డ మధుసూదనరావు, శ్రీ ముక్కామల నాగభూషణం మున్నగువారు పాల్గొన్నారు. రుణభారం నుండి రైతాంగాన్ని విముక్తి చేయాలని ప్రధాన తీర్మానం చేశారు. ఈ ఆందోళన ఫలితంగానే నాటి మద్రాసు కాంగ్రెస్ ప్రభుత్వం రుణవిమోచన చట్టం చేసింది. (మారుటోరియం) ఈ సందర్భములో మద్రాసు ప్రభుత్వం వద్దకు జరిగిన రాయబారానికి శ్రీ కొమ్మారెడ్డి నాయకత్వం వహించారు.

1938 లో నిడుబ్రోలులో జరిగిన రాష్ట్ర మహాసభలో శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి రాష్ట్ర సంఘ అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

## రైతు రక్షణ యాత్ర

1937 ఫిబ్రవరిలో మద్రాసు శాసనసభకు ఎన్నికలు జరిగినాయి. ఎన్నికలలో జమీందార్ల పార్టీ అయిన జస్టిస్ పార్టీ ఓడిపోయి కాంగ్రెస్ గెలిచింది. శ్రీ రాజగోపాలచారి ప్రధానిగా కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడింది. అంతకుముందు ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభలో రైతాంగ కోర్కెలపై ఎన్నో వాగ్దానాలు చేయబడ్డాయి. రైతాంగ కోర్కెలపై జరుగుతున్న ఆందోళనను తీవ్రతరం చేయడానికి రైతు ఉద్యమాన్ని పటిష్టంగా నిర్మించడానికి రాష్ట్రమంతటా రైతాంగ సమస్యలను పరిశీలించి అందు పై ప్రభుత్వ దృష్టిని, ప్రజల దృష్టిని కేంద్రీకరింపచేయడానికి ఒక నివేదికను సమర్పించడానికై ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం రైతు రక్షణ యాత్ర పేరిట ఒక బ్రహ్మాండమైన ప్రచార యాత్రా దళ కార్యక్రమాన్ని తలపెట్టినది. ఈ యాత్ర దళానికి శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి నాయకులుగాను, శ్రీ చలసాని వాసుదేవరావుగారు ఉపనాయకులుగాను నియమితులయ్యారు. 1937 జులై 3వ తేదీన ఆంధ్రదేశం ఉత్తర కొననున్న ఇచ్ఛాపురం నుండి ప్రారంభమైన ఈ రైతు రక్షణయాత్ర 1512 మైళ్ళు కాలినడకను, 542 మైళ్ళ బస్‌లమీద

మధ్యలో అనారోగ్యంవల్ల, వర్షాలవల్ల కొన్ని రోజులు ఆగినా, మొత్తం 130 దినములు ప్రయాణించి ఉభయ విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో సంచారం చేసి 27-3-1938 వ తేదీన మద్రాసు చేరింది. 525 గ్రామాలు స్వయంగా వెళ్ళి, దాదాపు 25,000 సంతకాలు గల 800 దరఖాస్తులు ప్రోగు చేసుకొని వచ్చినది. స్థానిక యిబ్బందులను తెలుపుతూ రైతులు పెట్టుకున్న 300 ఆర్జీలను సేకరించింది. 500 గ్రామాలలో సభలు, 60 ఫిర్కా రైతు సభలు జరిపినది. దాదాపు 4,50,000 మంది ప్రజలు ఈ సభలలో పాల్గొన్నారు. ఇది భారత స్వాతంత్ర్య సమరంలోను, భారత రైతాంగ ఉద్యమంలోను అపూర్వమైనది. మహాత్మాగాంధీ దండి, ఉప్పు సత్యాగ్రహం యాత్రతో సరిపోల్చదగినది.

## జమీందారి వ్యతిరేక పోరాటాలు

ఈ రైతు యాత్రా దళం శ్రీ కొమ్మారెడ్డిగారి నాయకత్వాన నాటి మద్రాసు శాసనసభ స్పీకర్ శ్రీ బులుసు సాంబమూర్తిగారికి సమర్పించిన మెమొరాండం రాష్ట్రములో రైతు పోరాటాలకు ముఖ్యంగా జమీందారీ వ్యతిరేక పోరాటాలకు నాంది పలికినది. జమీందారీ విధానం రద్దుకు ప్రాతిపదిక అయింది.

ఎందుకంటే ఆనాటికి ఆంధ్ర ప్రాంతములో నూటికి 40 వంతుల భూభాగం, జమీందారు, మొఖాసాదారు, ఈనాందార్ల క్రింద ఉండేది. వీరి పీడన క్రింద రైతాంగం కృంగి కృశించి పోవుచున్నది. ఆంధ్ర రాష్ట్ర రైతురక్షణ యాత్ర వీరిని మేలుకొలిపి పోరాటాలకు సన్నద్ధం చేసింది.

రైతు రక్షణయాత్ర తరపున ఈ మెమొరాండం అనంతరమే నాటి రెవిన్యూ మంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి ఆధ్వర్యంలో జమీందారీ విచారణ కమిటీ నియమించబడింది. ఈ కమిటీ జరిపిన విచారణ జమీందారీ రైతాంగంలో గొప్ప ఉత్సాహాన్ని, సంచలనాన్ని కలిగించినది. ఈ విచారణలో లక్షలాది రైతాంగాన్ని సమీకరించిన ఆంధ్ర రాష్ట్ర రైతునాయకులుగా శ్రీ కొమ్మారెడ్డి అపూర్వమైన పాత్ర వహించారు. రాష్ట్ర రైతుసంఘం తరపున జరిగిన రైతురక్షణ వారోత్సవములో రాష్ట్రమంతటా లెక్కలేనన్ని రైతుసభలు, ప్రదర్శనలు జరిగాయి. మునగాల, వెంకటగిరి, చల్లపల్లి, కాళీపట్నం, మందాసా మున్నగు బ్రహ్మాండమైన జమీందారీ వ్యతిరేక పోరాటాలు జరిగాయి. ఈ పోరాటాలన్నింటికి శ్రీ కొమ్మారెడ్డి గొప్ప స్ఫూర్తి నిచ్చారు.

ఈ పోరాటాల ఫలితంగా చివరకు మద్రాసు శాసనసభలో 1939 లో ఎస్టేట్‌లాండ్ రెవెన్యూ బిల్లు ప్రవేశపెట్టబడినది. చివరకు 1947 లు స్వాతంత్ర్యానంతరం 1948 లో జమీందారీలు శాశ్వతంగా రద్దు చేయబడ్డాయి.

భారత స్వాతంత్ర్య సమరంలోను, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు పునాదులుగా వున్న ఫ్యూడల్ జమీందార్ల వ్యతిరేక పోరాటంలోను శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు తమ యావత్తు జీవితాన్ని ధారపోశారు. నిరాడంబర దేశభక్తుడు, నిస్వార్థ ప్రజాసేవకుడైన శ్రీ కొమ్మారెడ్డి, సత్యనారాయణమూర్తిగారు గాంధీజీ బోధనలను అనుసరించి స్వయంగా తమ కుటుంబము వారు ఇచ్చిన అప్పులను రద్దుచేసి రుణపత్రాలను రైతుకూలీలకు వాపసు ఇచ్చి గొప్ప ఆదర్శం నెలకొల్పారు.

రాష్ట్ర కాంగ్రెస్ సహాయ కార్యదర్శిగా పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగాను పనిచేసి ఎంతో క్రమశిక్షణ, కట్టుబాటులతో మెలగుతూ ప్రతి పైసా కూడా జమా ఖర్చులు వ్రాస్తూ తన స్వంత ఖర్చులు తానే భరిస్తూ ప్రజా జీవితములో ఎన్నో ఉన్నత ప్రమాణాలను నెలకొల్పి అందరి ఆదర అభిమానాలను పొందారు.

తాను ధనికరైతు కుటుంబం నుండి వచ్చి కూడా నిరాడంబరత్వంతో జీవితము గడిపారు. తోటి ప్రజా సేవకులపట్ల ఆదర అభిమానాలు కలిగి వారి కష్ట సుఖములలో పాలు పంచుకుంటూ ఉత్తమ మానవతావాదిగా, గొప్ప దేశభక్తునిగా ఆదర్శవంతమైన జీవితం గడిపారు.

ఈ విధంగా కొమ్మారెడ్డి సత్యన్నారాయణమూర్తిగారు స్వాతంత్ర్య సమరంలో అంతర్భాగంగా సాగిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో అజరామరమైన పాత్ర వహించారు. అంతేకాదు స్వాతంత్ర్య సాధనతోపాటు భారతదేశంలో రైతు కూలీ రాజ్యం ఏర్పడవలెనని. సామ్యవాద వ్యవస్థ ఏర్పడనిదే దేశంలో దారిద్ర్యం, ఆర్థిక సాంఘిక అసమానతలు తొలగవని శ్రీ కొమ్మారెడ్డి సత్యన్నారాయణమూర్తిగారు వివిధ రాష్ట్ర రైతు మహాసభలలో రాజకీయ మహాసభలలో ఎలుగెత్తి చాటారు. కార్మికులు కర్షకులు కరము కరము కలిపి సమ సమాజస్థాపనకోసం పోరాడాలని ఆయన ఉద్ఘాటించారు. గాంధీజీ ఆశయాలతో స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించిన శ్రీ కొమ్మారెడ్డి సత్యన్నారాయణమూర్తిగారు ఆ తరువాత సోషలిజం ఆశయాలలో కూడా ప్రభావితులై తన యావజ్జీవితాన్ని రైతు కూలీ ఐక్యతకోసం, కార్మిక కర్షక రాజ్యస్థాపన లక్ష్యంకోసం ధారపోసి 1940 ఏప్రిల్ 19వ తేదీన39 ఏళ్ళ చిన్నవయసులోనే కన్నుమూశారు.

ఈ వర్ధంతి సభల ద్వారా వారి ఉన్నతాదర్శాలను సంస్మరించుకొని స్ఫూర్తి పొందడం వారి ఆశయాల సాధనకు పునరంకితం కావడం మన అందరి కర్తవ్యం.

- పంకాల పట్టాభిరామారావు

# నిస్వార్థ ప్రజాసేవకుడు - రైతు నాయకుడు
# కామ్రేడ్ చలసాని వాసుదేవరావు

(కీర్తిశేషులు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు చరిత్రాత్మక రైతురక్షణ యాత్రకు నాయకుడు. కాగా ఉపనాయకుడు కీర్తిశేషులు చలసాని వాసుదేవరావుగారు. వీరిద్దరి రథసారథ్యంలోనే ఈ యాత్ర జయప్రదం అయింది. 1940 లోనే కొమ్మారెడ్డి సత్యనారాయణగారు మరణించారు. ఆ తరువాత కాలంలో రైతు ఉద్యమ భారాన్ని మోస్తూ బాధ్యతలను కొనసాగించిన వాసుదేవరావుగారు 1986 జనవరి 22న శాశ్వతంగా కన్ను మూసారు. వారి జీవిత విశేషాలలోని కొన్ని ముఖ్య ఘట్టాలను ఈ వ్యాసంలో పొందుపర్చుతున్నాను. - వై.వి. కృష్ణారావు.)

కామ్రేడ్ చలసాని వాసుదేవరావుగారు 1913 లో కృష్ణాజిల్లా భట్ల పెనుమర్రు గ్రామంలో జన్మించారు. బందరు హిందూ హైస్కూలులో ఉన్నత విద్య అభ్యసించారు. 1928 లో కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావుగారితో పరిచయం ఏర్పడింది. చంద్రశేఖరరావుగారు చెప్పిన రాజకీయాలతోనూ, కామ్రేడ్ వాసుదేవరావుకు రాజకీయాలలో ఆసక్తి కలిగింది. హైస్కూలు విద్య పూర్తి అయిన తరువాత 1929 లో వాసుదేవరావు బందరులో, నోబుల్ కళాశాలలోనూ చేరడం జరిగింది. సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా దేశమంతటా బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరుగుతున్న రోజులలో బందరులో కూడా ఒక ప్రదర్శన జరిగింది. ఆనాటి ప్రదర్శనలో కామ్రేడ్ వాసుదేవరావు కూడా పాల్గొనటం జరిగింది.

1930 లో భారత జాతీయ కాంగ్రెస్ ఉప్పు సత్యాగ్రహానికి పిలుపునిచ్చింది. మహాత్మాగాంధీ సబర్మతీ ఆశ్రమం నుండి దండి ఉప్పు సత్యాగ్రహానికి బయలుదేరారు. దేశమంతటా ఉప్పు సత్యాగ్రహ పోరాటం ప్రారంభమైంది. కామ్రేడ్ వాసుదేవరావు తన చదువుకు స్వస్తి చెప్పి తన స్థానం దేశ స్వాతంత్ర్య పోరాటంలో అని నిర్ణయించుకొన్నాడు. తన స్వగ్రామం భట్ల పెనుమర్రు వచ్చాడు.

అప్పటికే భట్ల పెనుమర్రులో శ్రీ కామినేని వెంకటప్పయ్యగారి ఆధ్వర్యంలో కాంగ్రెస్ వాలంటీర్ల శిబిరం ఏర్పడింది. కల్లు దుకాణం వద్ద వాలంటీర్ల పికెటింగులో పోలీసుల అమానుష లాఠీఛార్జీలు, అరెస్టులు ముమ్మరంగా సాగుతున్నాయి. గాయపడిన వాలంటీర్లకు వైద్య సహాయాన్ని, ఆహారాన్ని అందజేయటం, ఇతర పరిచర్యలు చేయడం మొదలగు పనులలో, గ్రామంలోని ఇతర మిత్రులతో పాటు వాసుదేవరావు నిమగ్నమయ్యారు. ఆ సత్యాగ్రహ పోరాటంలోనే ఆ గ్రామవాసులైన అమరజీవి చలసాని జగన్నాథరావు, శ్రీయుతులు చలసాని ప్రకాశరావు, చలసాని నారాయణమూర్తి, దేవినేని భీమయ్య, చలసాని సీతారామయ్య మొదలగువారిని అరెస్టు చేసి రాజమండ్రి బళ్ళారి జైళ్ళకు తీసుకెళ్ళారు.

రాజమండ్రి జైళ్ళలో నిర్బంధించబడ్డ చలసాని జగన్నాథరావు, చలసాని ప్రకాశరావు గార్లకు లాహోర్ కుట్రకేసు ముద్దాయిలైన విజయకుమార్ సిన్హా, భట్‌కేసర్ దత్తు, జయదేవ్ కపూర్‌లాంటి విప్లవకారులతో సాన్నిహిత్యం ఏర్పడటం, జగన్నాధరావు సోషలిస్టు గ్రంధాలను చదువవలసిందిగా వాసుదేవరావుకు ఉత్తరాలు రాయడంతో ఆయనకు ఈ సాహిత్యంలో ఆసక్తి కలిగి వీనిని చదువటం జరిగింది.

గ్రామంలోని ఇతర కాంగ్రెస్ వాలంటీర్లతోపాటు వాసుదేవరావుగారు అస్పృశ్యత నివారణకు, దేవాలయాలలో హరిజనుల ప్రవేశానికి ప్రచారం చేశారు. వయోజన పాఠశాల నిర్వహణలో పాల్గొనేవారు.

ఆ రోజులలోనే పూనా నుండి వెలువడే ఒక ఆంగ్ల దినపత్రికలో డాంగే వ్రాసిన "గాంధీ మరియు లెనిన్" అనే పుస్తక ప్రకటన వచ్చింది. దానిని చూచిన వాసుదేవరావు ఆ పుస్తకాన్ని సంపాదించి దీనిని చదువటంతో మార్క్సిజం - లెనినిజం సిద్ధాంతంతో పరిచయం కలిగింది. దానితో వాసుదేవరావుకు సిద్ధాంత అధ్యయనం పట్ల ఆసక్తి ఎక్కువైంది.

1934 లో శ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణరావుగారు బెనారస్ నుండి తీసుకొచ్చిన సోషలిస్టు సాహిత్యాన్ని కామ్రేడ్ వాసుదేవరావుకు యివ్వడంతో వాటిని కూడా ఆయన చదివారు.

అప్పటికే మద్దుకూరి చంద్రశేఖరరావు, కొసరాజు శేషయ్య, కానూరు బలరామయ్య ప్రభృతులు జైళ్ళలో కమ్యూనిస్టు భావాలు ఆకళింపు చేసుకొని విడుదలై రావడం అటు తర్వాత వారు భట్ల పెనుమర్రుతో సంబంధాలు పెట్టుకోవడం జరిగింది. 1934లోనే కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారితో వాసుకు పరిచయం ఏర్పడింది.

1934లో కల్వపూడి గ్రామంలో కమ్యూనిస్టు భావాలు కల యువకుల సమావేశం జరిగింది. దానిలో కామ్రేడ్ వాసుదేవరావు కూడా పాల్గొన్నారు.

ఆ దిశలోనే పాలఫీర్డింగ్ వ్రాసిన "సామ్రాజ్యవాదం" అనే ఆంగ్ల గ్రంథాన్ని వాసు తెలుగులోకి అనువదించారు. అది వెంటనే అచ్చు అయింది కూడానూ.

1936 లో జనవరి 29న కాకినాడలో జరిగిన కమ్యూనిస్టు ప్రథమ మహాసభకు కామ్రేడ్ వాసుదేవరావు హాజరయ్యారు. ఆ మహాసభలో పోలే పెద్ది నరసింహామూర్తి కార్యదర్శిగా వారితో ఏర్పడిన కమిటీలో వాసుదేవరావుగారు ఒకరు.

ఆ ఏడాదిలోనే నిడుబ్రోలులో జరిగిన ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభలో వాసుదేవరావు సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. 1937 లో నిడుబ్రోలులోనే జరిగిన ఆంధ్ర రాష్ట్ర రైతు మహాసభలో కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు అధ్యక్షులుగానూ, వాసుదేవరావుగారు ప్రధాన కార్యదర్శిగానూ ఎన్నుకోబడ్డారు.

## చరిత్రాత్మక రైతు యాత్ర

1937 ఫిబ్రవరిలో మద్రాస్ శాసనసభకు ఎన్నికలు జరిగాయి. ఫెయిజ్‌పూర్ మహాసభలో జాతీయ కాంగ్రెస్ ప్రకటించిన ప్రణాళిక రైతాంగంలో ఎన్నో ఆశలను రేకెత్తించింది. దానిలో రైతాంగ కోర్కెలపై ఎన్నో వాగ్దానాలు చేయబడ్డాయి. శాసనసభ ఎన్నికలలో జమీందార్ల పార్టీ అయిన జస్టిస్ పార్టీ మట్టి కరిచింది. కాంగ్రెస్‌కు అఖండ విజయం చేకూరింది. మద్రాస్‌లో రాజగోపాలాచారి నాయకత్వాన కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడింది.

ఈ విధంగా రాష్ట్రంలో నలుమూలల రైతాంగంలో కలుగుతున్న అపూర్వమగు సంచలనాన్ని ఏకీకృత మొనర్చి, బలమగు రైతు ఉద్యమాన్ని నిర్మించుటకు, రాష్ట్రవ్యాపిత పోరాటాలను సాగించుటకు, రాష్ట్రమంతటా నున్న రైతాంగం యొక్క కష్టాలను గూర్చి స్వయంగా పరిశీలించి, ఒక నివేదికను తయారుచేసి మంత్రివర్గానికి సమర్పించుటకు రాష్ట్ర, రైతురక్షణ యాత్ర నిర్వహించడానికి నిశ్చయింపబడింది. ఈ యాత్రాదళమునకు నాయకుడుగా కీ.శే. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, ఉపనాయకుడుగా కామ్రేడ్ చలసాని వాసుదేవరావు నియుక్తులైనారు. ఈ యాత్రాదళం ఆంధ్రదేశం ఉత్తరకొనసనున్న ఇచ్ఛాపురం నుండి 1937 జూలై 3న బయలుదేరి, కాలినడకన 1512 మైళ్ళు, బస్సులమీద 542 మైళ్ళు 130 దినములు ప్రయాణం చేసి ఉభయ విశాఖ-ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో సంచారం చేసి 27-3-38న మద్రాస్‌నకు చేరుకున్నది. ఈ దళం 525 గ్రామాలు స్వయంగా వెళ్ళి దాదాపు 25,000 సంతకాలు గల 800 దరఖాస్తులను ప్రోగుచేసుకొని వచ్చింది. వీటితోపాటు స్థానిక ఇబ్బందులను గూర్చి రైతులు పెట్టుకొన్న 300 ఆర్జీలను కూడ తెచ్చింది. మొత్తం మీద 500 గ్రామాలలో సభలు 60 ఫిర్కా, తాలూకా రైతు సభలు ఈ యాత్రాదళం ఆధ్వర్యాన జరుపబడినవి. దాదాపు 4,50,000 ప్రజలు ఈ సభలకు హాజరైనారు.

## రైతాంగ పోరాటాలు

రైతు రక్షణ యాత్ర అనంతరం రైతాంగంలో కల్గిన గొప్ప సంచలనం చైతన్యం అనేక ప్రత్యక్ష పోరాటాల రూపం తీసుకొంది. తత్ఫలితంగా రాష్ట్రంలో మునగాల జమీందారీ వ్యతిరేక పోరాటం, వెంకటగిరి రాజా వ్యతిరేక పోరాటం, చల్లపల్లి జమీందారీ వ్యతిరేక పోరాటం, అలాగే కాశీపట్నం, పిఠాపురం, మందసా జమీందారీ, ఈనాందారీ వ్యతిరేక పోరాటాలు జరిగాయి. వీటి ప్రధానోద్దేశ్యం జమీందారీ భూస్వామ్య దోపిడీని అంతంచేసి, రైతాంగానికి భూమిపై జిరాయితీ హక్కును కల్పించటం, రాష్ట్రం మొత్తంమీద ఒకే రకమైన రైతువారీ వ్యవస్థను నెలకొల్పటం కనుకనే ఇది జాతీయ పోరాటంగా రూపుదిద్దుకొన్నాయి. ఈ పోరాటాలలో కమ్యూనిస్టు పార్టీ గర్వించదగిన పాత్ర వహించింది. ఆ విధంగా కమ్యూనిస్టు పార్టీ పట్టణాలలోని కార్మికులలోనే కాకుండా గ్రామీణ రైతాంగంలో కూడా పలుకుబడి గలిగిన శక్తిగా అవతరించింది.

చల్లపల్లి జమీందారుకు వ్యతిరేకంగా వివిధ దశలలో జరిగిన పోరాటాలలో వాసుదేవరావు ముఖ్య పాత్ర వహించాడు. అలాగే మునగాల మొదలగు జమీలలో ఉవ్వెత్తుగా వచ్చిన రైతు పోరాటాలలో వాసు నాయకత్వ పాత్ర వుంది. కృష్ణా, ఈస్టుబ్యాంకు కాల్వ క్రిందకు వచ్చిన ఆయకట్టు తూములపైన ప్రభుత్వం విధించిన నజరానాకు వ్యతిరేకంగా ఉద్యమంలో కామ్రేడ్ వాసుదేవరావుగారు పాల్గొన్నారు.

1939లో కూడా ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘానికి వాసుదేవరావు, ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. కానీ క్షయవ్యాధి రావడంవల్ల దాని చికిత్సతో వెళ్ళుతూ ఆ పదవికి రాజీనామా యివ్వడం జరిగింది.

1938 జూన్‌లో విజయవాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర రెండవ మహాసభలో విజయవాడ లోనే 1943 జూలైలో జరిగిన 3వ రాష్ట్ర కమ్యూనిస్టు మహాసభలోనూ కామ్రేడ్ వాసుదేవరావుగారు రాష్ట్ర కమిటీ సభ్యులుగా ఎన్నికయ్యారు. 1943లో ప్రారంభించబడిన ప్రజాశక్తి, వారపత్రికకు కొంతకాలం సంపాదక వర్గ సభ్యుడుగా పనిచేశారు.

1942 ఆగష్టు ఘటనల తర్వాత దేశంలో అరెస్టులు, లాఠీచార్జీలు, కాల్పులు, ప్రజలపై సమిష్టి జరిమానాలు విచ్చలవిడిగా కొనసాగాయి. ఆనాడు రైతుసంఘాలు ప్రజల మధ్యన వుండి చేయవలసిన కర్తవ్యాలెన్నో వున్నాయి. కాని యిట్టి సందర్భంలోనే అక్టోబరులో నిడుబ్రోలులో సమావేశమైన రాష్ట్ర రైతు కార్యవర్గ సమావేశంలో ఆచార్య రంగావారి అనుచరులు రైతుసంఘాల అవసరం లేదని ప్రకటించి, రాష్ట్రజిల్లా సంఘాలన్నింటిని రద్దు చేశారు.

ఆ పరిస్థితిలో అఖిల భారత రైతుసంఘ అధ్యక్షులైన స్వామీ సహజానంద సరస్వతి రాష్ట్ర సంఘానికి కామ్రేడ్ వాసుదేవరావుగారిని ఆర్గనైజరుగా నియమించి, రైతుసంఘాన్ని పునర్నిర్మించాలని కోరటం జరిగింది.

ఆరోగ్యం అంతా బాగుగా లేకున్నను ఆ గురుతరమైన బాధ్యతను కామ్రేడ్ వాసు చాలా సమర్ధతతో నిర్వహించారు. ఒక నెలరోజులలోనే 11 జిల్లాలలోనూ రైతుసంఘాలలోను నిర్మించడం జరిగింది. 55,000 మంది రైతాంగాన్ని సంఘ సభ్యులుగా చేర్చటం జరిగింది.

## విజయవాడ అఖిల భారత రైతు మహాసభ

1944లో అఖిల భారత రైతు మహాసభ విజయవాడలో జరిగింది. మహాసభ ఆహ్వాన సంఘానికి వాసుదేవరావు ప్రధాన కార్యదర్శి. ఈ మహాసభకు మద్రాస్ ప్రభుత్వం ఒకవైపు అనేక యిబ్బందులు కలుగజేసింది. రెండవవైపున కాంగ్రెస్ నాయకులు కొందరు కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా కాంగ్రెస్‌వారిని రెచ్చగొట్టి ఈ మహాసభను చెడగొట్టాలని చూడటం జరిగింది. ఈ అడ్డంకులన్నింటిని ఎదుర్కొని లక్షమంది స్త్రీ, పురుషులను దీనికి సమీకరించడంలోనూ, మహాసభను అన్నివిధాలా జయప్రదం చేయడంలోనూ కామ్రేడ్ వాసుదేవరావుగారి పాత్ర ఎంతో వుంది.

నైజాం పాలనకు వ్యతిరేకంగా సాగిన తెలంగాణా సాయుధ పోరాటంలో కామ్రేడ్ వాసుదేవరావు పాల్గొన్నారు.

## అజ్ఞాతవాసం

1939 లో ప్రారంభమైన రెండవ ప్రపంచ యుద్ధకాలంలోనూ, 1947లో ప్రకాశం ఆర్డినెన్స్ కాలంలోనూ, తిరిగి 1948-51 మధ్య కమ్యూనిస్టు పార్టీపై సాగిన అమానుష నిర్బంధ విధాన కాలంలోనూ, వాసుదేవరావుగారు అజ్ఞాతవాసాన్ని గడిపారు.

## విశాలాంధ్ర సంస్థలు

1964 లో కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక వచ్చింది. ఆ ఒడిదుడుకుల సమయంలో వాసుదేవరావు విశాలాంధ్ర జనరల్ మేనేజరుగా వుండి, ఆ సంస్థల నిర్వహణకు దీక్షతో పనిచేశారు. అటు తర్వాత విశాలాంధ్ర విజ్ఞానసమితి కోశాధికారిగా పనిచేశారు.

## పుస్తక రచన

వాసుదేవరావు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ సంక్షిప్త చరిత్రతోపాటు, రైతాంగ సమస్యలపైన కొన్ని గ్రంథాలు, పలు వ్యాసాలు రచించారు. ఆరోగ్యం బాగుండనందున కొంతకాలంగా వారి స్వగ్రామం భట్ల పెనుమర్రులోనే వుంటున్నారు.

5 దశాబ్దాలు కమ్యూనిస్టు పార్టీలోనూ, రైతాంగసేవలోనూ, బహుముఖ సేవచేసిన కామ్రేడ్ వాసు 1986 జనవరి 22వ తేదీ సాయంకాలం శాశ్వతంగా కన్నుమూశారు. వీరికి భార్య, కుమారుడు, కోడలు, మనుమలు, మనుమరాండ్రు వున్నారు.

వాసుదేవరావు సరళ హృదయులు, నిరాడంబర వ్యక్తి వినమ్రత వీరి సొత్తు, తీసుకొన్న బాధ్యతపై కేంద్రీకరించి పనిచేయడం ఆయన విశేష లక్షణం.

23వ తేదీన జరిగిన వాసుదేవరావుగారు అంత్యక్రియలలో భారత కమ్యూనిస్టు పార్టీ నాయకులు, మార్క్సిస్టు పార్టీ నాయకులు, రైతు వ్యవసాయ కార్మికసంఘాల నాయకులు, పలువురు స్వతంత్ర యోధులు దివి తాలూకా నుండి వచ్చిన అనేకమంది ముఖ్యులు పాల్గొన్నారు.

- శ్రీ వై.వి. కృష్ణారావు

# సంప్రదించిన గ్రంథాలు

కృష్ణారావు వై.వి. : ఆంధ్రప్రదేశ్‌లో స్వాతంత్ర్యానికి ముందు రైతు పోరాటాలు, రైతు సంఘాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1981

కృష్ణారావు వై.వి. : ఆంధ్రప్రదేశ్‌లో రైతు ఉద్యమాలు, పోరాటాలు, రెండవ భాగం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1990

చిన్నయసూరి కొండవీటి : ఆంధ్రలో రైతు ఉద్యమం, ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం ప్రచురణ, విజయవాడ, 1986

రసూల్ ఎం.ఎ. : కిసాన్ సభ చరిత్ర, ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ, 1995

రంగా ఎన్.జి. (సం) : రైతు భజనావళి, ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం, పన్నెండవ ముద్రణ, విజయవాడ, 1949

పట్టాభిరామారావు పరకాల (సం) : స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్టు దేశభక్తులు, విశాలాంధ్ర, హైదరాబాద్, 2000

కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి 50వ వర్ధంతి సంచిక, సంస్మరణ కమిటీ, విజయవాడ, 1990

ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర 1936-42, రెండవ భాగం, విశాలాంధ్ర, విజయవాడ, 1988

జాతీయ గీతాలు, ప్రజాశక్తి ప్రచురణాలయం, విజయవాడ, 1947

**Reddy M.P.R. (ed.)** : Andhra Pradesh Historical Review, Kavati, 1985

**Sarojini Regani** : Highlights of Freedom Movement in Andhra, Hyderabad - 1972

**Venkatarangaiah M** : Freedom Struggle in Andhra Pradesh (Andhra) Vol - II (1906-1920 AD), Hyderabad, 1969

**నండూరి ప్రసాదరావు :** ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం మేనేజరుగా ఎంతోకాలం పనిచేసిన శ్రీ ప్రసాదరావు రైతుయాత్ర సందర్భంలో ఎన్నో ప్రకటనలు విడుదల చేశారు. యాత్ర పర్యటన విశేషాలను, పర్యటనలోని మార్పులను మధ్యలో యాత్ర పర్యటన షెడ్యూలును ప్రజలకు వివరించడం వంటి పత్రికా సంబంధ విధులను శ్రీ ప్రసాదరావు విడుదల చేసేవారు. కృష్ణాజిల్లా ఆరుగొలను గ్రామంలో జన్మించారు. తన మేనమామ అయ్యదేవర కాళేశ్వరరావుతో (రాష్ట్ర అసెంబ్లీ మాజీ స్పీకరు) పాటు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తరువాత భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురుల ఉరితీతపై కాంగ్రెస్ అవలంభించిన ఉదాసీన వైఖరితో కాంగ్రెస్‌పట్ల వైరాగ్యానికి బీజాలు పడ్డాయి. మెట్రిక్యులేషన్ తరువాత బందరు హిందూ కాలేజీలో ఎఫ్.ఎ. పాసయ్యారు. ఆ తరువాత బెనారస్ వెళ్ళి చంద్ర రాజేశ్వరరావు, చంద్ర రామలింగయ్య, వి.వి. రామమోహన్ (వి.వి. గిరి తమ్ముడు) ఇతర విప్లవకారులతో సంబంధాలు పెట్టుకుని కమ్యూనిస్ట్, సోషలిస్టు సాహిత్యాలను అధ్యయనం చేశారు. తిరిగివచ్చి ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపక సభ్యులుగా, రాష్ట్ర, కేంద్ర కార్యవర్గ సభ్యులుగా, రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా వుండి ఎన్నో ఉద్యమాలలో పాల్గొన్నారు. ఎన్నో సందర్భాలలో జైలుశిక్ష అనుభవించారు. రైతు యాత్రదళం పర్యటనలో ఏర్పడిన విరామాలను, పర్యటన షెడ్యూలును, విశేషాలను ఎప్పటికప్పుడు ప్రజలకు, గ్రామస్థాయి శ్రేణులకు వివరించడంలో ప్రముఖ పాత్ర వహించి రైతు యాత్ర విజయానికి అశేష కృషి జరిపారు.

**గౌతు లచ్చన్న :** రైతు రక్షణయాత్ర ప్రారంభం నుంచి చురుగ్గా పాల్గొని, యాత్రలో కొన్ని జిల్లాలు పర్యటించిన ప్రముఖ నాయకుడు సర్దార్ గౌతులచ్చన్న. ఈయన ఆగస్టు 16, 1908 లో జన్మించారు. ఎస్.ఎస్.ఎల్.సి. వరకూ విద్య నభ్యసించిన లచ్చన్న తొలిసారిగా 1948లో శాసనసభ్యులై, ప్రకాశం గోపాలరెడ్డిగార్ల మంత్రివర్గాల్లో పనిచేశారు. కొంతకాలం స్వతంత్ర పార్టీ ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ఉప్పు సత్యాగ్రహంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో, రైతు ఉద్యమాల్లో పాల్గొన్నారు. శ్రీకాకుళం జిల్లా పరిషత్‌లో, సోంపేట, మందస, బారువ పంచాయితీలలో సభ్యులు. రైతు నాయకునిగానే కాక, ఎన్నో కార్మికసంఘాలకు కూడా లచ్చన్న నాయకులు.

**ఆచార్యరంగా :** రైతు ఉద్యమానికి జాతీయ నాయకులుగా, అఖిలభారత కిసాన్ సంఘ్ అధ్యక్ష హోదాలో ఆంధ్రప్రదేశ్‌లో రైతురక్షణ యాత్రను ప్రేరేపించి, స్వాగతించిన నాయకుడు ఎన్.జి. రంగా 1900 సంవత్సరం నవంబర్ 7వ తేదీన నిడుబ్రోలులో జన్మించారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో పిహెచ్.డి. పొందారు. మద్రాసు పచ్చయ్యప్ప కాలేజీలో ఆర్థికశాస్త్ర ప్రధాన అధ్యాపకులుగా పనిచేశారు. వివిధ స్వాతంత్ర్యోద్యమ ఉద్యమ సందర్భాల్లో జైలుశిక్ష అనుభవించారు. 1930, 45 లలో కేంద్ర శాసనసభకు 1952 నుండి ఎంతోకాలం పార్లమెంట్ సభ్యులుగానూ పదవిలో వున్నారు. 1946-48 మధ్య ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వుండి అనంతరం స్వతంత్ర పార్టీ స్థాపించారు. వివిధ పత్రికలు స్థాపించడమేకాక, ఎన్నో గ్రంథాలు

రచించారు. ఆయన మరణానంతరం రైతు ఉద్యమానికి ఆయన జరిపిన కృషికి చిహ్నంగా, రాష్ట్రప్రభుత్వం వ్యవసాయ విశ్వవిద్యాలయానికి ఆయన పేరు పెట్టింది.

**భారతీదేవి రంగా :** శ్రీ ఎన్.జి. రంగాగారి సహధర్మచారణి. రంగా ప్రభావంతో ఉత్తేజితులై స్వాతంత్ర్యోద్యమంలోను, రైతు ఉద్యమంలోనూ పాల్గొన్నారు. 1931లో తెనాలి పికెటింగ్ సమయంలో మహిళా శిబిర అధ్యక్షురాలు. 1932 లో జైలు కెళ్ళారు. 1947లో మద్రాసు రాష్ట్ర విద్యాసలహాసంఘం, 1953లో అఖిలభారత మహిళా పొదుపు సంఘం, 1952లో రాష్ట్ర కరువు నివారణసంఘం మొదలైనవాటిలో సభ్యురాలు. 1954లో ఆంధ్రరాష్ట్ర మహిళాసభ అధ్యక్షులు. రంగాతోపాటు ఈమె ఎన్నో సందర్భాల్లో రైతు రక్షణయాత్ర దళంలో పాల్గొని కొన్ని ప్రాంతాలు పర్యటించారు. ముఖ్యంగా శ్రీకాకుళం, పశ్చిమగోదావరి, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో యాత్రాదళంతో ఎన్నో ప్రాంతాలు పర్యటించారు. 1975లో ఈమె మరణించారు.

**వావిలాల గోపాలకృష్ణయ్య :** గుంటూరు జిల్లాలో రైతుయాత్ర దళంతో పాటు, యాత్రాదళ ప్రవేశానికి పూర్వం జరిగిన ప్రచారంలోను శ్రీ వావిలాల చురుకుగా పాల్గొన్నారు. ప్రముఖ గాంధేయవాది. స్వాతంత్ర్యోద్యమం, రైతు ఉద్యమం, గ్రంథాలయ ఉద్యమం, సారా వ్యతిరేక ఉద్యమాల్లో పాల్గొన్నారు. 1906 లో జననం. 1926-35 లో 'విద్యార్థి', 'జ్యోతి' పత్రికలకు సంపాదకులు. 29-32 లో ఆంధ్ర పత్రిక సంపాదకులు. 1952 లో మద్రాసు శాసనసభ్యులు.1955, 57, 62, 67 లలో ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులు. ఆంధ్రప్రదేశ్ ద్రవ్యస్థితి, పరిపాలన సంస్కరణలు, సంస్థానాలు, ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలపై గ్రంథ రచనలు చేశారు. 1955లో ఆంధ్ర రాష్ట్ర గ్రంథాలయశాఖ అధ్యక్షులుగా, ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్ సభ్యులుగా ఉన్నారు. 1952లో ప్రపంచశాంతి మహాసభ ప్రతినిధి. అధికార భాషా సంఘం అధ్యక్షులు 1990వ దశకంలో జరిగిన సారా వ్యతిరేక ఉద్యమంలో పాల్గొని రాష్ట్ర ఎక్సైజ్ విధానాన్ని ప్రభావితం చేశారు. ప్రస్తుతం గుంటూరు జిల్లాలో విశ్రాంతి తీసుకుంటున్నారు.

## రైతుయాత్ర ప్రముఖ నాయకులు

ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘం 1937 జూలై 3వ తేదీనుండి రైతు రక్షణయాత్ర పేర ఇచ్ఛాపురం నుండి మద్రాసువరకు 130 రోజులపాటు 1512 మైళ్ళు కాలినడకన, 152 మైళ్ళు బస్‌లపైన సాగించిన బ్రహ్మాండమైన యాత్రలో సుమారు 4,50,000 మంది సమీకృతులయ్యారు. వీరిలో ఆ యా జిల్లాల్లో ప్రధానంగా పాల్గొన్నవారి పేర్లను కింది విధంగా పేర్కొనవచ్చు. అయితే ఈ పేర్కొన్న పేర్లు లభ్యమైన సమాచారం ఆధారంగా మాత్రమే జరిగింది. ఇవేకాక వేలాది, వందలాదిమంది నాయకులు కూడా పాల్గొనడం జరిగింది.

**యాత్రలో ఎక్కువ ప్రాంతాలు పర్యటించిన నాయకులు :** కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తి, చలసాని వాసుదేవరావు, గౌతు లచ్చన్న, పుల్లెల శ్యాంసుందరరావు, ఎన్.జి. రంగా,

భారతీదేవి రంగా, నెల్లూరు వెంకట్రామనాయుడు, చుండి జగన్నాథం, నండూరి ప్రసాదరావు, పిన్నమనేని సీతారామయ్య, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ, వావిలాల గోపాలకృష్ణయ్య, గొట్టిపాటి బ్రహ్మయ్య మొదలైనవారు.

**దక్షిణ విశాఖ, శ్రీకాకుళం జిల్లా నాయకులు :** బెందాళం గవరయ్య, గేదెల చంద్రయ్యనాయుడు, బల్లితల్లి అప్పలనాయుడు, దుక్కా సూర్యనారాయణరెడ్డి, అప్పలస్వామి, దుర్లభోషాహు, మార్పు పద్మనాభం, గాణగుల తరుణాచారి, జి.బి. అప్పారావు, చీకటి పరశురాముడు, కూనిశెట్టి వెంకటనారాయణ, గొర్లె సూర్యనారాయణ, హరికృష్ణచౌదరి, శిల్లా రాజులు రెడ్డి (పాటల రచయిత), నిబాను నరసింహమూర్తి. పి. పుండరీకాక్ష చారి, గొర్రెల సూర్యనారాయణ, చెలికాని చినరంగ నాయకులు, కవికుమార్, కోలా సన్యాసిరావు, వాడపల్లి సూర్యనారాయణరాజు, జొన్నలగడ్డ రామలింగయ్య, చుండి జగన్నాథం, అట్లూరి అప్పారావు.

**తూర్పుగోదావరి జిల్లా నాయకులు :** శ్రీయుతులు ఇనుగంటి నారాయణరావు, చింత సత్యనారాయణదాసు, పెన్మత్స అనంతం, పెన్మత్స సత్యనారాయణరాజు, శ్రీపాద రామచంద్రరావు, (పెద్దాపురం) సుబ్బారాయుడు, తోట సుబ్బారావు, రావు జగ్గారావు, మొగలి సూర్యారావు, కృష్ణమాచారి, ఆవంత్స సోమసుందర్, అచ్చన్న, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), గాదిరాజు రామరాజు, మహీధర రామమోహనరావు, జగన్మోహనరావు, మొసలికంటి తిరులమరావు.

**పశ్చిమగోదావరి జిల్లా నాయకులు :** మూల్పూరి రంగయ్య, చుక్కమ్మ, అల్లూరి సత్యనారాయణ, గొట్టుముక్కల వెంకట్రామరాజు, కొవ్వూరు గోపాలరావు, మాగంటి బాపినీడు, దండు నారాయణరాజు, కలిదిండి సుబ్రహ్మణ్యం, గారపాటి సత్యనారాయణ, ఉద్దరాజు రామం, కందికొండ బుల్లిరాజు, శ్రీ భావనాచారి, దంకినేని సత్యనారాయణ, తణికెళ్ళ వెంకటచలపతి, భూపతిరాజు లక్ష్మీనరసరాజు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, ఇరటూరి శరభరాజు, గుండుకృష్ణమూర్తి, పేడేటి వెంకటరత్నం, అన్నే వెంకటేశ్వరరావు, మునిరత్నం, సత్తిరాజు అచ్చుతరామయ్య, ఇందుకూరి సుబ్బరాజు, నల్లపరాజు భాస్కరరాజు, యాళ్ళబండి రంగనాయకులు, కలిదిండి సూర్యనారాయణరాజు, శ్రీ సంకు అప్పారావు, పసల సత్యనారాయణ, వెలమాటి రామచంద్రరావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, రేలంగి సోమరాజు, వింఝూ సుబ్బారావు, వెంకన్న, పుసులూరి కోదండరామయ్య, వెలగల వీరిరెడ్డి, సత్యనారాయణ రెడ్డి, దండు వెంకటరాజు, దండు సుబ్బరాజు, దండు జగన్నాథరాజు, రామరాజు, గుడిమెట్ల చినసత్యం (మేడపాటి సత్తిరెడ్డిగారి మనమడు) గుడిమెట్ల బాపిరెడ్డి, కోసూరి సుబ్బరాజు, సూరపరాజు, పేరేప మృత్యుంజయుడు, పెన్మత్స సుబ్బరాజు, దండు ఎర్రగోపాలరాజు, మేడపాటి సత్యం, పరకాల పట్టాభి రామారావు మొదలైనవారు వేగుంట కనక రాంబ్రహ్మం.

**కృష్ణాజిల్లా నాయకులు :** పేట బాపయ్య, మాగంటి అంకినీడు, ముక్కామల నాగభూషణం, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, పిన్నమనేని శీతారామయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, తాతినేని ప్రకాశరావు, పొన్నం వీరరాఘవయ్య, కాట్రగడ్డ మధుసూదనరావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, నూకల వీరరాఘవయ్య (శ్రీమతే), మురుకుంట్ల వెంకటప్పయ్య, సుంకర వీరభద్రరావు, సుంకర సత్యనారాయణ, సూర్యనారాయణ, మారేపల్లి సుబ్బారావు, నండూరి ప్రసాదరావు, వెల్లంకి విశ్వేశ్వరరావు, అనుమర్లపూడి సీతారామారావు, కాట్రగడ్డ నారాయణరావు, అన్నే అంజయ్య, ఎ. బోధాయన, సూరపనేని గోపాలకృష్ణయ్య, గుండం గురవయ్య, మోదుమూడి శ్రీహరిరావు, వై.వి. కృష్ణారావు.

**గుంటూరుజిల్లా నాయకులు :** ఎన్.జి. రంగా, భారతీదేవి, వావిలాల గోపాలకృష్ణయ్య, డా॥ సీతారామశాస్త్రి, మాదల వీరభద్రరావు, కల్లూరి సుబ్బయ్య, జానంగుని శేషగిరిరావు, దర్శి లక్ష్మయ్య, ఆమంచి నరసింహారావు, పెదవల్లి శ్రీరాములు, బాలకోటిరెడ్డి, వీరారెడ్డి, రావిపాటి సుబ్బయ్య, దాట్ల గురవరాజు, ఎంద్రెడ్డి రామిరెడ్డి, శాఖమూరి అప్పయ్య, బాచిన సుబ్బారావు, కర్ణా కోటిరెడ్డి, వావిలాల వీరభద్రరావు, అమరవాది కృష్ణమూర్తి, ఆమంచి నరసింహారావు, గోగినేని నారాయణ.

**నెల్లూరుజిల్లా :** నెల్లూరి వెంకట్రామనాయుడు, బస్వారెడ్డి శంకరయ్య, దువ్వూరి బలరామిరెడ్డి, రావి ఆదిశేషయ్య, చీళ్ళ గురునాథం, బద్దిపూడి వెంకటనారాయణరెడ్డి, గద్దే రంగయ్యానాయుడు, రంగరాజు, పుచ్చలపల్లి సుందరయ్య, పాములపాటి బుచ్చినాయుడు, ముంగమూరి వెంకురెడ్డి, పి. శివయ్య, పి.వి. శివయ్య, అల్లూరి రంగయ్య, కె.ఎన్.ఎన్. సింహ.

**కర్నూలు జిల్లా :** చేగిరెడ్డి, బాలిరెడ్డి.

# అనుబంధాలు - 1

## రైతురక్షణ యాత్ర - మద్రాసు ప్రభుత్వానికి సమర్పించిన మెమొరాండం పూర్తి పాఠం

ఆంధ్ర రాష్ట్ర రైతురక్షణ యాత్ర దళమువారు గత సంవత్సరం జూలై 3వ తేదీన ఉత్తర విశాఖపట్నం జిల్లాలో ఇచ్ఛాపురం నుండి ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాధ్యక్షులును, అప్పటి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సంయుక్త కార్యదర్శియగు శ్రీయుతులు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి నాయకత్వమున బయలుదేరిరి. అఖిలభారత కిసాన్ సభాధ్యక్షులగు ఆచార్య రంగాగారు, యం.యల్.ఏ. (సెంట్రల్) ప్రారంభోత్సవమును జరిపిరి.

యాత్రలో కాంగ్రెసు నాయకులు, కాంగ్రెసు శాసనసభ్యులు, కాంగ్రెసు సేవకులు చాలామంది పాల్గొని అమూల్యమగు సహాయమొనర్చిరి. సోషలిస్టులు, యువజన, కార్మిక పక్షముల తరపున కూడా అనేకమంది యువకులు ఈ యాత్రలో పాల్గొనిరి. ఉభయ విశాఖపట్నం జిల్లాలలోను, ఉభయ గోదావరిజిల్లాలోని కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలలోను, చెంగల్పట్టు జిల్లాలోని 3 తాలూకాలలోను ఈ దళము ది 1-10-37, 16-2-38 ల మధ్యకాలంలో తప్ప, బయలుదేరినప్పటి నుండియు ఇప్పటివరకు కాలినడకను, సంచారము చేయుచునేయున్నారు. మొత్తం 1512 మైళ్ళు కాలినడకను 542 మైళ్ళు బస్సులమీదను 130 దినములు ప్రయాణము చేసి ఈ రోజున (ది 27-3-38) మద్రాసు చేరుకున్నారు. యాత్రాదళము 525 గ్రామములు స్వయముగా వెళ్ళి దాదాపు 25,000 ప్రజల సంతకాలు గల 800 దరఖాస్తులను ప్రోగుచేసుకొని వచ్చిరి. వీటితోపాటు స్థానిక యిబ్బందుల గూర్చి రైతులు పెట్టుకున్న 300 అర్జీలను కూడా తెచ్చిరి. ఈ పిటిషనుల నకళ్ళు ఇదివరలో జిల్లా అధికారులకు కూడా సమర్పింపబడియున్నవి. మొత్తంమీద 500 గ్రామాలలో సభలున్నూ, 60 ఫిర్కా, తాలూకా రైతు సభలున్నూ యాత్రికుల ఆధ్వర్యమున జరుపబడినవి. దాదాపు 450 వేల ప్రజలు సభలకు హాజరైరి.

కాన పై చరిత్రను బట్టి యాత్రికులకు ఎట్టి ఘనమైన ప్రజాసంబంధ మున్నదో కనబడుతున్నది.

### ఈ రైతు యాత్ర యొక్క అవసరము

ప్రస్తుతపు ఈ రాష్ట్ర రైతు రక్షణయాత్ర 1933 సంవత్సరం నుండియు ఆంధ్రప్రదేశంలో నలుమూలల జరుపబడుచున్న రైతుయాత్రల పర్యవసానమే. 1933 నుండి రీసెటిల్‌మెంట్ మొదలగు ప్రత్యేక సమస్యల పైననూ, స్థానిక ఇబ్బందులను గూర్చిన్ని ప్రతి సంవత్సరము రైతు యాత్రలు స్థానికంగా జరుపబడుతూ వచ్చినవి. స్థానికంగా గల ప్రత్యేకపు యిబ్బందుల గూర్చి రైతులవద్ద నుండి వచ్చిన సూచనలను, విమర్శలను ఆధారంగా గాని,

వాటి నివారణయత్నాలను తాత్కాలిక శాసనముల ద్వారా చేయవలసినదని ప్రభుత్వమును కోరుటకై స్థానికాధికారుల వద్దకు రాయబారము వెడలుట ఈ యాత్రల ముఖ్యోద్దేశము. ఈ యాత్రల ఫలితంగా కొంత మేలుచేకూరుటవల్ల ప్రజాప్రబోధము. రైతులలో సంఘీభావము, కార్యాచరణ శక్తులు వృద్ధియైనవి. అనేకచోట్ల రైతు యాత్రలు జయప్రదంగా జరుపబడి ఇతర ప్రాంతములలో కూడ వీటి అనుకరణను ప్రేరేపించినవి. అనేకమంది సానుభూతిపరులు ఈ ఉద్యమానికి బాసటగా నిలిచినారు. ఇందుకు ఆనాటి జాతీయోద్యమం, దుర్భర ఆర్థిక దుస్థితి చాలావరకు కారణము. క్రమేణా జాతీయోద్యమంలో మార్పు గలిగి రైతుల హక్కులకు, కోర్కెలకు ప్రాధాన్యత యొసంగబడుట మొదలిడింది. భారతదేశం మొత్తంమీద జరిగింది ఈ మార్పు. ఏనాడైతే ఈ ఉద్యమమునకు ప్రోత్సాహం, ఫలితములు కనపడినవో ఆనాడే సంఘ నిర్మాణము నకు బీజము లేర్పడినవి. రైతుసంఘాలు విరివిగా ఏర్పడజొచ్చినవి. స్థానికంగాను, రాష్ట్ర మొత్తంమీద సంఘాలేర్పడి చివరకు అఖిలభారత రైతుసంఘం ఏర్పడింది. అనేక ప్రాథమిక, తాలూకా రైతు సంఘముల అనుబంధము కలిగి, 56 వేలమందికి పైగా సభ్యులను గలిగివున్న ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘము నేడింత బలపడుటకు ఈ రైతు యాత్రలెంతయో తోడ్పడినవి. రైతు యాత్రలు ప్రత్యేక ప్రాముఖ్యతను గడించినవి. స్థానిక కష్టాలను అధికారులకు నివేదించు కొనుటేగాక ప్రచారమునకును, ఒక యత్నమునకు ప్రజాబలమిచ్చుటకును వినయోగ పడజొచ్చినవి. యు.పి. బీహారు మున్నగు రాష్ట్రాలలో వేలకు వేలకొలది రైతులు తమ కోర్కెలను బలపర్చుకొనుటకు, ప్రభుత్వము వాటిని మన్నించి నెరవేర్చునట్లుగా ఒత్తిడి చేయుటకు యాత్రలు జరిపినారు. ఈ విధంగా రైతు యాత్రలకు రాజకీయ ప్రయోజనము కలిగి రైతుసామాన్యము రాజకీయ ఉద్యమములో పాల్గొనుటకు తోడ్పడినవి.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో రైతుల కనీసపు కోర్కెలు చాలావరకు ఇమిడియుండుట వల్ల రైతు ఉద్యమమునకు అఖండమైన నైతికబలము, ప్రచారావకాశములు ఏర్పడినవి. జమీందారీ, షాహుకారీ విధానాల దురన్యాయములు మారుమూలల గూడా ఘోషింపబడిన రైతు కోర్కెలు పల్లెపల్లెల ప్రతిధ్వనించినవి. నాయకుల నాయకుల వాగ్దానాలు, ప్రచారకుల ప్రబోధం రైతులలో విపరీతమైన ఆశ, ఉత్సాహము, క్రియాశక్తులను ప్రేరేపించినవి. ఎన్నికలలో జరుపబడిన ఈ అఖండమైన ప్రచారమే ఎన్నికల పిమ్మట గూడా సాగింపవలసివచ్చినది. కాబట్టి రైతులలో గలిగిన ఈ కదలికకు ఒక రూపమిచ్చి, నిర్మాణయుతము జేయుటకుగాను రైతుయాత్రలకు మరింత అవసరము లేర్పడినవి. ఎన్నికల పిమ్మట జమీందారులు చేయు అక్రమాలను అరికట్టుటకు, కాంగ్రెసు శాసనసభలలో రైతులకై జేయు కృషికి బలమిచ్చుటకు, తమ ఇతర కష్టాలను వారికి నివేదించి వాటిని తొలగద్రోయుటకై మంత్రులను కోరుటకు మంత్రుల కృషికి తగినంత ప్రజాబలమిచ్చి ప్రభుత్వము నెదుర్కొనుటకు వీరిని సమర్థులుగా జేయుటకు ఈ రైతుయాత్రలు తోడ్పడజొచ్చినవి. ఇట్టి పరిస్థితులలో ఆంధ్ర రాష్ట్రమంతటను ఇట్టి ప్రచారమును జరిపి రైతులోకములో నున్న భిన్న వ్యక్తులను ఏకముజేసి, బాధానివారణోపాయములను కేంద్రీకరింప

జేసి, వారి కోర్కెలను మంత్రివర్గము యొక్క దృష్టికి తెచ్చుటకును, వాటికి రాష్ట్రమంతటి యొక్క ఆమోదమును, బలమును సంపాదించుటకును రాష్ట్ర రైతురక్షణ యాత్రను జరుపుట ఆవశ్యకమైనది. చాలాకాలము క్రిందటనే ఉద్దేశింపబడి, జులై మొదటివారములోనే ప్రారంభింపబడిన ఈ యాత్ర ఏ ఒక్క మంత్రివర్గమును చికాకుపర్చుటకు గాక, ప్రభుత్వమునకు రైతాంగపు కష్టములను తెలియజేసి, ప్రభుత్వము శుభముగాను, సత్వరముగాను చేయగల్గిన చేయ అవసరమున్న సూచనలిచ్చి, వాటికై నిరంతరము ఆందోళనను, కృషిని చేయుటకుగాను ఉద్దేశింపబడినది. ప్రజాప్రతినిధులగు కాంగ్రెసు మంత్రివర్గము అధికారములోనికి వచ్చిన పిమ్మట ద్విగుణీకృతోత్సాహముతో కాంగ్రెసు మంత్రులు చేయు ప్రజాహిత కార్యములను బలపర్చుచూ ఈ యాత్ర సాగింపబడినది. మారుటోరియం వారములో రైతు యాత్రలను, ఋణనివారణ సందర్భంలో రైతు యాత్రలను, జమీందారీ విచారణ సందర్భంలో జరుపబడిన సభలున్ను, రాయబారమును ఈ విషయాన్ని ఋజువు పరుస్తున్నవి.

## రైతు యాత్రానుభావాలు

పైన వివరించబడ్డ ఉద్దేశముల కనుగుణంగా, మా యాత్రాదళము మిక్కిలి అజ్ఞానములో మునిగి, ప్రస్తుత ఆర్థిక, రాజకీయ ఉద్యమములతో సంబంధము లేక వెనుకబడియున్న ప్రాంతములలో కూడా సంచారముచేసి అమూల్యమైన అనుభవములను గడించియున్నది. మేము ఈ 4 నెలలలోను చూచినదాన్ని బట్టియు, తెలుసుకొన్నదాన్ని బట్టియు చెప్పగల్గిందేమంటే రైతులలో 100 కి 95 మంది దుర్భర దారిద్ర్యస్థితి యందు మునిగియుండి ప్రభుత్వము యొక్క సత్వర సహాయమును కోరుచున్నారు. ప్రతిచోటను వారిలో చైతన్యమును సంచలనమును కల్గుచున్న మాట వాస్తవమేగాని వారి ప్రయత్నాల కెన్నియో బలవత్తరమైన అడ్డంకులున్నాయి. పన్నుల భారం, ముఖ్యంగా భూమిశిస్తు విధానం వారిని క్రుంగదీస్తున్నవి. వరదలు, కరువులు మున్నగు ప్రకృతి అవాంతరములు తరచు సంభవించుచు పంటలకెంతో నష్టమును చేకూర్చుచున్నవి. ఆర్థిక సహాయం లేని రైతులు నవీన వ్యవసాయ పరిశోధనల ఫలితాలను వినియోగించుకొనలేకపోతున్నారు. ప్రపంచ ఆర్థిక దుస్థితి నుండి కొంత బయటపడ్డా ధరలు మందముగానే యున్నవి. ఫలితంగా భూములు ధరలు కోల్పోయినవి. రైతుల పరపతి అడుగంటినది. ఇట్టి పరిస్థితులలో రైతులకు కుటుంబ పోషణయే భారవహంగా ఉన్నది. ఆదాయము ఎంత కొద్దియైనను, సెంటు భూమియున్నచో పన్ను విధింపబడుటచే కొద్ది ఆదాయము గల రైతులే పన్నుల భారమును మోయలేకపోతున్నారు. ప్రస్తుతపు భూమిశిస్తు విధానమును మార్చి, కొంత పరిమితికి లోబడిన వ్యవసాయ రాబడిపై శిస్తులనే మాత్రమును విధించకుండుటకును, ఏ విధముగను భుక్తమునుండి తొలగింపబడకుండుటకును రైతాంగమంతయు వాంఛించుచున్నది. రీసెటిల్‌మెంట్ రేట్లు, నజరానాలు, పెనాల్టీలు, మురుగు అసౌకర్యాలు రైతులకెంతో భారవహముగ నున్నవి.

పీటికితోడు ఋణములు మరింత వీరిని కృంగదీస్తున్నవి. అనేకమంది ఈ ఋణముల వల్లనే తమ ఆస్తులను కోల్పోయి నేడు నిరాధారులై అల్లాడుచున్నారు. డెల్టా గ్రామములలోనే ఋణములు అధికమగుటచే ఫలవంతములైన భూములన్నియు వ్యవసాయేతరులగు మార్వాడీలు, షావుకారుల చేతులక్రిందకు పోయినవి. ఇట్టి స్థితిలో కాంగ్రెసు మంత్రివర్గం మారుటోరియమును ప్రకటించి కొంత సహాయమును చేయజూచినది గాని దీనిని వాయిదావేయుట వల్ల ఋణదాతల ఒత్తిడి మరింత అధికమై తటస్థించింది. ఈ ప్రమాదమును తప్పించి ఋణనివారణ మార్గాలను సత్వరం ప్రభుత్వము అవలంభించుటకై మారుటోరియం వారము జరుపబడి అనేక రైతుయాత్రలు జరుపబడినవి.

ప్రభుత్వం వెంటనే ఋణనివారణ చట్టాన్ని తెచ్చుటయు జరిగినది. ఈ చట్టం రైతుల కనీసపు కోర్కెలను తీర్చలేకపోయినప్పటికి, ఇంత మాత్రమైనను చేయగల్గినందులకు రైతులోకమంతయు ప్రధానమంత్రికి ధన్యవాదము లర్పించుచున్నది. ఈ చట్టమును మరింత వైశాల్యపర్చి ఋణముల పూర్తి తీరుమానమునకై వెంటనే ఏర్పాట్లను గావించవలెననియు, ప్రభుత్వమిచ్చు అప్పు మొత్తమును హెచ్చించవలెననియు, మిక్కిలి దుస్థితిలో నుండి ఏమియు చెల్లించుకోలేని రైతుల కౌలుదార్ల, కూలీల, ఋణములను రద్దుచేయాలనియు కోరుచున్నారు. **40** సం॥లలో వాయిదాలపై తమ ఋణములను తీర్చుకొనునట్లు వీలు గల్గించవలెనని కోరుచున్నారు.

గ్రామములలో సరియగు మంచినీటివసతులు తక్కువ, ఉన్న చిన్న చెర్వులు ఎండిపోయి ఎన్నో మైళ్ళు నడచి ప్రక్క గ్రామాలకు పోయి నీరు తెచ్చుకోవలసి వస్తున్నది. చేలకు సరియగు నీటివనర్లు లేవు. కాలువల చివరి గ్రామాలు మాగాణి క్రింది పరిగణింపబడు చున్నను నిజానికి మెట్టగ్రామాల వలెనే నీరులేక ఇబ్బందిపడుచున్నవి. మైనరు ఇరిగేషను పనులు నిర్లక్ష్యము చేయబడుచుండుటచే అవకాశములు గలిగియున్నను అనేక భూములు సాగుకాకుండా పోవుచున్నవి. తుంగభద్ర ప్రాజెక్టు విషయమై గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాల రైతులు గంపెడాశతో నున్నారు. రాయలసీమలో మేజరు, మైనరు ఇరిగేషను పనులు శ్రద్ధ జూపబడినచో అచ్చట తరచు సంభవించు కరువులు మాయమగునని ఆశించుచున్నారు.

ఉద్యోగుల లంచగొండితనము రైతులకు మిక్కిలి పీడాకరముగా నున్నది. పబ్లికు వర్క్సు, రెవిన్యూ, పోలీసు, ఎక్సైజు, రిజిస్ట్రేషన్ మున్నగు శాఖలలో లంచములు రివాజు అయినవి. మామూళ్ళివ్వనిచో పనులు జరుగవను భయముతో రైతులు విధిగా లంచములివ్వవలసి వస్తున్నది. ఇచ్చినట్లు తెలిసిన నేరమని ఈ బాధను గూర్చి బహిరంగముగా తెల్పుటకు వెనుదీయుచున్నారు. కాంగ్రెసు మంత్రివర్గము అధికారములోనికి వచ్చినను అధికారుల దృష్టి జాతీయ వికాసము పొందనందున పూర్వపు సంకుచిత దృష్టియే ఇంకను చూపబడుచున్నది. పోలీసుజులం ఎంత మాత్రమును తగ్గకపోవుటేగాక పక్షపాతము వహించి ప్రజల క్షేమాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. ఇందువల్ల పోలీసుల ఎడగల భయం, బెదురు ఇంకను ప్రజాస్వామ్యంలో తగ్గలేదు.

మా యాత్ర త్రోవలో అనేక జమీందారీ, ఈనాందారీ, మొఖాసా గ్రామములను వీక్షించినాము. నాగరిక దేశమునకు దూరమై, జమీందారుల అక్రమ పాలనకు ఆటపట్టులై భూలోక నరకమనిపించుచున్నవి. ఫ్యూడల్ యుగపు దౌర్జన్య పద్ధతులింకను అచ్చట అమలులోనున్నాయి. ఎచ్చట చూచినను పాడుపడిన చెర్వులు, మరమ్మత్తును కోరు కాలువలు, ఆనకట్టలుగాని, అడ్డుకట్టలు గాని లేక వృధాగా నీరు పారు వాగులును కన్పించినవి. విడివిడి పట్టాలుగాని, పట్టాట్రాన్సుఫర్లు గాని సర్వసాధారణముగా శూన్యం. ఒకరి బాకీలకై ఇంకొకరి ఆస్తులను జప్తులు చేయుట, వేలములు వేయుట మామూలు. కొన్ని ఎస్టేట్లలో సర్వే సెటిల్మెంట్లు లేవు. అందువల్ల విస్తీర్ణమెంతో తెలియదు. పన్నులు అత్యధికం. పరిమితి లేకుండా నిరంతరం వాటిని పెంచుటవల్ల వీటి భారాన్ని భరించలేకుండా యున్నారు. పైర్లవారి శిస్తులు బాధాకరంగా యుంటున్నవి. సాముదాయక భూములను, రైతు భూములను జమీందార్లు ఆక్రమించుకొని వాటి నుపయోగించుకొనుటలో రైతు కెట్టి హక్కులు లేకుండా జేస్తున్నారు. చెరువు లోతట్టు, శ్మశానాలు, డొంకలు, గ్రామకంఠాలు అన్నిటినీ భుక్తపరచుకొని రైతులుగాని, గొడ్లుగాని కాలుమెదుపుటకు కూడా వీలు లేకుండా జేస్తున్నారు. నీటిపారుదల సరిగా లేకపోవుట వల్ల పంటలు సరిగా పండుట లేదు. రెమీషన్ల పద్ధతే లేదు. రైతులను జమీందార్లు కోర్టుల కెక్కించుటవల్ల దావా ఖర్చులనే రైతులు భరించలేకుండా ఉన్నారు. శిస్తులు చెల్లించుకోలేక బకాయిలు పడి వుంటున్నాయి. జమీందార్ల మాయోపాయములచే ఋణనివారణ చట్టముయొక్క లాభాలను పొందలేకున్నారు. ఈ ఏడాది పంటలు చాలాభాగం చెడిపోవుటచే **1346, 47** శిస్తులను కూడా చెల్లించుకోలేకుండా వున్నారు. చెల్లించిన నివారణ చట్టంవల్ల రద్దుకాబడిన పాతబకాయీల డిక్రీలకైన ఖర్చులను, సెస్సులను కూడా రద్దు చేయాలనియు, బకాయిలనే పూర్తిగా రద్దు చేయాలనియు సర్వత్రా కోరబడుచున్నది.

జమీందారీ, రైత్వారీ ప్రదేశములందెల్ల అడవుల బాధ మిక్కుటముగా నున్నది. పుల్లరి రేట్లు భరింపరానివిగా నున్నవి. రిజర్వులైన్లు గ్రామాల దాపువరకు ఉంచి పశువులు కాలు మెదపుటకు కూడా వీలులేకుండా యున్నది. జమీందారీ అడవులలో అనాదిగా రైతు లనుభవించుచున్న హక్కులు తొలగింపబడుచున్నవి. కూపుల పద్ధతిని రద్దుచేయాలని కోరు చున్నారు. అడవి మృగములు పైర్లను పాడుచేయుచున్నను రైతులు వాటిని పారద్రోలుట కశక్తులగుచున్నారు. శక్తిగల్గినను జమీందార్లు అడ్డగించుచున్నారు. వెంకటగిరి ఎస్టేట్లలో రైతులకు గల ఆయుధముల నన్నిటిని లాక్కున్నారు. కాబట్టి వెంటనే అడవులు, కొండలప్రక్క గ్రామాలలోని ప్రజలకు ఆయుధ ధారణ హక్కు ఇవ్వవలెననియు, లాగుకొనబడిన లైసెన్సులు తిరిగి ఇవ్వబడవలెననియు కోరుచున్నారు.

ఇంకను మాకు కన్పించినది రైతులలో **100**కి **95** మంది రైతులు నిరక్షరక్షకులై అజ్ఞానమున మునిగియున్నారు. హరిజనులకు ఉండుటకు ఇళ్ళుగాని, తినుటకు సరియైన తిండిగాని లేక మిక్కిలి హీనమగు జీవితమును సాగించుచున్నారు. సాంఘికంగాను, ఆర్థికంగానూ

మిక్కిలి వెనుకబడియున్నారు. గ్రామములలో విద్య, వైద్యము, బాటలు, మంచినీరు, దీపములు మొ॥ సౌకర్యాలు బొత్తిగా పూజ్యము. ఓటింగు హక్కు అందరికిని లేకపోవుటచే కొలదిమంది స్వలాభపరులగు పెత్తందారుల వెంట గుడ్డిగా అనుసరిస్తున్నారు.

స్థానికాధికారులు రైతుల క్షేమాలగూర్చి మిక్కిలి నిర్లక్ష్యత వహిస్తున్నారు. అధికారులు తరచు రాష్ట్రభాషా పరిచయము లేనివారగుటచే ప్రజలు సులభముగా తమ కష్టాలను వారికి నివేదించుట కష్టసాధ్యమగుచున్నది. కనీసము ప్రభుత్వము జరుపు వ్యవహారమంతయు దేశభాషలో గూడా జరుగునట్లును ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సత్వరము ఏర్పాటుజేయవలెననియు కోరుచున్నారు.

కాంగ్రెస్ మంత్రివర్గము అధికారములోనికి రాగానే రైతులలో ఉత్సాహశక్తులు ఉద్భవించినవి. మంత్రులు తప్పక తమ కష్టాలను తొలగించెదరని విశ్వసించియున్నారు. జమీందార్లు, షావుకార్లు మున్నగువారు దౌర్జన్యములను మంత్ర లరికట్టెదరను ధైర్యముతో నున్నారు. మద్యపాన నిషేద చట్టం, ఋణనివారణ చట్టం, జమీందారీ విచారణసంఘ నియామకం మొ॥వాటిని హర్షించుచు వాటిలో గల లోపాలను సవరించవలెనని కోరుచున్నారు. ముఖ్యంగా విచారణలతో కాలయాపన చెయ్యకుండా ఎస్టేటులాంటి ఆక్టును తమ కష్ట నివారణకు అనువైన విధంగా సవరించవలెనని కోరుచున్నారు. కాంగ్రెస్‌నందు తమకు గల విశ్వాసాన్ని ప్రకటిస్తూ కాంగ్రెస్ కార్యక్రమానికి తమ సంపూర్ణ సహాయమును అందజేయుచున్నారు. బాధ్యత లేనట్టి జమీందారీ పార్టీవలెగాక ప్రజాప్రతినిధులగు కాంగ్రెసు మంత్రులు ధైర్యముతో రైతు మేలుకై చేయునట్టి కృషికి కృతజ్ఞతను కనపర్చుతూ, వారి ప్రయత్నములకు ప్రభుత్వము అడ్డుతగిలిన తాము మంత్రులకు మద్దతు చేయుటకు సంసిద్ధులనమని వెల్లడించుచున్నారు.

మేము వీక్షించినవి బాటసౌకర్యాలు కల్గిన తమ బాధలను కొంతవరకైనా వెల్లడించుకో గల్గిన ప్రదేశములు. కానీ ఆంధ్ర దేశమంతటా ఇంతకన్నా దీనులగు రైతులు అసంఖ్యాకులుగా నున్నారనియు, ప్రభుత్వము వెన్వెంటనే రైతాంగమంతటి యొక్కయు మేలుకొరకై కృషిచేయుననియు విశ్వసించుచున్నాము.

## ప్రభుత్వమునకు విజ్ఞప్తి

అనేక ఏండ్లబాటుగా రైతులు తమ కష్టాలను గూర్చి నివేదించు కుంటున్నారు. తమ కనీస కోర్కెలను వెల్లడించియున్నారు. స్థానికములగు ఇబ్బందుల నివారణకొరకును, రైతుల సామాన్య ఆర్థిక, రాజకీయ హక్కుల కొరకును ఇదివరలో అనేక మెమోరాండములు సమర్పించబడినవి. రైతాంగమంతయు వాటిని సమర్పించియున్నది. అఖిలభారత రైతుసంఘ ప్రణాళికలోను, మేము మా యాత్రా ప్రారంభములో ప్రచురించిన కనీసపు కోర్కెల ప్రణాళికలోను రైతుల కనీసపు కోర్కెలు పొందుపర్చబడియున్నవి. ఇంతవరకు జేయబడిన ఆందోళనయంతయు

వాటిని నెరవేర్చాలనియే జేయబడినది. మా ప్రణాళికలోని కనీసపు కోర్కెలను అనేక జిల్లాలలోని కాంగ్రెస్ కమిటీలను, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమున్ను అంగీకరించి, ప్రభుత్వం వాటిని వెంటనే నెరవేర్చవలెనని కోరియున్నవి. ఈ పూర్వపు ప్రణాళికలను బట్టియు, మెమోరాండం లనుబట్టియు, ఈ మా యాత్రలో రైతులు మాకు సమర్పించిన అర్జీలనుబట్టియు, మా యాత్రానుభవాలను బట్టియు తక్షణమే ప్రభుత్వము ఈడేర్చవలసిన కోర్కెలను మీకు నివేదించుచున్నాము. ఈ కోర్కెలనన్నిటిని ప్రభుత్వము మిక్కిలి సులభముగా నెరవేర్చగలదని విన్నవించుకొనుచున్నాము. ఈ కోర్కెలు నెరవేర్చబడినచో నేడు మిక్కిలి దీనావస్థయందున్న రైతులు కొద్దిగా తెప్పరిల్లి పరిస్థితులను చక్కజేసికొని గౌరవప్రదమైన జీవనమును గడుపుటకును, నేటికీ రాజకీయోద్యమములందు అధికోత్సాహముతో పాల్గొనుటకును సమర్థులగుదురని విన్న వించుకొనుచు మా యాశలు తప్పక ప్రజా శ్రేయోభిలాషులగు కాంగ్రెస్ మంత్రివర్గము యొక్క ఆమోదమును పొంది సఫలీకృతములగునని ఆశించుచున్నాము.

ఈ క్రింద నివేదింపబడిన అత్యవసరపు రైతాంగ కోర్కెలను వెంటనే ప్రభుత్వము నెరవేర్చవలెనని కోరుచు మేము సంచారము చేసిన గ్రామాలవారు ఇచ్చిన అర్జీలను, అందు కష్టాలను దెల్పు అనుబంధమును ప్రభుత్వ పరిశీలనకు దెచ్చుటకుగాను ఈ మెమోరాండముతో నివేదించుకొనుచున్నాము.

## రైతాంగ అత్యవసర కోర్కెలు

### జమీన్ రైతులు :

1. ప్రస్తుతము జమీన్‌లలో అమలులోనున్న హెచ్చు శిస్తులను ప్రక్కనున్న రైత్వారీ భూమిరేట్లకు సమానముగా తగ్గించవలయును.
2. పైరువారి రేట్లను రద్దుచేయవలయును. ములుపు, తోటరేట్లను రద్దుచేసి మెట్టరేట్లే తీసుకొనవలయును.
3. రెండవకారు పైరుకు శిస్తు, మొదటికారు పైరుశిస్తులో సగముకు మించరాదు.
4. మురుగు కాలువలు, ప్రక్కనున్న ఏటివాగులు మొదలగు జలాశయముల నుండి బిందెలతోగాని, ఏతము మొదలైన సాధనములతో, తోడుకొని సాగుచేయు పైరులకు నీటి తీరువాయి విధించరాదు. ప్రస్తుతం అట్లు విధించుచున్న హెచ్చు పెనాల్టీలను వెంటనే రద్దుచేయునట్లు శాసించవలయును.
5. ఇండ్ల స్థలములకు, పశువుల కొట్టములు మొదలైనవాటికి శిస్తు విధించరాదు.
6. ధాన్యరూపేణా శిస్తులు రద్దుచేసి వాటిస్థానే రొఖ్ఖపూర్వపు శిస్తులను ఏర్పాటు చేయ వలయును.
7. మాగాణి భూములలో నీటివసతులు లేనప్పుడు మెట్టపైరులు వేసిన నీటితీరువా వసూలు చేయరాదు. మెట్టశిస్తే తీసుకొనవలయును.
8. చట్టరీత్యా నిర్ణయింపబడిన శిస్తులు తప్ప, తాళ్ళశిస్తు మొదలగు అక్రమశిస్తులు వసూలు చేయకుండా ఏర్పాట్లు చేయవలయును.

## రిమీషన్స్ :

పంటలు పండకపోయినప్పుడు, కరువు, కాటకాలు మొదలైన ప్రకృతి అవాంతరములు సంభవించినపుడు రిమీషన్స్ తప్పక యిచ్చే ఏర్పాటు చేయవలయును.

## నీటి వసతులు :

1. బే మరమ్మత్తులో నున్న చెరువులు, కాలువలు మొదలైన నీటి పంపకములను వెంటనే ప్రభుత్వమే పూనుకొని మరమ్మత్తు చేయించవలయును. వాటికైన ఖర్చులను జమీందారుల వద్దనుండే వసూలు చేయవలయును. అట్లు మరమ్మత్తు చేయబడిన నీటిపంపకపు వసతులను, వాటి పరిపాలనను గ్రామపంచాయితీకి వశపర్చవలయును.
2. ప్రతి సంవత్సరము నీటి పంపకము వసతులను సంరక్షించుటకు జలాశయ సంరక్షణనిధిని ఏర్పరచి దానికగు ఖర్చులను ఏటేటా గ్రామమునుండి వసూలుచేయు శిస్తుల మొత్తమునుండి ప్రత్యేకించవలయును. అట్టి సంరక్షణనిధిపై అధికారము గ్రామపంచాయితీకే ఉండవలయును.

## అడవులు :

1. పుల్లరి రేట్లను పూర్తిగా రద్దు చేయవలయును.
2. పశువుల మేతకై గ్రామంచుట్టూ ఉన్న అథమము ఒక మైలు అడవిని అన్ రిజర్వుగా వదలివేయవలయును. దీనిపై అధికారము గ్రామ పంచాయితీల కుండవలయును.
3. అన్‌రిజర్వుగాని తక్కిన అడవిలో వ్యవసాయమునకు, గృహోపకృత్యములకు, ఎరువులకు పనికివచ్చు కట్టె, కలప, కంప, ఆకు మొదలగునవి ఉచితముగా తెచ్చుకొనుటకు రైతులకు, కూలీలకు హక్కుండవలయును.
4. అడవులు, కొండలు ప్రక్కనున్న గ్రామాదులవారికి పైరుపంటలను, అడవి మృగములనుండి రక్షించుకొనుటకు ఆయుధములు కలిగియుండుటకు హక్కుండ వలయును. అందుకుగాను వెంటనే లైసెన్సులు యిప్పించుటకు స్థానికాధికారులకు ఉత్తర్వులివ్వవలయును.
5. ఇదివరకున్న లైసెన్సులు కోల్పోయినవారికి తక్షణం స్థానికాధికారులే తిరిగి యిచ్చునట్లు వెంటనే ఉత్తరువులు చేయవలయును.

## శిస్తు వసూళ్ళు :

1. శిస్తు వసూలు అధికారము గ్రామపంచాయితీలకే ఉండవలయును. 2. ఋణపరిష్కార చట్టము ప్రకారము రద్దుచేయబడిన పాతబకాయిలకై చేయబడిన డిక్రీల ఖర్చులు, సెస్సులను రద్దుచేయుచు శాసించవలయును.
3. 1346, 47 ఫసలీ శిస్తులు కట్టితేనే పాతబకాయిలు రద్దు అగునను షరతు తొలగించుచు శాసించవలయును.

4. ఏ సంవత్సరపు శిస్తు ఆ సంవత్సరమే (సస్పెన్షన్, రెమీషన్ ఉన్నప్పుడు తప్ప) తప్పక వసూలు చేయవలయును. మరో సంవత్సరములో గత సంవత్సరపు శిస్తు వసూలు చేయరాదు.
5. శిస్తు వసూలు ఆ యా ప్రదేశములలో పంట పండుకాలమును బట్టి కాల నిర్ణయము చేసి 4 మాసముల సమాన వాయిదాలపై వసూలు చేయు అవకాశమేర్పరచవలయును. శిస్తు వసూలుకై ఏ చరాస్థిని జప్తు చేయరాదు. స్థిరాస్థి జప్తుచేయునపుడు వ్యవసాయదారుని కనీస కుటుంబపోషణకు అవసరమైన భూవసతిని మినహాయించి జప్తు చేయవలయును.
6. ఏ నెంబర్ భూమిపై బకాయిపడునో ఆ నెంబరు భూమికే జప్తు తీసుకురావలయును. తదితర భూములపై శిస్తు బకాయికై జప్తు చేయరాదు.
7. జమీందారుకు రైతుభూమిపై గల ప్రథమచార్జి హక్కును తొలగించవలయును.

**సాముదాయక భూములు :**

ఆనాటినుంచి గ్రామస్థులు అనుభవించుచున్న గ్రామ కంఠములు, తోటలు, తోపులు, రుద్రభూములు, డొంకలు, చెరువులు, చెరువు లోతట్లు, పుంతలు మొదలగు సాముదాయక భూములన్నిటిని గ్రామ సమిష్టి నియోగార్థమై గ్రామపంచాయితీల పరం చేయవలయును.

**సర్వే సెటిల్‌మెంట్లు :**

1. ప్రతి రైతునకు అతని భుక్తములో నున్న భూములను ప్రభుత్వమే స్వయముగా సర్వే సెటిల్‌మెంట్లు చేయించి గ్రామమునకంతకు కలిపి తగిన సర్వే రికార్డులు ఉంచవలయును.
2. సర్వే చేయబడిన రికార్డులు ననుసరించి ప్రతి రైతుకు ప్రత్యేక విడివిడి పట్టాలు ఎట్టి నజరానా లేకుండ యివ్వవలయును. వీటికగు ఖర్చులన్నియు జమీందారే భరించవలయును.
3. ఈ విధముగా పట్టాలివ్వకపోయిన శిస్తు వసూలుచేయు హక్కు తొలగింపబడ వలయును.

**లంకలు :**

1. నది - ప్రవాహమువల్ల విరిగిపోయిన లంకలకు శిస్తు తీసివేయవలయును.
2. విరిగిపోయిన ప్రదేశమున గాని, మరెచటనైన, గాని క్రొత్తలంక లేర్పడిన విరిగిపోయిన లంక విస్తీర్ణమునకు సరిసమానమైన విస్తీర్ణము గల భూమికి ఎట్టి నజరానా లేకుండా ఆ లంక వ్యవసాయకులకు పట్టా యివ్వవలయును. పెచ్చు భూమిని గ్రామ సమిష్టి వినియోగార్థమై గ్రామపంచాయితీల వశము చేయవలయును.

## స్వంత కమతములు :

జమీందారులకున్న స్వంతకమతాలను రద్దుచేసి ఆ భూములను కుటుంబము యొక్క కనీస జీవితపోషణకు చాలని ఆదాయము వచ్చు భూవసతి కల పేదరైతుకును, వ్యవసాయ కూలీలకును సహకార పద్ధతులపై సాగుచేసుకొనుటకే ఉపయోగపడు నటుల శాసించవలయును.

## జమాబంది :

1. గవర్నమెంటు గ్రామాదులలో ప్రతి సంవత్సరము రైతు కష్ట సుఖములను చెప్పుకొనుటకు జమాబంది ఏర్పరచినట్లు జమీందారీలలో కూడ తప్పనిసరిగా జమాబంది ఏర్పరచవలయును.
2. పైరు కోయకమునుపే పంటముఖమునే రైతుల యిబ్బందులు, అవసరాలు తెలుపుకొనునట్లుగా జమాబంది కాలము ఏర్పాటు చేయవలయును.

## ల్యాండు కోర్టులు :

జమీందారులకు, రైతులకు మధ్య వచ్చే వివాదములలో రైతులకు సులువుగా న్యాయము కలుగునట్లు సంచారపు ల్యాండుకోర్టులు స్థాపించవలయును.

జమీందారీ భూమిని ట్రాన్సుఫరు పొందువారికి పూర్వపు శిస్తు బకాయిలు చెల్లించవలసిన ఎట్టి పూచీలేకుండా ఉండవలయును.

ప్రతి గ్రామమునుండి జమీందారు వసూలుచేయు శిస్తు మొత్తమునుండి రూపాయికి 0-4-0 చొ॥న శిస్తు మొత్తమునుంచి ప్రత్యేకించి సదరునిధిపై గ్రామ పంచాయితీకి అధికారముండునట్లు శాసించవలయును.

1. పై కోర్కెలన్నియు 1936వ సంవత్సరం వరకు సవరింపబడిన ఎస్టేటుల్యాండు ఆక్టు ప్రకారము నిర్వచింపబడ్డ ఈనాంధారీ, మొఖాసాదారీ, శ్రోత్రీయ గ్రామాదులకు కూడా లభించునట్లు ఏర్పాటు చేయవలయును.
2. 185 సెక్షన్ ప్రకారము ఏర్పరచవలసిన ట్రిబ్యునల్సును సత్వరము ఏర్పరచవలయును. గ్రామ రైతులందరి తరపున సమిష్టిగా దావాలు మున్నగు అన్ని వ్యవహారముల లోను వ్యవహరించుటకు, బాధ్యత వహించుటకు, సమిష్టి వ్యవహారములలో కలిగిన లాభము లను అందరు అనుభవించుటకు అవకాశము కలిగించుటకును జిల్లా రైతుసంఘము లకు అధికారముండవలయును.

## రైత్వారీ రైతులు

1. 1914వ సంవత్సరమునకు, తరువాత భూమిపన్ను విటతీరువాయి లపై విధించబడిన సమస్త రీసెటిల్‌మెంటు అదనపు పన్నులను, క్లాసువారి రేట్లను పూర్తిగా రద్దు చెయ్యాలి.

2. కనీసము కుటుంబపోషణకు చాలని ఆదాయము వచ్చు భూవసతి గల పేదరైతుల వద్దనుండి ఏ విధమైన పన్నులు వసూలు చేయరాదు. వ్యాపారము వలన కలుగు లాభములపై వసూలుచేయు ఇన్‌కంటాక్సు పద్ధతి ననుసరించి వ్యవసాయపు ఆదాయంపై రాబడిపన్ను విధించవలయును. చవిటి భూములై వ్యవసాయపు ఖర్చులపై చాలని ఆదాయము వచ్చు భూములకు పన్ను రద్దు చేయవలయును.

3. రెండవ పంటకు నీటి తీరవాయి వసూలు చేయరాదు.

4. 1) ప్రభుత్వ పెట్టుబడి లేనట్టియు, స్వాభావికమైనట్టియు, కాలువలు, కొండేరులు, వాగులు, మురుగుకాలువలు మొదలగు జలాశయముల నుండి పారుదల గాబడు నీటిచే సాగగు భూములకు పెనాల్టీలు విధించరాదు.

 2) అట్టి స్వాభావిక జలాశయముల నుండి లిఫ్టు ఇరిగేషన్ ద్వారా గాని స్వయముగా నీటిని మోసుకొనుట ద్వారా గాని సాగుచేసుకొని పెంచుకొన్న పైరులకు నీటితీరువాయి కట్టరాదు.

5. తోటపైరులకు కాలువల నీరు పెట్టుకున్నప్పుడు రేటు కట్టకుండా వంటి నీటి తీరువాయినే కట్టవలయును.

6. ఎట్టి పరిస్థితులలోను మామూలు నీటితీరువాయికన్న పెనాల్టీలు రూపాయికి మించరాదు. ప్రస్తుతము వసూలు చేయుచున్న హెచ్చు పెనాల్టీలకు వెంటనే స్టే ఆర్డరులు యిప్పించవలయును.

7. 1) ఆయకట్టు నజరానాలు పూర్తిగా తొలగించవలయును. ప్రస్తుతము వసూలు చేయుచున్న నజరానాలను వసూలు చేయకుండా ఆపుదల చేయవలయును.

 2) గత 5 సంవత్సరముల నుండి గాని అంతకు పైనుండిగాని పెనాల్టీ నీటి తీరువాయి విధింపబడుచున్న ఆయకట్టులో చేరని భూములను వెనువెంటనే ఆయకట్టులో చేర్చుటకు ఉత్తర్వులివ్వవలెను.

8. పెనాల్టీ విధించినపుడు వెంటనే రైతుకు తెలియపర్చవలయును. మాగాణి భూములను మెరకచేసి నివేశన స్థలములుగా మార్చినపుడు అట్టి భూములకు నివేశన స్థలములు ఆక్రమించుకున్నంతవరకు గల ప్రదేశములకు కూడా వసూలు చేయబడుచున్న నీటి తీరువాయి రద్దుచేసి ఏ విధమైన పన్నులు విధించకుండా ఉండుటకు ఉత్తరువు లిప్పించవలయును.

9. వెల్లుల్లి మొదలగు తోటపైరులకు డిశంబరు 1వ తేదీలోగా నీరు పెట్టుకోరాదు అను నియమము రద్దుచేయుచు ఉత్తర్వు చేయవలయును.

10. కొన్ని కొన్ని ప్రదేశములలో కొత్తగా మాగాణి చేయబడ్డ భూములకు మొదటిపైరుకు మూడు నెలల వరకే నీరు ఇచ్చుటవలన వ్యవసాయ ఖర్చులకు, కుటుంబ ఖర్చులకు తగిన ఆదాయం రాకపోవుటచేతను, నీరులేక భూములు ఎండిపోయి చౌడుపొక్కి నిస్సారమగుటయేతను అట్టి ప్రదేశములలోని మొదటి పైరుకు 6 నెలలవరకు నీరు ఇచ్చుటకుగాను ఉత్తర్వులివ్వలయును.

11. రూ. 0-4-0 పంటగాని, అంతకు తక్కువ పంటగాని పండిన వ్యవసాయ ఖర్చులే గిట్టవు. గనుక శిస్తు రిమీషను తప్పక యివ్వవలయును.
12. ప్రస్తుతము జరుగుచున్న జమాబంది రైతులకు ప్రయోజనకారిగా లేక ప్రభుత్వ జమాఖర్చులు లెక్క చూచుకొనుటకే ఏర్పడినట్లు ఉండుటచేతను రైతులు తమ యిబ్బందులను అవసరాలను పంటముఖానే తెల్పుకొనుటకు గాను నవంబరు మాసములో కలెక్టర్లు జమాబందీలాంటి సమావేశములు ఏర్పరచవలయును.
13. ప్రస్తుతమున్న ఇర్రిగేషన్ బోర్డులను రద్దుపరచి వాటిస్థానే ఎన్నుకోబడిన ప్రజల సలహా సంఘములను ఏర్పరచవలయును.
14. పి.డబ్ల్యు.డి. వారు రైతులకోర్కెలను హెచ్చుగా మన్నించుటకుగాను రైతుసంఘ ప్రతినిధులకు, ఆ యా గ్రామపంచాయితీలకు నీటిపంపకము మీద సమానహక్కు లుండవలయును.
15. రాష్ట్రమంతటా ప్రస్తుతము అమలులో నున్నట్టియు, హెచ్చుగా లంచగొండి తనమును వృద్ధిపరచుచున్నట్టియు రీమోడలింగ్ స్కీమును రద్దుపరచవలయును.
16. రాష్ట్రములో నీటిపారుదల వసతులు ఎచ్చట తక్కువగానున్నవో అచ్చట వెంటనే మైనర్ ప్రాజెక్టులను ఆరంభించవలయును.
17. తుంగభద్ర, భవని, సంగమేశ్వర్, మేజర్ ప్రాజెక్టులను తప్పక ఆరంభించవలయును.
18. నీటిమరమ్మత్తుల కాంట్రాక్టులను ఆ యా ఆయకట్టులోని రైతుసంఘములకే యివ్వవలయును.
19. ప్రభుత్వ వివిధ శాఖలలో యింతవరకు లంచగొండితనము సాగుచునే యున్నది. దానిని త్వరగా రూపుమాపుటకు గాను ప్రజలచే హెచ్చుగా తొలగించమని కోరబడిన ఉద్యోగులను వెంటనే తొలగించవలయును. అధమము ట్రాన్సుఫరు అయినా చేయవలయును.

## 20. (అ) ఋణములు :

ఋణభారముతో కృంగిపోతూ వున్న అసంఖ్యాకులగు వ్యవసాయదారులకు ఋణపరిష్కార చట్టముతోబాటు ఈ క్రింది ఏర్పాట్లు సత్వరముగా చేయవలయును.

1. ప్రతి తాలూకాకు ఒక ఋణపరిష్కార బోర్డును ఏర్పరచవలయును. ప్రస్తుత్నమున్న అధికారముల కన్న హెచ్చు అధికారములు సత్వరముగ, నిర్బంధముగా ఋణపరిష్కారము చేయుటకు ఈ బోర్డులకు కలిగించవలయును.
2. ఋణపరిష్కార చట్టము ప్రకారము తేలిన ఋణాల మొత్తమును ప్రభుత్వమే షాహుకార్లకు తీర్చివేసి నెల 1కి నూటికి రూ. 0-4-0 లు కన్న హెచ్చుగాని వడ్డీలతో 40 సంవత్సరముల సమాన వాయిదాలమీద ఋణస్థులు తీర్చుకొను అవకాశములు కలిగించవలయును.

3. ఇందుకుగాను ఎగ్రికల్చరల్ డెట్ రిడప్షన్ లోన్ ఒకదానికి ఏర్పాటు చేయవలయును. లోను మొత్తము కనీసము 20 కోట్లు అయినా ఉండవలయును.

3ఎ. ప్రస్తుతము భూమి తనఖా బ్యాంకులకు ప్రభుత్వమిచ్చిన హామీగాక, కనీసము మరి పదికోట్లకైనను గ్యారంటీ యివ్వవలయును.

4. ప్రభుత్వమే రైతులకున్న అప్పులలో కొంతభాగమునకు పూచీబడి ప్రభుత్వ డిబెంచర్లను షావుకార్లకు యిచ్చి, రైతులు దీర్ఘవాయిదాలపై స్వల్పవడ్డీతో తీర్చుకునే అవకాశాలు కలుగజేయవలయును.

5. ఈ చట్టము అమలులోకి రావడముచేత వ్యవసాయదార్లకు షావుకారొత్తిడి హెచ్చయినది. యితరత్రా పరపతు చెడిపోయినది. అందుచేత గవర్నమెంటు పై ఏర్పాట్లు చేసేవరకు ఈ మధ్యకాలములో షావుకార్లు ఋణస్థుల ఆస్తులను వేలంవేసి కఠినచర్యల నవలంభించకుండా 5 సంవత్సరముల వరకైననూ కఠినచర్యలనుంచి రక్షించవలయును.

6. ఇకముందు వ్యవసాయదార్లకు వ్యవసాయ ఖర్చులకు, కుటుంబ ఖర్చులకు వలయు పరపతి సౌకర్యములు కలుగుటకు ప్రతి గ్రామమున సహకార పరపతి సంఘములు ఏర్పాటు చేయవలయును.

అ-1) ఇకముందు వడ్డీ రేటు నెల 1కి నూటికి రూ. 0-40 కన్న హెచ్చు యుండరాదని సవరణ చేయవలయును.

2) కనీస కుటుంబ జీవితావసరములను తీర్చగల వ్యవసాయ ఆదాయమునిచ్చు భూవసతిని మినహాయించే ఋణములను రాబట్టుటకు స్థిరాస్తిని వేలముగాని జప్తుగాని చేయునట్లు సవరణ చేయవలయును.

3) ఇకముందు కనీస కుటుంబపోషణకు చాలని ఆదాయమే రానట్టి, భూవసతి గల పేదరైతుల భూములను అప్పుల తీర్మానమునై అన్యాక్రాంతము చేయరాదు.

**21 అడవులు :**

1) పుల్లరిరేట్లు పూర్తిగా తొలగించవలయును.

2) వ్యవసాయమునకు, ఎరువులకు, గృహకృత్యములకు అవసరమైన కలప, కంప, కట్టె, ఆకు మొదలైనవి ఉచితముగా తెచ్చుకొనుటకు రైతులకు, కూలీలకు హక్కుండ వలయును.

3) అడవుల, కొండల ప్రక్కనున్న గ్రామాదుల వ్యవసాయకుల పశువుల మేతకై గ్రామము చుట్టూ 2 మైళ్ళు దూరములో నున్న అడవులను, కొండలను ఉచితముగా మేత మేపుకొనుటకు అన్ రిజర్వుగా వదిలిపెట్టవలయును.

4) అటవీ పరిపాలనను గ్రామపంచాయితీలకు వశము చేయవలయును. అడవుల ప్రక్కను, కొండలప్రక్కను ఉన్న గ్రామాదులలో నివసించు రైతులకు, కూలీలకు పైరుపంటలను పాడుచేయకుండా అడవి మృగముల బాధ తొలగించుకొనుటకు ఆయుధములు కొనుక్కొనుటకు లైసెన్సులు వెంటనే యిచ్చుటకు స్థానికాధికారులకు ఉత్తరువు లివ్వవలయును.

5) పుల్లరికట్టిన రైతులు తమ పశువులను తమ జిల్లాలో నున్న అడవిలో నెచ్చటనైనను మేతమేపుకొనవచ్చును.

6) అడవిలో వ్యవసాయమునకు గాని, పెద్ద పెద్ద గృహ నిర్మాణమునకు పనికి వచ్చు కలపకుగాని వినియోగపడకుండా చిన్న చిన్న పేకలతో యేర్పడి వున్న అరణ్యమును పేదరైతులకు, కూలీలకు సాగుకు యివ్వవలయును.

1. ప్రతి గ్రామములోను ప్రభుత్వము సంకల్పించిన పంచాయితీ విధానముననుసరించి గ్రామపంచాయితీ లేర్పాటు చేయవలయును.
2. యుక్తవయస్సు వచ్చిన ప్రతివారికి (స్త్రీ, పురుష భేదము లేకుండ) ఓటింగు హక్కు యివ్వవలయును.
3. మంచినీటి సౌకర్యములను సాధ్యమైనంతవరకు అన్ని ప్రాంతములలోను ఏర్పాటు చేయవలయును.
4. వైద్య సహాయము, అందరికి అందుబాటులో నుండునట్లు వైద్యశాలలను విరివిగా ఏర్పాటు చేయవలయును.
5. నిర్బంధప్రాథమిక విద్య అమలులోనికి త్వరగా తీసుకురావలయును.
6. పల్లపు ప్రదేశాలలో మలేరియా మొదలగు మన్యపు జ్వరముల నుండి ప్రజలను కాపాడుటకు మురుగుపోవు సౌకర్యములు హెచ్చుచేయవలయును.
7. రాష్ట్రమంతటా ఒక సమగ్రమైన విధానము ద్వారా విద్యుచ్ఛక్తి స్కీములను వ్యవసాయాభివృద్ధికిని, గ్రామ పరిశ్రమాభివృద్ధికిని తోడ్పడులాగు సత్వరముగ ప్రారంభించవలయును.
8. వ్యవసాయపు పంటలు, యితర దినుసులు సరియైన ధరలు కల్గియుండేలాగున ఆ పైరుపంటలు నిలుపచేసుకొనుటకు ప్రభుత్వము గోడౌన్లు నిర్మించి కో ఆపరేటివ్ లోన్ మరియు సేల్ సొసైటీలను విరివిగా స్థాపించి విక్రయ సౌకర్యములు లభించేటట్లు మార్కెటింగు బోర్డులను ఏర్పాటు చేయవలయును.
9. వ్యవసాయక పరిశోధన ఫలితములను ప్రతి గ్రామమున విరివిగ ప్రచారము చేయుటకు వ్యవసాయక పరిశోధన కేంద్రముల తరపున ప్రత్యేక ప్రచార సంఘములను స్థాపించవలయును.
10. రాష్ట్రమంతటా ఒకే తూనిక, కొలమానములను ఏర్పాటు చేయవలయును.

11. వ్యవసాయదార్లు ఒకరి భూమిలోనుండి మరొకరి భూమిలోకి వెళ్ళుటకు పబ్లికుదార్లు లేవు గాన పైరుపంటలకు నష్టములేకుండా ఒకరి భూమిలో నుండి మరొకరి భూమికి వెళ్ళుటకు ఎట్టి ఆటంకములు లేకుండా ఏర్పరచాలి.

1. వ్యవసాయ కూలీలకు ఆ యా ప్రదేశములలో ఉండే పరిస్థితులను బట్టి కనీస వేతనములు ఏర్పాటు చేయవలయును.
2. మంచినీటి వసతులు హెచ్చుచేయవలయును.
3. గృహములు కట్టుకొనుటకు ప్రస్తుతము ప్రభుత్వమిచ్చు సౌకర్యములను మరింత హెచ్చు చేయవలయును.
4. పరపతి సౌకర్యములు కలుగజేయుటకు గాను లేబరు కో ఆపరేటివ్ సొసైటీలు హెచ్చుగావించాలి.
5. వ్యవసాయ కూలీల అప్పులను పూర్తిగా రద్దు చేయవలయును.
6. యుక్త వయస్సు వచ్చిన ప్రతి స్త్రీ, పురుషులకు ఓటింగు హక్కుండవలయును.
7. కొన్ని పల్లెలకు కలిసి ఒక సహకార వస్తు విక్రయశాల ప్రభుత్వమే యేర్పాటు చేయవలయును.
8. వ్యవసాయ కూలీలకు వుచిత వైద్య సహాయము అందుబాటులో నుండునట్లుగా వైద్యశాలలు, మెటర్నటీ వైద్యశాలలు యేర్పాటు చేయవలయును.
9. సాగుకు లాయకుగా ఉన్న బంజరు భూములను ముఖ్యంగా వ్యవసాయ కూలీలకు సహకార పద్ధతులపై వ్యవసాయము చేసుకొనుటకు యివ్వవలయును. అందులకెట్టి నజరానా పుచ్చుకోగూడదు.
10. వ్యవసాయ ఖర్చులకు వలయు ప్రథమ పెట్టుబడి ప్రభుత్వమే యివ్వలయును. అటుపై వాయిదాలపై 10 సంవత్సరములైన తదుపరి వడ్డీ లేకుండా వసూలు చేసుకొనవచ్చును.
11. సర్వ విధములగు నెట్టి, నిర్బంధ సాంఘిక సేవలను నిషేధించి శిక్షార్హము చేయవలయును.
12. పనిలేని రోజులలో పని కల్పించుటకు ఆయా ప్రదేశములో నుండి వుపపరిశ్రమలను ప్రోత్సహించవలయును.
13. వ్యవసాయ కూలీ స్వంత పనిముట్లు, నివాస స్థలము, యిల్లు, పశువులను ఎట్టి పరిస్థితులలోను అన్యాక్రాంతము కాకుండా శాసించవలెను.
14. నిర్బంధ ప్రాథమిక విద్య సత్వరము ప్రవేశ పెట్టవలయును.
15. స్త్రీ, పురుష భేదము లేకుండా సమాన పనికి సమాన వేతనములు యిచ్చునట్లు శాసించవలయును.
16. కూలీలందరి తరపున సమిష్టిగా వ్యవహరించుటకుగాను కూలి సంఘమును కూలీల ప్రతినిధిగా గుర్తించవలయును.

# రైతు రక్షణ యాత్ర గురించి 11-3-1938వ తేదీన జమీన్‌రైతు పత్రిక వ్రాసిన సంపాదకీయం

# "రైతు దళం"

ఇచ్ఛాపురం నుండి 1500 మైళ్ళు కాలినడకను యాత్రను సాగిస్తూ మా నెల్లూరు మండలంలో కాలిడిన ఆంధ్ర రైతుదళం వారికి సుస్వాగతము !

ఈ యాత్రామూల సూత్రము లెరుగ లేని కొందరు పరదకీర్త్యసహన ఈర్ష్యా దుర్విదగ్ధులు మిమ్ము పరిహసించినంత మాత్రాన మీ నిష్కామ కర్మకు లోటు రాదు. మీ ఆదర్శం విశాలము. మీ ధర్మ చింతన మపారము. ఈయాత్రోత్పన్నములో యావద్భారతానికి మీదే ముందడుగు. లోకానికంతకు క్షుద్బాధ నడగించి తాను భార్యాబిడ్డలతో పస్తుపడుకొని హేయ జీవితాన్ని గడుపుచు కింకర్తవ్యతా మూఢుడై దీర్ఘ నినాముద్రితుండగు రైతును వాకిడటముందర కేగి తట్టి లేపు నీ ప్రచార రహస్యములు కార్యకారియగు నప్పుడుగాని స్థూల దృష్టులకు గోచరించవు. రైతులోక మిప్పుడుపుడు మేల్కొనుచున్నది. సర్వస్వము కొల్లగొట్టబడిన తన జీర్ణ కుటీరాన్ని, సర్వశక్తులు ఉడిగింపబడిన తన శిధిలదేహాన్ని, అస్థిజీవము అరగిన తనశల్యావశిష్ట పశుగణాన్ని గాంచి కన్నీరు గార్చుచున్నది. స్వాతంత్ర్య జ్యోతికోసం అఱ్ఱులెత్తి అన్వేషిస్తున్నది; బంధవిముక్తి కోసం ఆహాకారాలు సల్పుచున్నది. ఇదీ నూత్నతృష్ణ రైతులోకంలో ఆవరించి చేస్తున్న సంచలనం.

కాంగ్రెస్ 50 సం॥ల నుండి జాతీయ సంస్థగా ఉన్నను పల్లెటూళ్ళపాతుకదల్ప లేకపోయింది. శాంతిదూత గాంధీమహాత్ముడు కాంగ్రెస్‌లో ప్రవేసిస్తుండగానే సామాన్య జనాన్నంతా జగన్నాధరధంలాగా లేరమ్మని బాగా ఊదాడు. జవహరిలాలుడు కేకవేశాడు. స్వామి సహాజానంద - రంగాలాంటి ప్రాంత నాయకులు మేలుకొలుపులు బాడి వాకిళ్లముందర కరిగి తట్టి లేపారు. ఆ పిలుపులే - ఆ కూతలే - ఆ మేల్కొలుపులే నేటి రైతులోకాన్ని మేల్కొల్పిన ఈశ్వర సందేశాలు.

ఈ మహాసంఘ సంచలనాన్ని జూచి కొంతమంది సంకోచపడు చున్నారు. కొంతమంది భయపడుచున్నారు. కొంత మంది ఆశ్చర్యపడుచున్నారు. కాని ఈ చెలియలికట్టలేని మహాసముద్రాన్ని సద్వినియోగం చేసుకోవడంలోనే నాయకుల ప్రతిభ బైటపడుతుంది. అపార్థపిల్ల తెమ్మెరలచే గిలిగింతలు బెట్టబడ్డ ఈ పిల్లనాయకులు - ఈ సబ్‌నాయకులు - ఈ డిప్టి నాయకులు - ఈ ఆశిస్టాంటునాయకులు - ఈ కల్ల నాయకులు తమ చేతగానితనాన్ని ప్రకటించుకొని ఆ వృద్ధ తపస్వి పాదాల ముందు బెట్టితే దీని మూలసూత్రమెరిగించిన ఆ మహామహుడు ఒక్క నిమిషంలో పరిష్కరిస్తాడు.

లాహోరు రైతు సంఘటనంలో గూడ రాజేంద్రబాబు వంటి రాజకీయవేత్త గూడ పప్పులో కాలువేశాడు. స్వామి సహజానంద సరస్వతివంటి రైతు నాయకుల్ను మహాత్ముని

సాన్నిధ్యంలో జేర్చి ఉచితవిధంగా పరిష్కరించలేక తప్పుదారితొక్కారు. అది మొదలు ఆ పడవ యీనాటికి ఒడ్డు చేర్చలేక తడబడుచున్నారు. చెంగగొట్టడం సులభం, కూడదీయడం కష్టం ఏకార్యమైనా.

నేడు ఆంధ్రదేశ రైతు ప్రబోధం గూడ భారతదేశంలో ముఖ్యస్థానం వహించింది. పెద్ద నాయకులంతా ప్రత్యేక రైతు సంఘాలుండాలంటున్నారు. కాంగ్రెసు సంస్థ గూడా ఆశీర్వదించింది.

ఇకముందు రైతుకోటి తన స్వంతనోటితో తనవాణితో - తన శక్తితో - తన గోడును వినిపిస్తానంటున్నది. ఇది మాతృదేవి కాంగ్రెసమ్మపట్ల అపచారమంటారు. కొందరు హ్రస్వనాయకులు. ఆయమ్మే - ఆ మాతృదేవే - తన బిడ్డల్ను, మీమీ స్వీయకంఠాలతో వేదనాగీతాన్ని పాడమంటుంటే ఈ చిన్నదద్దమ్మలకెందుకు కడుపుమంట ?

ఎవరేమనుకొన్నా రైతులోకం మేల్కొన్నది. తనక్షుధ తీరిస్తేగాని ప్రపంచాన్ని అడుగుబెట్టనీనంటున్నది. తన కోర్కెలను అర్థిస్తున్నది. ఇది ప్రపంచ రాజకీయ పరిణామ చరిత్ర. చదివినవారికి ఆశ్చర్యాన్ని గొల్పదు. రోడ్లను రాసిర్వ స్వీకారపక్ష కాంగ్రెస్‌వాదులు. "మీ కోసరమేగదా మేం దస్త్రం తీసుకున్నది. మీరడక్కూడదు మేం చేసేదానితో తృప్తిపడండి" అంటారు. రైతుకోటి అంటదిగదా ? "అసంతృప్తి సంతృప్తికి హేతువు. నాయాకలేందో ? నా యభిరుచేందో ? నా కోర్కెందో ? చెప్పుకోడానికీ గూడ నీ వాకట్టేమిటి ? చింతకాయలకు ఆజ్ఞగాని గుటకలకుగూడా ఆజ్ఞేనా' అమ్మయినా అడగందే పెట్టదుగదా ? అదిగాక మీరు చవితితల్లిబిడ్డల్ను - రాక్షసబిడ్డల్ను- జంతుబిడ్డల్ను గూడా రక్షించాలసిన భారం మామీద ఉంటున్నదంటారు. అలాంటప్పుడు పెద్దనోరుతో మా చవితితల్లి బిడ్డలు బిగ్గరగా అరుస్తూ వారి ఆకలే పెద్దదనుకొని మా కడుపు మాడుస్తారు గదా ? కావున మా నిర్దుష్టమైన కోర్కెలేమిటో చెప్పేతీర్తాము" అంటారు. దీనికే డిసెప్లైనరీ ఆక్షననీ - ఇంకా ఏమేమో పెద్ద పెద్ద మాటలు ప్రయోగిస్తుంటారు. కొందరు కాంగ్రెసు ప్రభువులు, తమదే నిర్దుష్టమైన దేశభక్తనీ, రైతులు దేశభక్తిలో కుంటుబడ్డ లంగ్డాలనీ, వాగుతుంటారు. దీనికి అపభ్రంశ వాగుడని పేరు. కాంగ్రెసు పెద్దలు వీటిని సరకుచేయక సవరణ చేస్తుండాలని మా ఆశయం.

ఇంకా యీ యాత్రల ఉద్దేశం కాంగ్రెస్ మూడు సంగా పరితపించే "మాస్ కాంటాక్టు' అనేదే. ఈ రైతు దళంవారు పల్లెటూరి ప్రజల లెగ్గొట్టుతూ, వారికోర్కెల, వారి అర్జీల, వారి కన్నీటి ముక్తాఫలాల మోసుకపోతున్నారు. కాంగ్రెసు మంత్రుల పాదాల ముందు సమర్పించడానికి.

ఓ నెల్లూరు మండలీయులారా ! ఈ యాత్రా రైతుదళం వారికి అపూర్వ స్వాగతమివ్వండి. పల్లెటూళ్లలో పాతుబెట్టుకొని ససేమిరా యని ఎదురు తిరిగే కష్టపరంపరల దళంవారి హృదయకోశంల్లో చిత్రించండి. పల్లెటూరి ఋణభారాన్ని తూకమేసి చూపండి. అందచందాలతో ఉత్సవాలు జేసుకునే లంచాలమాదిరి దర్శింపజేయండి. జమీందార్లనే వేటకాళ్లచేత వేటాడబడే మానవ మృగజాతిని చూపండి. 1931 ఆగస్టు మొదలు అహర్నిశం

వెంకటగిరి ఎస్టేటు భూతం నమిలి పారవేసిన టెంకెలనంతా చూపండి. కూలబడిపోయి కోల్కోలేని సంసారాలు దర్శింపజేయండి. ముని కడపట్లోరాయినాటి ఇక్కడ నుండీ నాయడివేనని బిడ్డను, గొడ్డును, గోడు గోడు మనిపించే దృశ్యాన్ని చూపండి. అది ఇది అననేల మీ నిత్యజీవితంలో మీరనుభవించే సకలబాధల వర్ణించి చెప్పండి. ఆ దృశ్యాల చూపండి. ఆ కథల కన్నీటి ధారతో విజ్ఞప్తులు వ్రాసి యివ్వండి.

ఓ ఆంధ్రరైతుదళాధిపా ! మా రైతాంగం గోడును, నటుడు స్థానం నరసింహరావు మాదిరి హృదయానికెక్కించుకో ! బళ్ళారి రాఘవాచారిమాదిరి తన్మయుడివిగా అనుభవించుకో! గజేంద్రుడుగా "నీవే తప్ప యితఃపర మెరుగరీనిర్భాగ్యులౌ రైతులు" అని శ్రీమాన్ రాజగోపాలా చారిగారి పాదాలమీద పడవేయండి. ఆ ప్రధాని ఈ దుఃఖాన్ని భరింపలేక ఎలుగెత్తి ఏడ్చేట్టు చేయండి ! ఆనాడు రైతులు ధన్యాత్ములు; కాంగ్రెసు మంత్రులు ధన్యాత్ములు.

నిజంగా ప్రజలనుభవించు యీ దుర్భర నికృష్టజీవితాన్ని ప్రజా ప్రతినిధులగు మంత్రులు తెలుసుకొనెట్టు చేయడమే రైతుల అధమకోర్కె. తర్వాత ఈశ్వరాజ్ఞకు నిరీక్షణం. ఆయాజ్ఞకోసరమే ఆశేష ప్రజ కాచుకోనున్నది. ఆనాడు కులకక్షలు లేవు. రైతు కాంగ్రెస్ భేదం లేదు. మంత్రం ఒక్కటే ! కంఠం ఒకటే ! దేవాలయం ఒక్కటే ! అదే దాశ్యశృంఖలా విచ్ఛేదనా దినం. దానికొరకే ఈ యాత్రారాదనంతా గూడా.

**- జమీన్ రైతు, 11-3-1938**

History of Freedom Struggle in A.P.

A.P. State Archives (Vol. Year 1937)

# SELECTED EXTRACTS FROM THE CONFIDENTIAL G.O'S RELATING TO CIVIL DISOBEDIENCE MOVEMENT IN ANDHRA 1937.

G.O. No. 2276 Public (General) 1937 Department, dated 26-11-1937.

**Abstract :** Legislative Assembly Question - September 1937 - Andhra Peasants' March to Madras - C.I.D. reporter accompanying party and recording speeches made.

**Extract from proceedings of the Legislative Assembly, dated 22-9-1937.**

***208 Q. —Mr. K.V. Narayana Rao :** Will the Hon. the Prime Minister be pleased to state whether it is a fact that Mr. K. Satya Narayanamurti, one of the Joint Secretaries to the Andhra Provincial Congress Committee, who is leading a batch of peasants to present a petition to the Assembly is being followed by the C.I.D. reporters ?

**The Hon. Mr. C. Rajagopalachariar :** "Without admitting the statements made in the question as to the composition and character of the marchers, the answer is in the affirmative, i.e., a reporter is accompanying the party and recording the speeches made."

**Mr. K.V. Narayana Rao :** "Is it to cow down the peasants who are coming to the meetings ?"

**The Hon. Mr. C. Rajagopalachariar :** "It is not to cow down, the peasants, but to report the speeches made on the occasion."

**Mr. K.V. Narayana Rao :** "Ordinarily they will not attend the meetings; why this special attendance of the C.I.D. in case of the peasant meetings?"

**The Hon. Mr. C. Rajagopalachariar :** "As far as I am informed, Sir, reporters ordinarily do attend meetings and take down speeches; for it is the duty of the Government to be aware of what is going on in the country."

E.H. Colebrook Esq., M.C.,
Superintendent of Police,
S.B., C.I.D., Madras.

**STRICTLY CONFIDENTIAL**

Office of the Deputy Inspector-General of Police,
Railways and C.I.D., MYLAPORE,
Madras, S.,
Dated the 5th September, 1937.

No. 2413/C

My dear Munro,

Peasant March - Details - your D.O. No. 30466-1 dated 3rd September 1937.

1. The strength of the party has constantly varied, when it started from Ichchapur on 3rd July there were 5 persons in it - 2 socialists and 3 office-bearers of the Andhra Provincial Ryots Association. In Visakhapatnam district 15 persons joined the party for short periods, when it entered East Godavari district on 23-7-1937 its strength was 7. In that district 3 Visakhapatnam men left it and 8 local socialists joined, the same process occurred in West Godavari district where N.G Ranga and his wife joined for two days. The party entered Krishna district on 24th August, on 27th its strength was only 5. Only two of those who started from Icchapur on 3rd July remain with the party and one of those was absent for about 3 weeks and then rejoined. At times villagers have joined the marchers for a few miles.
2. There are no peasants (agricultural Labourers) with the party. Some of the socialists who have joined for short periods may be petty landholders but their interests are entirely political.
3. A shorthand Sub-Inspector is accompanying the party and records speeches made by marchers. The speeches are socialistic and would be reported in the normal course even were the speakers not connected with this march.

Yours sincerely,

**J.B.L. Munro** Esq., I.C.S.,
Under Secretary to Government,
Public Department, Madras.

Extract from the Fortnightly Report for the Second half of July 1937 of District Magistrate Visakhapatnam, dated 29-7-1937.

During the course of the month, a so-called Peasants' March took place from Ichchapur in the north to the border of the East Godavari District, which was reached on the 23rd July 1937. A number of villages were visited and speeches were made but no peasants of ryots joined the party, all being much too occupied during the cultivation season. The speeches chiefly consisted in criticism of the Zamindari System and after the departure for Madras of Mr. P. Syama Sundara Rao, M.L.A., who led the party for some time, the speeches became more socialistic in tone, with references to Russia etc., but continued to criticise the Zamindari System. Very little interest was taken anywhere in the party, who expressed their disappointment at the response, financial and otherwise throughout the District."

Extract from the Fortnightly Report for the first fortnight of August 1937, of District Magistrate East Godavari, dated 13-8-1937.

**Political :** "The Peasants' March proceeded slowly in the district according to the programme fixed. There were practically no peasants in this march. From the frequent references to Russia and the attacks on the Zamindari system made in the speeches, its real object was to do propaganda on Socialistic lines. Slogans like 'Down with Imperialism', 'Down with Capitalism', 'Down with Zamindari System', 'Long Live Revolution' were frequently shouted in the course of the march. Except in Gollala-Mamidada which contains rich money-lenders, they were received with enthusiasm throughout. A sum of Rs. 200/- was collected for their expenses.

# ఆంధ్ర రైతు రక్షణ యాత్రలో పాల్గొన్న యోధులు



సర్దార్ గౌతు లచ్చన్న



శ్రీ నందూరి ప్రసాదరావు



శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య



శ్రీ పరకాల పట్టాభిరామారావు



శ్రీ మాగంటి బాపినీడు



శ్రీ గారపాటి సత్యనారాయణ



శ్రీ అన్నే వెంకటేశ్వరరావు



శ్రీ వంకినేని సత్యనారాయణ



శ్రీ పొన్నం వీరరాఘవయ్య



శ్రీ వై.వి. కృష్ణారావు

